# మేధావుల మెతకలు

('మిసిమి' నుండి పునర్ముద్రితం)

రచయిత : అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి

"మిసిమి" ప్రచురణ
హైదరాబాద్

**మేధావుల మెతకలు**
రచయిత : **అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి**

ప్రథమ ముద్రణ : 1997 నవంబరు 4

© "**మిసిమి**"

920.02
VEN

ప్రతులు : 1,000

ముఖచిత్రం : **రహ్మాత్ అలి**
బ్యాక్ కవర్ ఛాయాచిత్రం : **భూషణ్**

టైప్‌సెట్, డిజైన్డ్, ప్రింటెడ్ ఎట్ :
**కళాజ్యోతి ప్రాసెస్ లిమిటెడ్,**
1-1-60/5 ఇష్తేకర్ లేన్,
ముషీరాబాద్, హైదరాబాద్ - 500 020
ఫోన్స్ : 7645536, 7612436

ప్రతులకు :
**పల్లవి పబ్లికేషన్స్**, కారల్ మార్క్స్ వీధి
ఏలూరు రోడ్డు, గవర్నర్ పేట
విజయవాడ - 520 002

వెల : రు. 25/-

# ఒక మాట

భావాలు వాటంతటవి నిలబడలేవు. వాటికి భౌతిక ఆశ్రయం కావాలి. అవి అక్షర రూపం పొంది గ్రంథాలు కావచ్చు. దృశ్యరూపం పొంది రంగుల్లో చిత్రాలుగా, ఆకృతులలో శిల్పాలుగా, శబ్దరూపం పొంది సంగీతంగా, రికార్డుల్లో, టేపుల్లో, చలన రూపం పొంది నృత్యభంగిమల ముద్రలుగా ఉండవచ్చు. భౌతికాశ్రయం ఆ భావాలకు మనుగడను, నిలకడను, ఒక రకంగా, శాశ్వతత్వాన్ని కల్పిస్తుంది.

నా భావాలకు, ఆలోచనలకు శాశ్వతతను కల్పించిన వారు డా. ఆలపాటి రవీంద్రనాథ్. నాకు ఆయనతో ఉన్న సాన్నిహిత్యంతో, ''నాలోకి'' ఆయన తొంగిచూసి, నన్ను ''రాయమని'' ప్రోత్సహించారు. ఫలితం సిగ్మండ్‌ఫ్రాయిడ్. దానిని ఆయనే తెలుగు అకాడెమీ, హైదరాబాద్, వారిచేత పరిశీలింపజేశారు. ఫలితం ఇప్పుడు అకాడెమీ దానిని నాలుగోసారి ముద్రిస్తోంది. తరవాత నా ''స్వప్న సందేశం'' (కలలకు శాస్త్రీయంగా అర్థం చెప్పడం ఎలా?) పుస్తరూపం దాల్చడానికి ఉపాదాన కారణం, ఆదర్శకారణం, పదార్థకారణం – అన్నీ ఆయనే. ''ప్రేమించడం ఒక కళ'' నా చేత అనువదింప చేసిందీ ఆయనే.

తరవాత, 'మిసిమి' ని 1990లో ఆయన స్థాపించినప్పటి నుంచి నాకు దానితో అత్యంత సన్నిహిత సంబంధం ఉంది. దానికి పూర్తిరూపు రేఖలు కల్పించింది ఆయనే. నాది సహాయక పాత్ర మాత్రమే. దానిలో నాచేత ''మేధావుల వెతకలు'' శీర్షికక్రింద ''గొప్పవాళ్ళ చీకటి జీవితాలు'' రాయించింది ఆయనే. దానికి కావలసిన గ్రంథాలు అందించిందీ ఆయనే. అలాగే 'మధురవాణి ఇంటర్వ్యూలు' శీర్షికకు గూడ ప్రోత్సాహం ఆయనదే. ఈ రెండు శీర్షికలు పాఠకలోకాన్ని బాగా ఆకట్టుకోవడంతో, వాటికి గ్రంథరూపం ఇవ్వాలని ప్రణాళిక వేశారు. ''మధురవాణి ఇంటర్వ్యూలు'' ఆయన వర్ధంతి నాడు (వాస్తవానికి వర్ధంతి ఫిబ్రవరి 11 అయితే, మార్చి 23న జరిగింది) ఆవిష్కారమైతే, నవంబరు 4, జయంతి నాడు, మేధావుల వెతకలు వెలుగు చూస్తోంది.

ఈ రెండు గ్రంథాలు వాస్తవం కావడం ఆయన చూడలేక పోయినా, ఆయన తనయులు బాపన్న, దేవేంద్రనాథ్‌లు, ఆయన ప్రణాళికను యథార్థీకరణం చెందించారు. అందుకు వారెంతో అభినందనీయులు. వారికి రచయిత హృదయపూర్వక కృతజ్ఞతాంజలిని అందజేసు కొంటున్నాడు.

ముఖచిత్రాన్ని అందించిన రహ్మత్ అలీకి, జాగ్రతగా, అందంగా అచ్చొత్తిన కళాజ్యోతి ప్రాసెస్ లిమిటెడ్ సిబ్బందికి, ప్రూఫ్‌లు దిద్దిన నరేష్ నున్నాకు కృతజ్ఞతలు.

– *రచయిత, 25 అక్టోబరు 97.*

# విషయసూచిక


పరిచయం :

జస్టిస్ పి.ఎ. చౌదరి విమర్శ - నా సమాధానం. (91 ఏప్రిల్ మిసిమి) 1

కారల్‌మార్క్స్ (91 జనవరి మిసిమి) 9

జాన్‌పాల్ సార్త్ర (91 ఫిబ్రవరి మిసిమి) 20

రసెల్ (91 మార్చి మిసిమి) 33

లియోటాల్ స్టాయ్ (91 మే మిసిమి) 46

రూసో (91 జూలై మిసిమి) 60

ఎర్నెస్ట్ హెమింగ్వే (91 సెప్టెంబర్ మిసిమి) 71

హెన్రిక్ ఇబ్సన్ (91 నవంబర్ మిసిమి) 83

పెర్సీబిష్ షెలీ (91 ఫిబ్రవరి మిసిమి) 94

# ఇతర రచనలు

| | |
|---|---|
| సిగ్మండ్ ఫ్రాయిడ్ | (తెలుగు అకాడెమీ హైదరాబాద్) |
| సంస్కృతీ విన్యాసం | (తెలుగు అకాడెమీ హైదరాబాద్) |
| ఇంటర్మీడియట్ తర్కశాస్త్రం | (తెలుగు అకాడెమీ హైదరాబాద్) |
| మనోవిజ్ఞాన శాస్త్ర పరిచయం | (తెలుగు అకాడెమీ హైదరాబాద్) |
| సమాజ మనోవిజ్ఞాన శాస్త్రం | (తెలుగు అకాడెమీ హైదరాబాద్) |
| మనోవిజ్ఞాన శాస్త్ర పారిభాషిక పదకోశం | (తెలుగు అకాడెమీ హైదరాబాద్) |
| సమాజ శాస్త్ర సూత్రాలు (సంపాదకుడు) | (తెలుగు అకాడెమీ హైదరాబాద్) |
| స్వప్న సందేశం (కలలకు అర్థంచెప్పడం) | (పల్లవి పబ్లికేషన్స్ విజయవాడ) |
| మనసు మర్మం | (పల్లవి పబ్లికేషన్స్ విజయవాడ) |
| ప్రపంచ ప్రసిద్ధ మతాలు | (పల్లవి పబ్లికేషన్స్ విజయవాడ) |
| లఘు విజ్ఞాన సర్వస్వం | (పల్లవి పబ్లికేషన్స్ విజయవాడ) |
| మానవీయ బుద్ధ | (పల్లవి పబ్లికేషన్స్ విజయవాడ) |

**అనువాదాలు**

| | |
|---|---|
| మనోవిజ్ఞాన శాస్త్రపరిచయం | (తెలుగు అకాడెమీ హైదరాబాదు) |
| మరుగున పడ్డ వారసత్వం | (తెలుగు అకాడెమీ హైదరాబాదు) |
| మహాత్మగాంధీ (నెహ్రూ రచన) | (తెలుగు అకాడెమీ హైదరాబాదు) |
| వేదదేవతలు | (తెలుగు అకాడెమీ హైదరాబాదు) |
| ప్రేమించడం ఒకకళ | (పల్లవి పబ్లికేషన్స్ విజయవాడ) |
| శ్రీ అరవిందుల విశ్వదర్శనం | (శ్రీ అరవిందో సొసైటీ తెనాలి) |
| నిశీధిలో నిర్గమనం | (ప్రభాత్ పబ్లిషర్స్, తెనాలి) |
| అందరికీ ఆవశ్యకమైన భౌతిక విజ్ఞానం (ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ బహుమతి) | (సదరన్ లాంగ్వేజెస్ బుక్ ట్రస్ట్, మద్రాసు) |

# పరిచయం

(మామూలుగా గ్రంథాన్ని పరిచయం చేస్తూ రెండు మాటలు రాయడం ఎవరికైన ఆనవాయితీ. కాని నేను సంప్రదాయాన్ని తప్పించి కొత్త పద్ధతిలో ఈ గ్రంథాన్ని పరిచయం చేస్తున్నాను. నేను 'మిసిమి'లో రాసిన మేధావుల కృష్ణపక్షానికి జస్టిస్ పి. ఎ. చౌదరి ఉద్విగ్నతతో ప్రతిస్పందించి, 'సంపాదకునికి ఒక లేఖ' శీర్షికతో, 91 ఏప్రిల్‌లో, అప్పటి మిసిమి సంపాదకులకు ఒక విమర్శనా లేఖ రాశారు. ఆ లేఖను సంపాదకులు నా ప్రతిస్పందన కోసం నాకు పంపారు. నేను దానికి 'నాసమాధానం' పంపాను. విమర్శనా లేఖను – నా సమాధానాన్ని 1991 ఏప్రిల్ మిసిమి సంచికలో ప్రచురించారు. ఆ రెండింటిని ఇక్కడ పునర్ముద్రిస్తున్నాం. దీనినే నా యీ గ్రంథానికి పరిచయంగా భావించవచ్చు.)

– రచయిత

**'సంపాదకునికి ఒక లేఖ'**

తెలుగులో సీరియస్ జర్నల్స్ లేకపోవడం మన సమాజానికి తీవ్రమైన లోటుగా భావించాలి. మార్కెటులో అలాంటివి నిలవ లేక పోవటానికి గల కారణాలను వెదికి చూస్తే ఒక ముఖ్య కారణం, మనం ఈనాడు అనుసరిస్తున్న బిట్టు – ఆన్సరు విద్యావిధానమేమో అనిపిస్తుంది. ఈ పద్ధతి వల్ల ఈనాటి సెకండరీ విద్యావిధానం చాలా లొసుగుల్లో మునిగి పోయింది. ఉదాహరణకు కారల్ మార్క్స్ —— వ్రాసాడు. (వేదం, బైబిల్, పేంప్లెట్, కాపిటల్) అన్న ప్రశ్నకు వెంటనే జవాబు రాయగల విద్యార్థి సయితం మార్క్స్ వ్రాసిన కాపిటల్ గురించికాని, దాని పూర్వాపరాలను గూర్చికాని ఏమి తెలుసుకోనక్కర్లేదు. అట్లాగే కవిరాజు ——— వ్రాసాడు. (విరాటపర్వం, భాగవతం, విష్ణుపురాణం, ఖూనీ) అన్న ప్రశ్నకు సమాధానం వ్రాయగల విద్యార్థికూడా. పూర్వపు రోజుల్లోనైతే కాపిటల్‌ని గురించికాని, ఖూనీని గురించిగాని కొంతలో కొంత విద్యార్థికి తెలిసి ఉంటే కాని ఆవిషయంపై పది పంక్తులు వ్రాయనలవి అయ్యేది కాదు. ఆనాటి బోధనా పద్ధతిద్వారా విద్యార్థికి విషయ పరిజ్ఞానం కొంతలో నీతిచంద్రిక చదవకుండానే చిన్నయసూరిని పొగడవచ్చును. Erich Fromm పేరయినా వినకుండానే

ఆయన ఫిలాసఫీతో నేను ఏకీభవించ లేనవచ్చు. ఈ బిట్లు అన్నరు చదువులు ఏ మహనీయుడు మన నెత్తిన రుద్దాడో కాని అవి జర్నలిజానికి సరిపోతే సరిపోవచ్చు గాని పాండిత్యానికి పనికి రావని గట్టిగా చెప్పవచ్చు. సెకండరీ స్కూళ్లలో పునాదులు లేకుండా కాలేజీలో విజ్ఞానం ఎదగదు. అనేకులు సెకండరీ చదువులు దాటి కాలేజీలకు పోనూ లేరు. అందువల్లే గావచ్చు, మన జ్ఞానతృష్ణ క్రమేపి చల్లారి పోతుంది. సినిమా పత్రికకు ఉన్నవ్యాప్తి సాహిత్య పత్రికకు లేకపోవడం ఈ మానసిక దౌర్భాగ్యానికి గుర్తు. వ్రాతకు విలువ తగ్గి నోటి మాటతో జీవితం నెట్టుకొచ్చే రోజులు వచ్చాయి. కాబట్టే ఈ రోజు నిత్యం నడిచే ప్రెస్ కాన్ఫరెన్స్‌లు, సాహితీ సభలు పెట్టడానికి వీలవుతుంది. న్యాయవాద వృత్తిలో సయితం 'లాక్' (Locke) తో గానీ 'మిల్' (Mill)తో గాని పరిచయం ఉన్నవారు లోపించడానికి కూడా ఇదే హేతువు ఏమో. ఈలోపాన్ని ఎంతో కొంతగా పూడ్చడానికి మీ ''మిసిమి'' ప్రయత్నించడం ఎంతైనా ప్రశంసార్హం. ఖరీదైన పేపరు మీద చక్కని ముద్రణతో గెటప్‌తో కారుచవుకగా పత్రికని పాఠకులకు నెలనెలా అందించే మీరు అభినందనీయులు. అయితే ఈమధ్య మార్క్స్ మీద, రసెల్ మీద వచ్చిన వ్రాతలు నాకు చాలా మనస్తాపం కలిగించాయని చెప్పకుండా ఉండలేక పోతున్నాను. నవీన యుగంలో మానవ చరిత్రను ఒక మలుపు త్రిప్పిన వాళ్లలో మార్క్స్ అగ్రగణ్యుడు. ఐన్‌స్టీన్, ఫ్రాయిడ్, మార్క్స్‌లు నూతన భావనారీతికి అధినాథులన్న మాటల్లో కించిత్తైన అతిశయోక్తి లేదు. మార్క్స్ ప్రతిపాదించిన ఒరవడిలోనే ఈనాటివరకు మనం చరిత్రను అర్థం చేసు కొంటున్నాం. "Today's isms" అనే పుస్తకంలో Ebestain (pages 3,4) వ్రాస్తూ, "Our understanding of history has gained immensely from Marx's Economic interpretation. It is virtually impossible to write history today without some attention at least to the relation of economic forces and conflicts to political, military and international issues". అన్నాడు. గల్ఫ్ యుద్ధం జరగటానికి కారణం ఆయిల్ నిక్షేపాలపై అమెరికా ఆధిపత్యం కావాలను కోవటమేనని అందరు అంగీకరిస్తారు. కాని వారిలో ఎంత మందికి తెలుసు అలా అనుకుంటున్న సమయంలో, వాళ్లు శుద్ధ మార్క్సిస్టులాగా ఆలోచిస్తున్నారని. ప్రపంచ ఆర్థికశాస్త్రవేత్తల్లో పదిమందిని

లెక్కపెడితే అందులో మార్క్సుని ఒకనిగా లెక్కగట్టాలన్నాడు షుమ్‌పీటర్. దీని అర్థం మార్క్సుని దేవుని చేయాలని కాదు. ఆయన సిద్ధాంతాన్ని వక్రీకరించి మానవ జాతికి ఘోరమైన కీడు చేశారనేది నిజం. మార్క్సుపై ఇతరులు మోపే నిందలుగాని, చేసే మెప్పులుగాని నమ్మవలసిన అవసరం కూడా లేదు. ఆయన వ్రాసిన రచనలు పరిశీలించి ఆయన చేసిన సిద్ధాంతమేమిటో తేల్చి అది ఎలా తప్పో, ఎలా ఒప్పో చూపించ వచ్చు. దానికి బదులు ఆయన కోపిష్ఠి అని, ఆయన కాపియిస్ట్ అని, దోపిడీదారు అని రాసి, ఆయనను పండితుడు కాడని, శాస్త్రవేత్తకాడని, తూలనాడి ఆయనకు హెలన్‌తో ఉన్న సెక్స్యువల్ (Sexual) సంబంధాలను చెప్పి కించ పరచుతూ ఉండటం ఆ మహనీయుని ఉన్నతికి కాని, శాస్త్రవిజ్ఞానానికి కాని తగదని చెప్పవచ్చు. కాపిటల్‌కి ఆయన వ్రాసిన పీఠికలో పండితాభిప్రాయానికి తల ఒగ్గుతానేగాని, పామరుల అభిప్రాయానికి తల ఒగ్గ నన్నాడు. ఆయన నిర్మించుకున్న ఘనత ఇతరుల కితాబులపై ఆధారపడే అంత పేలవ మైంది గాదు.

ఇక రసెల్‌ను గురించి వ్రాసింది మరీ ఘోరంగా ఉంది. రసెల్ అరిస్టోక్రాటిక్ కుటుంబంలో పుట్టి, అరిస్టోక్రాటిక్ లక్షణాలయిన నిర్భయత్వం, సొంత ఆలోచన సొంత అభిప్రాయం కలిగి ఉండటం, మామూలు జన సందోహానికి దూరంగా ఉండటం లాంటి గుణాలను పుణికి పుచ్చుకున్నాడు. ఆయన తాత లార్డ్ రసెల్ విగ్ ప్రధానిగా మొట్టమొదటి సారి ఓటింగ్ హక్కుని విస్తృత పరిచాడు. ఆయన్ని పెంచిన ముత్తవ్వ ప్యూరిటన్ తెగకు చెందిన అతి ఉత్తమ క్రిస్టియన్ మతస్థురాలు. ఆమె దగ్గర నుంచి నేర్చిన బైబిల్ సూక్తి "Thou shall not follow a multitude to do evil", రసెల్ తన జీవిత నౌకాయానానికి చుక్కానిగా పెట్టుకొన్నాడు. మానవస్వేచ్ఛ కొరకు అహర్నిశలు శ్రమించాడు. అసహాయుల ఆక్రందనలు విని చలించాడు. మతస్థుల మౌఢ్యంతో విరామ మెరుగని పోరాటం సల్పాడు. నియంతల క్రూరత్వాన్ని ఎదిరించాడు. తన సుదీర్ఘ జీవిత యాత్రలో ప్రపంచంలో ఏమూలనైనా జరిగే దౌర్జన్యాన్ని, దుర్మార్గాన్ని ఎదిరించి పోరాడాడు. ఆ ధర్మయుద్ధంలో అనేకమంది మిత్రులను శత్రువులుగాను, శత్రువులను మిత్రులుగానూ చేసుకొన్నాడు. తన వ్యక్తిత్వాన్ని గురించి వ్రాస్తూ కన్సరేటివ్‌లు తనను ''లేబరైట్''నని, లేబరైట్లు సోషలిస్టునని, సోషలిస్టులు కమ్యూనిస్టునని,

కమ్యూనిస్టులు ఫాసిస్టుననీ, ఫాసిస్టులు తనను వారి యొక్క ప్రధాన శత్రువునని భావిస్తారని సగర్వంగా చెప్పుకొన్నాడు. సోవియట్ విప్లవం తరువాత రష్యాపోయిన మేధావు లందరిలోనూ రసెల్ ఒక్కడు మాత్రమే సోవియట్ విధానం నియంతృత్వానికి తప్పక దారితీస్తుందని వ్రాసాడు. ఒక ప్రక్క శాస్త్రజ్ఞానాభివృద్ధికి సంతోషిస్తూ, వేరొక ప్రక్క సృష్టి రహస్యం దొరక దేమోనన్న సందేహంతో బాధపడుతూ, మానవ సేవకి తన జీవితాన్ని అంకితం చేసిన సత్య ప్రియుడు. ఒక ప్రక్క సోషలిస్టునని చెప్పుకుంటూనే ప్రపంచంలో ఉన్న అన్ని సోషలిస్టు ప్రభుత్వాలని మనస్ఫూర్తిగా ఎదిరించాడు, ఖండించాడు. మానవాళి మనుగడకు అణుబాంబు యుద్ధం ఎంత ప్రమాదకరమో ప్రపంచానికి తెలియచెప్పిన శాస్త్రజ్ఞుడు ఆయనే. వియత్నాం యుద్ధంలో అమెరికన్లు పౌరులపై జరిపిన అత్యాచారాలను, నిరపరాధులయిన శాకోవాంజిటిలను అమెరికన్లు ఉరితీయటాన్ని ఆయన ఏనాడు క్షమించ లేక పోయాడు. పాతని అంగీకరించలేక క్రొత్తని ఆహ్వానించలేక జీవితమంతా మనోవ్యాకులత పాలయ్యాడు. ఒక్క గణితంలోనే certainity ఉందని సంతృప్తిపడ్డాడు. **1913**లో వైట్‌హెడ్‌తో కలిసి Principia Mathematica వ్రాసి విజ్ఞాన ప్రపంచంలో తన కాంతి ప్రతిష్ఠలను శాశ్వతంగా నిర్మించుకున్నాడు. ఆయన సలిపిన కృషి ఫలితంగా గణిత శాస్త్రం, తత్వశాస్త్రంగా క్రొత్త అర్థాన్ని పొందింది. కొందరు తమ చనిపోయిన భార్యల అక్కచెల్లెళ్లను పెండ్లాడతారు అన్న సులభమయిన నాలుగు మాటల్ని తాను వ్రాయ దల్చుకుంటే కొన్ని ఏండ్లు కృషి చేస్తేనేగాని అర్థం కానంత జటిలంగా వ్రాయగలనన్నాడు. మేధావులకిచ్చే అత్యున్నతమైన 'ఆర్డర్ ఆఫ్ మెరిట్' అవార్డు చివరి దశలో బ్రిటిష్ రాజు చేతుల్లోనించి స్వీకరించాడు. సాహిత్య రంగంలో ఆయనకు **1950**లో నోబెల్ బహుమతి లభించింది.

సైన్సుద్వారా, శాస్త్రంద్వారా ఇక్కడికిక్కడనే భూతల స్వర్గం నిర్మించవచ్చని ఆకాంక్షించాడు. దౌర్జన్యానికి, దారిద్ర్యానికి అవసరం లేదన్నాడు. శాంతిని ప్రేమించి యుద్ధాన్ని వ్యతిరేకించి రెండు, మూడుసార్లు జైలుకు పోయాడు. అందులో వృద్ధాప్యంలో కూడా. బ్రిటిష్ అరిస్టోక్రసీ తన బాధ్యతలను తను సరిగా నిర్వహింప చేయటం కోసమే ఆయన చేసిన పోరాటమంతా ఏమోననిపిస్తుంది. ఇలాంటి మేధావిని Complex personality ని కేవలం

స్త్రీలోలుడుగా, తిరుగుబోతుగా చిత్రించడం కంటే మించిన మహాపాపం మరొకటి ఉండదేమో. ఆయన లేని లోపం మొన్న గల్ఫ్ యుద్ధంలో కొట్టవచ్చినట్లు కనిపించింది.

వాస్తవాలు చదవకుండానే రసెల్ పై వ్యాసం వ్రాసారు అని నిరూపించటానికి రెండు ఉదాహరణలు చెప్పి ఈ వ్యాసం ముగిస్తాను. మిసిమి ఆరవ పేజీలో న్యూయార్కు సిటీ విశ్వవిద్యాలయపు ఆచార్యత్వం ఊడిపోవటంతో రసెల్ అమెరికానుంచి తరమబడ్డట్లుగా వ్రాసారు. ఇది సత్యమైన మాటకాదు. సిటీ విశ్వవిద్యాలయపు ఉద్యోగం పోయిన తరువాత కూడా రసెల్ అమెరికాలోనే ఉండి తన ఉపాధ్యాయ వృత్తి సాగించాడు. అనేక ఉపన్యాసాలు యిచ్చాడు. అలాగే ఐదవ పేజీలో వైట్ హెడ్‌తో కలిసి రసెల్ వ్రాసిన ప్రిన్సిపియా మేథమాటికాకు నోబెల్ బహుమానం వచ్చింది అని వ్రాసారు. ఇదికూడ ఇంకొక అసత్యం. ప్రిన్సిపియా మేథమాటికా వ్రాసిన తరువాత సుమారు **40** ఏండ్లకు రసెల్‌కు **1950**లో సాహిత్యానికి నోబెల్ బహుమతి ఇచ్చారు.

ఎన్ని తప్పులు ఉన్నప్పటికి రసెల్‌ని గురించి బాధాకరమైన అసత్యాలు చెప్పనంతకాలం చిన్న చిన్న పొరపాట్లను ఎత్తిచూపడం తప్పని నా ఉద్దేశ్యం కాదు. నేను చివరగా చెప్పేదేమిటంటే రసెల్‌ను గురించి రచయిత తీవ్రంగా పరిశోధించకనే ఆవ్యాసం వ్రాసారని. భావస్పష్టత, భాషా సులభత, సత్యప్రమాణం లేని రచనలు చేయరాదన్న బ్రిటిష్ వారి నియమము మనందరికి శిరోధార్యం.

## రచయిత సమాధానం

'మేధావుల మెతకలు'ను నిశితంగా పరిశీలించి, సహృదయంతో చౌదరిగారు చేసిన విమర్శకు రచయిత కృతజ్ఞుడు.

పాత రోజుల్లో మతాచార్యులు, దైవజ్ఞులు, పూజారులు, ప్రవక్తలు సమాజాన్ని నడిపించారు. ఏలారు; మలిచారు. వారి ప్రభ కొడిగట్టింది. ఆ శూన్యాన్ని పూడ్చడానికి ఆధునిక చింతనులు లోకం తీరుతెన్నులను మలిచారు. మానవాళికి మార్గనిర్దేశం చేశారు. మార్గ నిర్దేశకత్వానికి వారికున్న

అర్హత లేమిటి? సత్యమంటే వారికున్న గౌరవం ఎంత? ఆ సత్యాన్ని వారెలా చేరారు? భార్య బిడ్డల (అక్రమ సంతతితో సహా) అంటే, స్నేహితులంటే వారికున్న గౌరవం ఏపాటి? వారి వ్యక్తిగత (అంతరంగిక), బాహ్య జీవితాల మధ్య అంతరం ఎంత? మొదలైన ప్రశ్నలకు సమాధానం చెప్పడమే ఈ శీర్షికలో జరుగుతున్న ప్రయత్నం.

ఈ ప్రయత్నంలో ఏ మేధావినీ కించ పరచడం రచయిత ఉద్దేశం కాదు. అసలు శీర్షికే 'మేధావుల మెతకలు' కనుక రెండు పక్షాలను - మేధనూ, మెతకలనూ - ప్రదర్శించడం జరుగుతుంది. వారంతా మహామేధావులు గనుక, వారి మేధను గురించి, గొప్పతనాన్ని గురించి ఇప్పుడు కొత్తగా చెప్పవలసింది ఏమీ లేదు గనుక, అందరూ ఎరిగిందే గనుక, రెండవ పక్షాన్ని గూడ కొంత చెప్పడం జరుగుతున్నది. "All or None" (అయితే పూర్తిగా అటు లేకపోతే పూర్తిగా ఇటు) సూత్రం అంటే నాకు మన్నన లేదు. పెద్దవారిలోనైనా లోపాలుండవచ్చని భావిస్తాను.

రసెల్ అంటే నాకు ఎంతో గౌరవం. ఆయన అభిమానిని. వారిని గురించి ప్రపంచానికంతా తెలుసు. అటువంటి వారి 'చీకటి పక్షాన్ని' గురించి రాయడం 'మహా పాప' మంటారు చౌదరిగారు. తన సెక్స్ ఉదంతాలను గురించి ఆయనే స్వయంగా తన స్వీయచరిత్రలో రాసుకొన్నాడు. వాటిని గురించి కల్పితమేమీ లేదు. ఆయనకు లేని పాపం మన కెందుకు? "Sin is geographical" అంటాడాయన ఒకచోట. భారతీయులకు అలా రాసుకోవడం పాపమేమో. ఆయన స్వీయ చరిత్రను చూస్తే విషయం ఎవరికైనా అర్థమవుతుంది. మచ్చుకు రెండుమూడు ఉదాహరణలు:

| | |
|---|---|
| 1) **1911** మార్చి **19** తేదీ<br>ఒటోలిన్ మారెల్‌తో వ్యవహారం<br>(మిసిమిపుట **9**, కాలమ్ **1**) | రసెల్ స్వీయచరిత్ర<br>(Unwin Paperback)<br>పుట **212** |
| 2) **1914** హెలెన్ డడ్లీతో<br>(మిసిమిపుట **9**, కాలమ్ **2**) | రసెల్ స్వీయచరిత్ర<br>పుట **270** **(11)** |
| 3) కాన్‌స్టన్స్ మాలెసన్‌తో **(1916)**<br>(మిసిమిపుట **10**, కాలమ్ **1**) | రసెల్ స్వీయచరిత్ర<br>పుట **249** **(11)** |

| | |
|---|---|
| 4) సిడ్నీ హుక్‌కు సలహా (మిసిమిపుట 11) | Sydney Hook (P. 208) (as quoted by Paul Johnson) |
| 5) ఆత్మకథ నుండి | తల్లి శీలాన్ని శంకించడం |

ఇలాగే రాసిన ప్రతిదీ ఆధార సహితమేగాని ఆధార రహితంగాదు. కాని చౌదరిగారు చూపిన రెండు దోషాలు:

1) "ఆ కోర్టు న్యాయమూర్తి .... అభిశంసించి అమెరికానుంచి పంపి వేశాడు". మిసిమి పుట **6**. 'పంపి వేయాలన్నాడు'కు బదులు 'పంపి వేశాడు' అని పడింది. పంపివేయబడలేదు. ఆయన అనేక సంవత్సరాలు అనేక విశ్వవిద్యాలయాలలో పాఠాలు చెప్పాడు, ఉపన్యాసాలిచ్చాడు. "పంపివేయాలన్నాడు"కు బదులు "పంపివేశాడు" అనే తప్పు దొర్లింది. ఈ కేసుకు సంబంధించి మరిన్ని వివరాలు కావలనుకొన్నవారు "The Bertrand Russell Case" (1941 Newyork). John Dewey and Horace M. Kellen చూడవచ్చు. ఈ విషయం రసెల్ స్వీయచరిత్ర పుట **461** Foote Note లో ఉంది.

మరో విషయం అయనే రాసుకొన్నాడు. "He should be tarred and feathered and driven out of country" అని న్యూయార్క్ సిటీ రిజిస్ట్రారు అన్నాడని రసెల్ అదే పేజీ పాదసూచికలో చెప్పాడు. అంటే ఆయునకు గుండుగొట్టించి, సున్నపు బొట్టుబెట్టి, దేశబహిష్కారం చేయమన్నాడన్న మాట.

2) రెండవ దోషం "Principia Mathematica .... రాశాడు. దీనికే నోబెల్ బహుమానం పొందాడు" (మిసిమి పుట 5) ఆయనకు **1950**లో సాహిత్యానికి నోబెల్ బహుమతి వచ్చిందని Correction ఏప్రిల్ సంచికలో వేయమని సంపాదకునికి రాశాను. ఈలోపే చౌదరిగారు దానిని ఎత్తి చూపారు ధన్యవాదాలు. నోబెల్ బహుమతి క్రింద ఆయనకు వచ్చిన బహుమానంలో చాలా భాగం మూడో భార్యకే పోయింది. (విడాకులు). **1960**లో Dannish Sonning Prize £ **5000** లు

(Tax Free) వచ్చింది. తన కంటే తక్కువ వారైన Eddington, White Head లకు ముందుగా Order of Merit వచ్చినందుకు బాధపడ్డా, చివరిలో ఐదవ జార్జిచక్రవర్తి ఆగౌరవాన్ని రసెల్‌కు కూడా ఇచ్చాడు. దొర్లిన రెండు తప్పులు ఆధారంగా వాస్తవాలు చదవకుండానే రాశానని చౌదరిగారు అనడం అంత న్యాయం కాదేమో. రసెల్‌ని, మార్క్సుని పూర్తిగా జీర్ణించుకున్నానని అహంకరించ లేను. కాని వినమ్రుడనై ఒక మాట చెబుతాను: ''నా వ్యాసాలకు సరిపోయినంత విషయాన్ని చూసే రాశాను:''

ఒకమాట: ఆమె దగ్గరినుంచి నేర్చిన బైబిల్ సూక్తి "Thou shall not follow multitude to do evil" రసెల్ తన జీవనయానికి చుక్కానిగా పెట్టుకొన్నాడని చౌదరిగారు రాశారు. కావచ్చు దీనివల్ల ఆయన క్రైస్తవావలంబకుడనే అపోహ కలిగేట్టుగా ఉంది. కాని ఆయన క్రైస్తవాన్ని అవలంబించ లేదు. "Why I am not a christian"? అనే గ్రంథం రాశాడు. ఆమె ప్రభావం ఆయనమీద ఏమీ పడ లేదు.

ఇహ బ్రిటీషువారి భావనా స్పష్టత, భాష సులభత, సత్య ప్రమాణం, విషయాలకొస్తే (చౌదరిగారు చివరలో రాశారు) ఆ నియమం ఆదరణీయమే. భావస్పష్టత, భాష సులభతలు, రచయిత, విషయం, పాఠకుడు అనే ముగ్గురిపై కొంతమేర ఆధారపడి ఉంటాయి. సామాన్య విషయాలు అందరికీ మామూలుగానే అర్ధమవుతాయి. విషయం విశిష్టమైనప్పుడు, రచయిత పాఠకుల అభివిన్యాసాలు (Orientations) భిన్నంగా ఉన్నప్పుడు, వారివారి సామాజిక - సాంస్కృతిక నేపథ్యాలు భిన్నమైనప్పుడు, బ్రిటీషు వారి సూత్రానికి కొంతమేరకు విఘాతం ఏర్పడుతుంది. తప్పదు.

సత్యం అందరికీ శిరోధార్యమే. ఏమైనా చౌదరిగారు శ్రద్ధగా వ్యాసాలు చదివి లోపాలు చూపినందుకు మరోసారి ధన్యవాదాలు.

*(91 ఏప్రిల్ మిసిమి)*

# కారల్ మార్క్సు

ఎవరు అవునన్నా, ఎవరు కాదన్నా ప్రపంచంలో మూడోవంతు మందిని అత్యంతంగా ప్రభావితం చేసినవాడు కారల్ మార్క్సు. స్త్రీల, పురుషుల మనస్సులను ఆకట్టుకొన్నాడు. ఇటీవలి ఐరోపా చరిత్రకు మలుపు నివ్వడంలో శ్రీకారం చుట్టాడు. కొంతమంది అతడంటే ఎంత తీవ్ర ఉద్వేగంతో ఆకర్షితులయ్యారో, మరి కొంతమంది, అంత తీవ్రంగాను వికర్షితులయ్యారు. ఈ ఆకర్షణ వికర్షణలకు మూలం ఆయనలో ఎక్కడ వుంది? ఆయన భావ శబలతలో ఉందంటారు కొందరు. మరికొందరు ఆయన సిద్ధాంతాలను అత్యంత నిష్ఠుర నియంతృత్వంతో స్టాలిన్, మావోలు అమలు జరపడంలో ఉందంటారు. ప్రపంచంలో అతి పెద్ద దేశాలైన చైనా, రష్యాలు, వాటి ఉపగ్రహ దేశాలు అమలు పరచడంలో ఉందంటారు.

ఏది ఏమైనా దర్శన నిర్మాతలలో చివరివాడు, భౌతిక వాదానికి తిరిగి ఊపిరి పోసినవాడు, దానికి నూతన అర్థాన్ని కల్పించి చరిత్రలో కొత్తముడి వేసినవాడు మార్క్సు. హెగెల్ వారసుడు; హెగెల్ లా మానవ పరిణామ క్రమాన్ని ఒకే ఒక హేతుత్వ సూత్రంతో నిబద్ధించ వచ్చునని నమ్మినవాడు.

ఎవరైనా తను పుట్టిన యుగ లక్షణాలను పుణికి పుచ్చుకోవలసిందే. మార్క్సు పందొమ్మిదవ శతాబ్ది మధ్యకాలపు లక్షణాల బిడ్డ అతడు. ఆ కాలాన్ని శాస్త్రం ఏలుతోంది. అందుకని అతడు – తననూ, తన దర్శనాన్ని ఇతరులనుంచి, ఇతర దర్శనాల నుంచి వేరుగా చూపించుకోవడానికి, తాను శాస్త్రీయం, తనవాదం శాస్త్రీయం అని చెప్పుకొన్నాడు. నిజంగా అతడూ, అతడివాదం అంత శాస్త్రీయాలా! డార్విన్ పరిణామ వాదంలా, చరిత్రలో మానవ ప్రవర్తనకు తానూ ఒక శాస్త్రీయ వివరణను కనుకొన్నా ననుకొన్నాడు ఆయన. '' ఏ ఇతర దర్శనం శాస్త్రీయం కాని విధంగా మార్క్సు దర్శనం మాత్రమే శాస్త్రీయం'' – అనే అర్థంలో కమ్యూనిస్టుదేశాల పాఠశాలల్లో, విశ్వవిద్యాలయాల్లో మార్క్సిజమ్ బాగా నాటబడింది; నింప బడింది. అది పొరిలి, ఒలికిపోయి మార్క్సేతర ప్రపంచంలోని కొంతమంది మేధావులను తాకింది. అధికారంతో

రంగరించి ఉగ్గుబాలు పట్టిన దేశాలు, మేధావులు మార్క్స్‌ని, మార్క్స్ దర్శనాన్ని శాస్త్రీయం అన్నారు.

మరి మార్క్స్ ఏ అర్థంలో శాస్త్రీయం? శాస్త్రం విషయాశ్రయం. అలాంటి జ్ఞానం కోసం వాస్తవ ప్రపంచాన్ని ఆశ్రయించాలి. మరి మార్క్స్ తన వాదాన్ని విషయాశ్రయం చేయడానికి వాస్తవ ప్రపంచాన్ని కేంద్రం చేసుకొన్నాడా? కేవలం అతడు గ్రంథాలయాలను, నీతి పుస్తకాలను (Blue Books = అధికారగ్రంథాలు) మాత్రమే ఆధారం చేసుకొన్నాడు. ప్రవృత్తి రీత్యా గూడ అతడు పుస్తకాల పురుగే.

అసలతడి వారసత్వాన్ని చూసినా, అతడి మాతాపితరుల వంశాలు రెండూ పండితుల కోవకు చెందినవే. అతడు **5** మే **1818**న పుట్టాడు. బాన్, బెర్లిన్ విశ్వవిద్యాలయాలలో చదివాడు. విజ్ఞాన సర్వస్వాల లాంటి బృహత్ గ్రంథాలు రాయాలని, అతడు గ్రంథాలయాల నుంచి విషయాలు సేకరించాడు. జెనా విశ్వవిద్యాలయం నుంచి డాక్టరేట్ పట్టాన్ని తీసుకొన్నాడు.

ఒకసారి తాను ఇలా వాపోయాడు: ''నేను పుస్తకాల పురుగుని అవ్వాలని శపింపబడ్డా కాబోలు!'' లోతుగా దిగిచూస్తే అతడంత పెద్ద పండితుడూ కాదు. ఆయన కోరుకొన్నట్లు శాస్త్రవేత్తా కాదు. సత్యాన్వేషణలో ఆయనకున్న ఆసక్తికంటే, దానిని ప్రకటించడంలో ఆయనకు ఎక్కువ ఆసక్తి ఉంది. అతనిలో మూడు ''చార'' లున్నాయి. ఒకటి, అతడు కవి. రెండు, పత్రికా విలేఖరి. మూడు, నైతిక వాది. అతడి కఠోరదీక్ష ఈ మూడింటితో కలిసి అతనిని ఒక మహారచయితగా, ద్రష్టగా మలిచాయి. ఇందులో శాస్త్రీయత ఏమీ లేదు.

అతడు ప్రప్రథమంగా కవి: చాలా మందికి అసలు మార్క్స్ కవి అనే విషయం తెలియదు. అతడి కవితా దృష్టే అతడి సిద్ధాంత భాగానికి గూడ రంగు పులిమింది. అతడు చిన్నప్పుడే కవనం రాయడం మొదలు పెట్టాడు. రెండే రెండు విషయాలపై అతడు కవిత అల్లాడు. ఒకటి ప్రేమ. రెండు ప్రళయం. ప్రేమ గీతాలన్నీ ప్రక్కింటి జెనీ మీద రాశాడు. తరువాత ఆమెనే

1841లో వివాహ మాడాడు. మూడు సంపుటాల ప్రేమ కవితలు జెనీకి పంపితే, ఆ తరువాత అవి వారి కూతురు లారాకు వారసత్వంగా వచ్చాయి. 1911లో లారా మరణం తరువాత అవి ఏమైపోయాయో తెలియదు. గద్యరూపంలో ఉన్న ఒక విషాద రచనతో సహా నలభై పద్యాలు దొరికాయి. రెండు పద్యాలు 23 జనవరి 1841 అథెనియమ్ (Athenaeum) లో ప్రచురిత మయ్యాయి. వాటి శీర్షిక ''ఆటవిక గీతాలు'' (Savage Songs). అతడి గద్య రచనలు – ''మానవ భవితవ్యం'', నిరాశ, ద్వేషం, దౌర్జన్యం, లంచగొండితనం, ఆత్మహత్యా ఒడంబడికలు, దయ్యంతో సంధి – మొదలైన విషయాలపై కూర్చ బడ్డాయి. ''మేము శృంఖలా బద్ధులం, విదీర్యులం, శూన్యగర్భులం, భయకంపితులం, ఈ అస్తిత్వ శిలకు శాశ్వత శృంఖలా బద్ధులం, మంచుగుండె దేవుని అనురూపులం, మానవాళిపై మహాభిశాపాలను విసరుతాం'' – అతడి గీతాలు ప్రతిబింబించే భావాలు ఇవి. అతడి గీతాల వెనుక ప్రపంచ సంకటస్థితి పొదుకు పోవడం మనకు కనిపిస్తుంది. ''జాతస్య మరణం ధృవం– ఉన్నదంతా నాశమై పోవడానికే'' – ఫౌస్ట్‌నుంచి ఉటంకించే వాడు మార్క్స్. ఈ నేపథ్యం ఆధారంగా, ''ఉన్న వ్యవస్థను ప్రళయం మింగివేస్తుందనే'' అతడికి కలిగిన తీవ్ర దర్శనం ఆయన్ను జీవితాంతం వదిలిపెట్ట లేదు. ఇదే విషయం అతడి ప్రళయ కవిత్వంలో ఉంది; 1848 విధాన ప్రకటన వెనుక ఉంది. కాపిటల్‌లో పరాకాష్ఠ చేరు కొంది. అతడు పత్రికా విలేఖరి. చిన్నచిన్న వ్యాసాలనైతే అతడు వ్రాయగలడు కాని, ఒక బృహత్ గ్రంథం రాయాలంటే అతనికి అలవి మాలిన పని. మరి ఆయన ''కాపిటల్'' అనే బృహత్ గ్రంథాన్ని రాశాడు గదా! అయితే అది ఏ రకమైన ''వాస్తవికాకృతి'' (real form) లేని రచన. వాస్తవానికి అది అనేక వ్యాసాల కూర్పు. కాని చిన్న చిన్న పదునైన వ్యాసాలను రాయడంలో అతడు చేయి దిరిగిన వాడు. మరెవ్వరూ అలా రాయలేరు. ''సమాజం ఒక కొసకు వచ్చింది. ఇక మునిగి పోతుంది'' – అనే విషయాన్ని కవితా లోకంలో దర్శించాడు. ఇక అతడు అల్లే వార్తా కథ లన్నింటినీ ఈ దర్శనానికి జోడించే వాడు. ఆ కారణాన ఆ వ్యాసాలన్నింటికి ఒక సమగ్రత, సమన్వయత, సంగతత్వం అబ్బాయి. లేకపోతే ఆ వ్యాసాలు దేని కది విడివిడిగా ఉండి పోయేవే.

అతడు న్యూయార్క్ డెయిలీ ట్రిబ్యూన్‌కు 500 వ్యాసాలు వ్రాశాడు.

అందులో సుమారు 125 వ్యాసాలు ఎంగిల్స్ ఛాయా రచయితగా (Ghost-Writer) రాసినవి. అయితే అందులో వాదనాబలం మాత్రం మార్క్సుదే.

సూత్రాలను, సూక్తులను తయారు చేయడంలో మార్క్సు గొప్పదనం ఉంది. అయితే అతడి పేరుతో ప్రసిద్ధమైనవన్నీ అతడి సొంతాలు కావు. ''శ్రామికులకు ఒక దేశం అంటూ ఏదీ లేదు'' (The workers have no country); ''ప్రొలెటేరియన్స్‌కు ఊడేదేమీ లేదు వారి శృంఖలాలు తప్ప'' (The proletarians have nothing to lose but their chains)- అనే సూక్తులు మారట్ (Marat) వి. ''మతం ప్రజల నల్లమందు'' (Religion is the opium of the people) అనే సూక్తి హైన్ (Heine) ది. ''ఎవరి సామర్థ్యాన్ని బట్టి వారి నుంచి, ఎవరి అవసరం మేర వారికి'' (From each according to his ability, to each according to his needs) అనే సూక్తి లూయీ బ్లాంక్‌ది. ''సర్వదేశాల శ్రామికులారా ఏకంకండి'' (Workers of all countries, unite) – కారల్ షాపర్ (Schapper) నుంచి, ''ప్రోలిటేరియేట్ నియంతృత్వం'' (the dictatorship of the proletariat) బ్లాంక్వి (Blanqui) నుంచి గ్రహించాడు. అంత మాత్రంచేత మార్క్సుకు సొంత సూక్తులు తయారించే శక్తి లేదను కొంటే అది పెద్ద పొరపాటే. ''ఇతర దేశాలు చేసిన దానిని జర్మనులు ఆలోచించారు''. ''మతం భ్రాంతి జనక సూర్యుడు. తన చుట్టూతా తిరగడం ప్రారంభించే వరకు మనిషి ఆ సూర్యుని చుట్టూ పరిభ్రమిస్తాడు''. ''బూర్జువా వివాహం భార్యల సముదాయం.'' ''నేనేమీ కాదు, ప్రతిదీ నేనే కావాలి.'' (I am nothing and I must be every thing) ''ఏ యుగంలోనైనా పెత్తనం చేసే భావాలు పాలకవర్గంనుంచి వచ్చినవే''. – ఈ సూక్తులన్నీ మార్క్సు తయారీయే. ఇతరుల సూక్తులను సందర్భోచితంగా వాడడమే కాదు, వాటిని సంయోగించడంలో గూడ మార్క్సుని మించినవారు మరొకరు లేరు. మార్క్సు రాసిన ''మానిఫెస్టో''లోని చివరి మూడు వాక్యాల ప్రతిభను దాటి వ్రాసినవాడు మరొకడు కానరాడు: ''శ్రామికులకు పోయేదేమీ లేదు. వారి శృంఖలాలు తప్ప. వారు సాధించాల్సిన ప్రపంచం ఒకటి ఉంది. ప్రపంచ శ్రామికులారా! ఏకంకండి!''

అతడు పండితుడు: మార్క్స్ సైద్ధాంతికుడిగానే ఉండి పోవలుచు కొన్నాడు. ఒక నూతన దార్శనిక సంప్రదాయాన్ని నెలకొల్పి, ప్రపంచాన్ని ఆశ్చర్యంలో ముంచెత్తా లనుకొన్నాడు. అది కేవలం సిద్ధాంత పరమైందే కాక ఆచరణాత్మక మైందిగా గూడ ఉండా లనుకొన్నాడు. అందుకే హెగెల్ అంటే ద్వేషం, రాగం రెండూనూ. జర్మన్ భాషలో కాపిటల్ రెండవ కూర్పుకు ముందు మాటలో ఇలా అన్నాడు: 'నేను మహాతాత్వికుడైన హెగెల్ శిష్యుడిని. కాపిటల్‌లో, 'విలువ సిద్ధాంతం' (Theory of Value) చర్చలో హెగెల్ పారిభాషిక పదాలతో ఆడుకొన్నాను ''తన'' గతి వార్కిక పద్ధతిని హెగెల్ గతితార్కిక పద్ధతికి వ్యతిరేక మన్నాడు. హెగెల్ గతితర్కంలో ఆలోచనా ప్రక్రియ వాస్తవ ప్రపంచాన్ని సృష్టిస్తుంది. మరి నా దృష్టిలో, భావ సంబంధమైన దంతా, మానవుని బుర్రలో విపర్యాసం చెంది, అనూదిత మైనప్పుడు భౌతికం తప్ప అన్యం కాదు. అందుకని హెగెల్ సిద్ధాంతంలో గతితర్కం తలక్రిందులుగా నడుస్తుందంటాను. ఈ మార్మిక స్తరాలతో ఆచ్ఛాదితమైన జ్ఞానాన్ని కనుక్కోవాలంటే, దానిని, తలమీద కాక, కాళ్ళమీద నిలబెట్టాలి'. సైద్ధాంతికుడుగా మార్క్స్, హెగెల్ గతితర్కంలోని దారుణ తప్పిదాన్ని కనుక్కొని నూతన దర్శనాన్ని స్థాపించాడు. ఇది నిజంగా అన్ని దర్శనాలను త్రోసి రాజన్నది. కాని కొస కంట అతడు, హెగెల్ తర్కాన్ని ''మానవావగాహనకు'' రాచబాటగానే అంగీకరించాడు. వాస్తవంలో అతడు దానికి జీవితాంతం బందీగానే మిగిలి పోయాడు.

''ప్రపంచానికి అర్థం చెప్పడం కాదు చేయవలసింది, దానిని మార్చడం'' అని చెప్పే మార్క్స్, వాస్తవ ప్రపంచంలోని అనుభవాలను స్వీకరించకుండా, విషయాల కోసం గ్రంథాలయాలను శరణు వేడాడు. దశాబ్దాలకు దశాబ్దాలు గ్రంథాలయాల్లో గడిపాడు. కాని బయటికి వెళ్ళి ప్రపంచాన్ని చూడ లేదు. అతడు తన **24**వ యేట, ''అడవి నుంచి స్థానిక రైతులు కట్టెలు, మానులు కొట్టుకొచ్చుకొనే హక్కు'' పై వ్యాసం వ్రాస్తూ, కనీసం వారితో మాటాడ లేదు. **1844**లో ''నేతపని వారి కష్టాలు'' పై వ్యాసం వ్రాస్తూ వారిని సంప్రదించ లేదు. మార్క్స్ ఎక్కువగా ఆర్థిక విషయాలను గురించి, పరిశ్రమలను గురించి వ్రాశాడు. ఈ విషయాలతో సంబంధం ఉన్న వారిని ఇద్దరినే అతడు ఎరుగు. ఒకరు అతడి అంకుల్ ఫిలిప్స్. ఇతడు ''ఫిలిప్స్ ఎలెక్ట్రిక్ కంపెనీ'' వ్యవస్థాపకుడు. రెండో అతడు ఎంగిల్స్. ఒకసారి

చూదిమిల్లును చూచి వద్దాం రమ్మని మార్క్సుని ఎంగెల్స్ ఆహ్వానిస్తే, అతడు వెళ్ళ లేదు. మార్క్సు ఎప్పుడూ, ఏ మిల్లూ, ఏ గనీ, ఏ పరిశ్రమా చూసి ఎరగడు. అతడు ఎరిగిన దంతా గ్రంథాలయాలు. వ్రాతబల్ల ముందు కూర్చోవడం.

శ్రామికవర్గాల నుంచి పైకి వచ్చిన సోషలిస్టు లంటే మార్క్సుకు అంత ఇష్టం ఉండేది కాదు. అతడు ఆదరించిన వారంతా మధ్య తరగతికి చెందిన మేంధావులు. ఎందుకంటే శ్రామిక సోషలిస్టులకు ''ఉన్మేష విప్లవం'' (apocalyptic revolution) అంటే విశ్వాసం లేదు. మార్క్సు కేమో అటువంటి విప్లవం అనివార్యం. అతడు బ్రసెల్స్‌లో జరిగిన కమ్యూనిస్టు లీగ్‌మీటింగ్‌లో విలియమ్ వెయిట్‌లింగ్ (William weitling) పై విరుచుకు పడిన తీరుచూస్తే, విషయం అర్థం అవుతుంది. వెయిట్‌లింగ్ ఒక నిరుపేద అయిన రజక స్త్రీకి పుట్టిన అక్రమ సంతానం. తండ్రి ఎవరో తెలియదు. దర్జీపని నేర్చుకొని, కష్టపడి, స్వయం విద్యతో, స్వయం కృషితో పైకివచ్చి, శ్రామిక నాయకు డయ్యాడు. అతడికి సిద్ధాంత జ్ఞానం లేదని మార్క్సు ఆరోపణ. ''సైద్ధాంతిక జ్ఞానం లేకుండా ఆందోళన నడపడం తప్పు. ఇలాంటి వాట్రిని అనాగరక రష్యాలో మతి మాలిన యువకులు నడిపిన నడప వచ్చు గాక. కాని నాగరిక జర్మనీలో మనం సిద్ధాంత జ్ఞానం లేకుండా ఏమీ సాధించలేం ...... అలా సిద్ధాంత ప్రాతిపదిక లేకుండా అశాస్త్రీయంగా విప్లవం నడిపితే, ఒక ప్రక్క పూనకం వచ్చిన గణాచారి (నాయకుడు), మరో ప్రక్క నోరు తెరుచుకొని, చెవులు రిక్కించి వినే గాడిదలు తప్ప ఏమీ ఉండదు.'' దానికి వెయిట్ లింగ్ సమాధానంగా, ''అధ్యయన మందిరాలలో ఉత్పత్తి అయిన సిద్ధాంతాలను నేర్చుకోవడానికై నేను సోషలిస్టును కాలేదు, వాస్తవంగా కష్టపడి పనిచేసే వారి తరఫున మాట్లాడడం కోసం వచ్చాను. అందుకని నిజమైన శ్రామికుల బాధామయ ప్రపంచానికి దూరులైన కేవల సైద్ధాంతికులకు తల ఒగ్గలేను'', అన్నాడు. ఒక ప్రత్యక్షసాక్షి కథనం ప్రకారం, మార్క్సు బల్లను గట్టిగా గుద్దాడు. లాంతరు ఊగి పోయింది. ఒక్క ఉదుటున లేచి, నిలబడి పెద్దగా అరిచాడు: ''అజ్ఞానం ఇంత వరకు ఎవరికీ మేలు చేయలేదు''. శ్రామికుల స్థితిగతులను మార్క్సు స్వయంగా పరిశీలించనూ లేదు. అలా పరిశీలించి అనుభవం ఉన్న వాళ్ళు చెప్పింది ఎప్పుడూ అతడు ఆలకించనూ లేదు.

అసలు అతడు అలా ఎందుకు చెయ్యాలి? అతడు చెయ్య వలసిందంతా తన సిద్ధాంతానికి అనుగుణమైన విషయాలను సేకరించడమే కదా! కారల్ యాస్పర్స్ (Karl Jaspers), మార్క్స పద్ధతిని ఇలా క్రోడీకరించాడు: ''అతడి శైలి పరిశోధనకుని శైలి కాదు. అతడి సిద్ధాంతానికి వ్యాఘాతాలైన దృష్టాంతాలను అతడు ఉటంకించడు. తాను సత్యమని నమ్మిన దానిని బలపరిచే విషయాలనే గ్రహిస్తాడు. అతడి ధోరణి తన కనుకూల సమర్థనయే కాని పరిశోధన కాదు''. అతడి పాండితీ ప్రకర్షకు శిఖరాయమాణమైన 'కాపిటల్'ను గూడ ఈ వెలుగులో చూడ వలసిందే. అది ఆర్థిక ప్రక్రియల స్వభావాన్ని పరిశీలించే రచన కాక, నైతిక దర్శనంలో అతడు చేసిన కసరత్తు మాత్రమే. కాపిటల్ రచనలో, విషయాలన్నింటిని గుదిగుచ్చే ఒక దారంగానీ, ఒక కేంద్రక సిద్ధాంతం గానీ లేదు. అతడు దానిని మొదట, ''పెట్టుబడి'', ''భూమి-కూలి'', ''శ్రమ'', ''రాజ్యం'', ''వాణిజ్యం'', - అనే ఆరు సంపుటాల్లో వెలువ రించాలని ఆలోచించాడు. కాని అది అతడి శక్తికి మించిన పని. అతడు వాస్తవంగా పూర్తిచేసిన ప్రథమ సంపుటం (గందరగోళం చేసి, దానిని రెండు సంపుటాలన్నారు) లో ఒక తార్కిక నమూనా అంటూ లేదు. లూయీ అల్థసర్ (Louis Althusser) అనే ఫ్రాన్స్ దార్శనికుడు దాని నిర్మాణక్రమం చాల గందరగోళంగా ఉందనీ, పాఠకుడు దాని మొదటి భాగం వదలివేసి, రెండవభాగం - 4వ ప్రకరణం - తో మొదలు పెట్టి తీరాలన్నాడు. అంతెందుకు, ఎంగిల్స్‌చేసిన దాని సంక్షిప్తీకరణ, ఆ సంపుటి బలహీనతలను, రచనలోని పొసగని తనాన్ని (అసంగతత్వాన్ని) ఎత్తి చూపుతుంది. మార్క్స మరణానంతరం, ఎంగిల్స్, మార్క్స నోట్సుల 1500 పుటలనుంచి ఎత్తి రెండవసంపుటం వేశాడు. ఇందులో నాలుగోవంతు ఎంగిల్స్ రచన. మూడవ సంపుటాన్ని గూడా ఎంగిల్స్ ఎత్తి వ్రాశాడు.

1980లో, కేంబ్రిజ్ విశ్వవిద్యాలయంలో పరిశోధకులు, మార్క్స ఎలా మూల గ్రంథాలనుంచి ఉటంకించే టప్పుడు, తనకు అనుకూలంగా, కొన్ని వాక్యాలను సవరించి, మరికొన్నింటిని వదలి వేసేవాడని, సోదాహరణంగా ఎత్తి చూపారు.

మార్క్స పైకి పండితుడే అయినా, సత్యసంశోధకుడు కాడు. మరి

అలాంటప్పుడు అతడిని నడిపిన శక్తి ఏది? దీనికి సమాధానం అతడి మూర్తిమత్వ (Personality) శీలలక్షణాలలో లభిస్తుంది. అతడి కావ్యదృష్టి, పత్రికకా లేఖనం, పాండిత్యాల సమ్మేళనం అతడి దర్శనం అని చెప్పుకొన్నాం. కాని అతడి రచనలలోని వాస్తవ విషయాలు అతడి మూర్తిత్వపు నాలుగు పక్షాలను ప్రదర్శిస్తాయి: 1. హింసాభిరుచి, 2. అధికార దాహం, 3. పొదుపరితనం, 4. తనచుట్టూ ఉన్నవారిని దోపిడి చేయడం (అంటే వారిపై బదనిక కావడం).

హింస మార్క్సిజంలో అంతర్వాహినిగా ఉండనే ఉంది. మార్క్సిస్టు ప్రభుత్వాల ప్రవర్తనలో అది తేట తెల్లమైంది. మార్క్స్ నోటిదురుసు వాడు. అందరితో తగవులే. కుటుంబంతోనూ తగవులే. బాన్ విశ్వవిద్యాలయంలోనూ అంతే. ఇతడివద్ద పిస్టల్ ఉన్నందుకు అరెస్టు చేశారు. ఒకసారి డ్యూయల్ చేస్తే ఎడమకంటిమీద గాటుపడింది. తనతో సంబంధం ఉన్న అందరితోనూ, వారు లొంగిపోతేతప్ప, తగవులే. బ్రూనో బావర్‌తో సహా తగవుపడ్డాడు. బావర్ సోదరుడు మార్క్స్‌మీద ఒక పద్యం అల్లాడు: ''ట్రైర్‌వాసి, నల్లనివాడు, బహురోషకాడు, క్రోధఘూర్ణితుడు, దుష్ట బద్ధ ముష్టివాడు, పర్జన్యగర్జానుకారి, వేయిదయ్యాల జుట్టు పీకినవాడు.'' అనెన్‌కోవ్ అతడిని మూర్తీభవించిన ప్రజాస్వామ్య నియంత (1846) అన్నాడు.

అతడి చిటపటలకు, అహంభావత్వానికి మూలాలు అతడి శారీరక మానసిక మూలకాలలో ఉన్నాయి. అతడి జీవితం అనారోగ్యమయం. వ్యాయామం లేదు. మసాలా ఎక్కువగా తినేవాడు. విపరీతంగా త్రాగేవాడు. పొగత్రాగేవాడు. ఫలితంగా అతడి లివరు అతడితో సహకరించ లేదు.

డబ్బును ఎలా ఖర్చు పెట్టాలో అతడికి చేత కాదు. బహుశా ఆ చేతకాని తనం పెట్టుబడిదారీ వ్యవస్థపై ఉన్న ద్వేషానికి మూలం కావచ్చు. మార్క్స్‌కు డబ్బుచిక్కులు అతడి యూనివర్సిటి దశ నుంచి జీవితాంతం పీడించాయి. అప్పులు చేశాడు. వడ్డీతో తీర్చాల్సి వచ్చేటప్పటికి చిరట్లు బురట్లు. వడ్డీని ''మానవాళిపై మహా నేరం''గా పరిగణించాడు. 'దానిని మనిషిని మనిషి దోచుకోవడం' అన్నాడు. పాపం ఆయన భార్య జెనీకి బడ్జెటు ప్రకారం ఖర్చు చేయడం తెలియదు. ఇంటిలో విలువైన వస్తువులన్నీ తాకట్టుకు పోయేవి.

1840లో మొదటిసారిగా మార్క్స్‌ను కలిసి నప్పటి నుంచి ఎంగిల్సే డబ్బు అవసరమై నప్పుడెల్లా సర్దుబాటు చేసే వాడు. ఎంగిల్స్ తన కొచ్చేదాంట్లో సగం ఇచ్చేవాడు. ఈ ఇద్దరి స్నేహంలో, ఎంగిల్స్ సహాయం పొందుతూగూడ, మార్క్స్ ఎంగిల్స్‌పై పెత్తనం చెలాయించే వాడు.

కుటుంబ జీవితమూ సుఖకరంగా సాగ లేదు. 1848 నుంచి పదిసంవత్సరాల పాటు జెనీ జీవితం ఒక పీడ కలగానే గడిచింది. మార్చి 3, 1848న అతడిని జైలులో పెట్టారు. ఆమెనూ కొంతమంది వేశ్యలతోపాటు ఒక గదిలో ఉంచారు. 1849 జూన్ నాటికి అతడు ఏమీలేని వాడయ్యాడు. తరవాత నెలలో ఒక స్నేహితునికి వ్రాసిన ఉత్తరంలో, "నా భార్య నగలలో చివరిది గూడ కుదువ దుకాణాన్ని వెదుక్కొంటూ పోయింది", అని వ్రాశాడు. వారప్పుడు ఇంగ్లాండ్‌లో ఉన్నారు. అప్పుడామె గర్భిణి, అప్పటికే ముగ్గురుపిల్లలు - జెనీ, లారా, ఎడ్గార్‌లు. 1849 నవంబరులో నాలుగో సంతానం. ఐదు నెలల తరువాత అద్దెకట్టకపోతే, సామాన్లు రోడ్డుమీదకు విసరివేసి, బయటకు గెంటివేశారు. వారి మంచాలు, కంచాలు అమ్మి పాలవానికి, సరకుల కొట్టుకు కట్టవలసి వచ్చింది. దీనితో ఆమె మార్క్స్‌ను పూర్వవాత్సల్యంతో, ప్రేమతో చూడ లేక పోయింది.

ప్రష్యన్ గూఢచారి 24మే 1850న పంపిన రిపోర్టు చూస్తే, జెనీ కష్టాలు తెలుస్తాయి. "త్రాగుతాడు. ఉతికిన బట్టలు వేసుకొని ఎంతకాలమైందో. రాత్రింబవళ్ళు అలుపు సలుపు లేకుండా పని చేస్తాడు. నిద్రకు వేళాపాళా లేదు. పగలే నిద్ర పోతాడు. తెల్లవార్లు మేల్కొని ఉంటాడు. ప్రతిదీ విరిగి పోయిన పగిలిన వస్తువువే. అన్నీ మట్టిగొట్టుకు పోయినవే. అన్నీ చిందరవందర. గది మధ్యలో విరిగిన, చిరిగిన, నూనె మరకల సోఫా. దాని నిండా పుస్తకాలు, కాగితాలు, వార్తాపత్రికలు, చాకులు, సిరా బుడ్డి, పొగాకు నుసి. మూడు కాళ్ళ కుర్చీ ఒకచోట. మరోకుర్చీ (నాలుగుకాళ్ళది) మీద పిల్లలు వంట ఆట ఆడుకొంటారు. దీనిమీదే ఎవరైన అతిథులు వచ్చి నప్పుడు కూర్చునేది."

1851 లో ఫ్రాంజిస్కా పుట్టింది. మరుసటి సంవత్సరం చని పోయింది. బాగా ముద్దుచేసిన అతని కొడుకు మూష్ (చిన్నారి ఈగ) 1855లో

గాస్ట్రో ఎన్టైయిటిస్‌తో మరణించాడు. ఇది ఆ దంపతులకు పెద్ద దెబ్బ. దీని నుంచి జెనీ బయట పడలేక పోయింది. మార్క్స్ రాశాడు: ''చచ్చిపోతే బాగుండును - అని నా భార్య అంటోంది''. 1860లో పెద్దమ్మారు పోయడంతో ఆమెకున్న అందం కాస్తా హరించుకు పోయింది. 1881లో ఆమె అంతిమశ్వాస తీసింది. చివరకు వరకు మార్క్స్ జీవితంలో నేపథ్యానికి తరలిపోయింది.

మార్క్స్ తనచుట్టూ చేరిన వారి నందరిని దోపిడికి గురిచేశాడు. ఎంగిల్స్‌ను సరేసరి. ఆయన తన కూతుళ్ళనూ వదలి పెట్ట లేదు. వృత్తులు చేపట్టడానికి అనువుగా వారికి ఏ రకమైన విద్యాబుద్ధులు గరిపించ లేదు. విప్లవకారుడి కూతుళ్ళు ఇలా కాదు ఉండ వలసింది. పియానో వాయించడం, చిత్రలేఖనం - ఇవి వ్యాపారస్తుల బిడ్డలు చేయ వలసిన పనులు - నేర్చుకొన్నారు. విప్లవవర్గం నుంచి వచ్చిన వరులను ఆయన తిరస్కరించాడు. అయితే వారితో తన కూతుళ్ళ వివాహాలను ఆప లేదు, ఆపలేకపోయాడు. లారా భర్త పాల్ లాఫ్రాగ్‌ని ( ఇతడిలో నీగ్రో రక్తపుజీర ఉంది) ''నీగ్రిలో'' అని, ''గొరిల్లా'' అని ఎద్దేవగా అనే వాడు. జెనీని చేసుకొన్న చార్లెస్ లాంగ్వెట్‌నూ అతడు ఇష్టపడ లేదు. ఇద్దరు అల్లుళ్ళను ''మూర్ఖులు'' అన్నాడు. 1882లో అతడు మరణించాడు. అంతకు కొద్ది వారాల ముందు జెనీ చనిపోయింది. ఎలినార్, భర్త ప్రవర్తనతో విసిగి 1898లో నల్లమందు తిని ఆత్మహత్య చేసు కొంది. తరవాత 13 సంవత్సరాలకు లారా, ఆమె భర్త లాఫ్రాగ్‌లు ఆత్మహత్యా ఒడంబడిక చేసుకొని, దానిని ఇద్దరూ అమలు జరిపారు.

అతడు దోపిడికి గురి కావించిన మరో వ్యక్తి వారి పని మనిషి. ఈమె పేరు హెలెన్ డీమత్. అయితే ఆమెను ''లెంచెన్'' అనే వారు. 1823లో పుట్టిన ఈమె జెనీ తల్లిగారింటిలో దాసీగా చేరింది. తరవాత జెనీ మార్క్స్ సంసారంలో, జెనీ కష్టాలను చూసి, ఆమెతల్లి 1845లో లెంచెన్‌ను బహూకరించింది. అప్పటినుంచి ఆమె జీవితాంతం మార్క్స్ కుటుంబంతోనే ఉండి పోయింది. 1849-51లో ఆమె మార్క్స్‌కు ఉంపుడుగత్తెగా మారి ఒకబిడ్డను కన్నది. మార్క్స్ ఏనాడు ఆమెకు జీతమిచ్చి ఎరుగడు. అయినా ఆమె వారిని వదల లేదు. మార్క్స్ - లెంచెన్ల వ్యవహారం పసిగట్టిన

జెనీకి మార్క్స్ మీద ఉన్న ఆ కొద్ది ప్రేమ కొడి గట్టింది. ''మా కష్టాలూ మేమూ కాక, పైగా ఇదొకటి'' అని జెనీ స్వీయచరిత్రలో వ్రాసుకొంది. 1851 జూన్ 23న, 28 డేన్‌స్ట్రీట్‌లో లెంచెన్ బిడ్డను ప్రసవించింది. జనన మరణాల రిజిస్టరులో ఆ బిడ్డను హెన్రీ ఫ్రెడరిక్ డీమత్‌గ నమోదు చేశారు. కాని, మార్క్స్ ఇదంతా ఒట్టి పుకారేనని కొట్టి వేశాడు. గొంతు పుట్టకురుపుతో ఎంగిల్స్ 5 ఆగష్టు 1895న చని పోయాడు. మాటాడ లేని ఆరోజుల్లో ఎంగిల్స్ ''ఫ్రెడీ, మార్క్స్ కొడుకు'' అని పలకమీద వ్రాసి ఎలినార్‌కు చూపించాడు.

వ్యక్తిగతంగా ఏ బలహీనతలున్నా, ఏమీ చేసినా, అవి ప్రపంచం మీద అతడికి ఉన్న ప్రభావాన్ని ఏ మాత్రం తగ్గించలేక పోయాయి. ప్రపంచమానవాళి ఆశలకు ఊపిరి పోసిన వాని వ్యక్తిగత బలహీనతలను ప్రపంచం క్షమిస్తుంది.

తత్వం అనేది సామాజిక రోగం. విప్లవం దీనికి చరమగీతం పాడుతుంది. అప్పుడు సమాజం ఆరోగ్యకరమైన పునాదులపై నిలబడుతుంది. ఇది తప్పకుండా జరిగి తీరుతుందని మార్క్స్ విశ్వసించాడు. ఎలా గంటే విప్లవం, తత్వాన్ని యథార్థం చేస్తుందనీ, రోగగ్రస్త సమాజంలో దార్శనికులు తమను ఓదార్చుకొన్న హితతత్వం, న్యాయం, స్వేచ్ఛలనే శూన్యాకృతులను యథార్థీకరిస్తుందని, యువ మార్క్స్ విశ్వసించాడు. మార్క్స్ పెద్దవాడైన తరవాత, ''విప్లవం 'మనుష్యులను వాస్తవ ప్రపంచాన్ని చూడగలిగే రీతిగా కళ్ళు తెరిపించడం ద్వారా' తత్వాన్ని నాశనం చేస్తుందని'' నమ్మాడు. కాని తత్వం తత్వంగానే మిగిలి పోయింది.

*(91 జనవరి మిసిమి)*

# జాన్ పాల్ సార్త్ర

ఇరవయ్యవ శతాబ్ది మధ్యకాలాన్ని ఒక ఊపు ఊపిన అస్తిత్వవాదాన్ని గురించి వినని వారు ఉండరు. ఎందుకంటే రెండవ ప్రపంచ యుద్ధాని పూర్వపు భ్రమలు పటాపంచ లయ్యాయి. యుద్ధం 'మరుభూమి అనుభూతి' (Waste Land Feeling) ని ప్రపంచానికి ఇచ్చింది. మాన సమస్యల పరిష్కారానికి మనిషి ఇక ఏ మాత్రం ఆదర్శ రాజ్య(Utopia) ఇంద్రజాలాన్ని ఆశ్రయించ లేడు. తనలో తానే ఒక 'నవీకృతార్థాన్ని' వెతుక్కోవాలి. ఈ స్థితికి సమాధానంగానే అస్తిత్వవాదం రంగ ప్రవేశం చేసింది. పాత దర్శనాలు మార్గదర్శకాలు కావు. ఎలాగంటే వాటినిండా సార్వత్రికాలు, అమూర్త భావనలు, ఆదర్శరాజ్యాలు తప్ప మరేమీ లేవు. వీటితో విసిగి వేసారిన మానవునికి అస్తిత్వవాదం ఒక 'క్రొత్త ఎరుక'ను ఇచ్చింది. ''అస్తిత్వం - సారం కంటె ముందు'' - అంది.

మరి ఏమిటి ఈ అస్తిత్వవాదం? ఎవరికి తోచిన సమాధానం వారు చెప్పారు. ఒక టోపీని పదిమంది ధరించిన తరువాత దాని ఆకృతి పది రకాలుగా మారినట్లే, అస్తిత్వ వాదం గూడా పదిమంది చేతుల్లో పడి రూపాలు దాల్చింది. ఫలితంగా అస్తిత్వవాదానికి ఒక నిర్దిష్టార్థం లేకుండా పోయింది. అందుకే జాన్‌పాల్ సార్త్ర ''అది ఒక కఠోర తత్త్వం, అది అందరికీ అందుబాటులో ఉండేది కాదు, తత్వశాస్త్రంలో విశేషకృషి చేసిన వారికే అది అర్థ మవుతుంది'' అన్నాడు.

మరి అలాంటప్పుడు అస్తిత్వ వాదాన్ని నిర్వచించడం అంత తేలికైన పని కాదు. ఎందుకంటే ముఖ్యంగా అస్తిత్వ వాదం రెండు రకాలుగా ఉంది: ఒకటి ఆస్తిక అస్తిత్వ వాదం; దీని ప్రధాన తాత్వికులు యాస్పర్స్, మార్సెల్‌లు. రెండో రకం అస్తిత్వవాదం నాస్తిక అస్తిత్వవాదం; ఈ సంప్రదాయానికి చెందిన వారు హైడెగర్, ఫ్రాన్స్ అస్తిత్వవాదులతో కలుపుకొని జాన్‌పాల్ సార్త్ర. అయితే ఈ రెండు రకాల అస్తిత్వ వాదులు ఒక విషయం మీద మాత్రం అంగీకరించారు: ''అస్తిత్వం సారం కంటె ముందు''.

నాస్తిక అస్తిత్వవాద ప్రముఖుడైన జాన్ పాల్ సార్త్ర ఈ శతాబ్దంలో మరే

ఇతర దార్శనికుని కంటె గూడా ప్రపంచ జనాళి వైఖరిని, ముఖ్యంగా యువతను ప్రభావితం చేశాడు.

రసెల్ దృష్టిలో తత్త్వం ఆకాశంలో ఎంతో ఎత్తున ఉంటుంది. అందుకని దానిని మామూలు మనుషులు ఎవరూ అంత ఎత్తుకు ఎగిరి అందుకో లేరు. అందువల్ల దానిని రసెల్ లాంటి దార్శనికులు వడకట్టి చిన్నచిన్న మోతాదులలో నీరు కార్చిన రూపంలో వ్యాసాల ద్వారా, ప్రసంగాల ద్వారా మామూలు జనాళికి అంద జేయాలి. పానశాలల్లో, ఉన్నత పాఠశాలల్లో దర్శనాలను చర్చించి బోధించే ఫ్రాన్స్‌లో పుట్టిన జాన్ పాల్ సార్త్ర దృష్టి వేరు. ఎటువంటి తత్త్వాన్ని అయినా నాటకాలు, నవలలు ఇంకా ఇతర సాహిత్య ప్రక్రియల ద్వారా మామూలు జనానికి అందించ వచ్చు. అలాగే అతడు తత్త్వాన్ని " ఉండడం - ఉండకపోవడం" (Being and Nothingness) అనే తన దార్శనిక గ్రంథం కంటె గూడా, తన నాటకాలు, నవలలు, కథానికల ద్వారా ప్రచారం చేశాడు. ఇవే అతడికి మంచి పేరు తెచ్చి పెట్టాయి.

జాన్‌పాల్ సార్త్ర 21జూన్ 1905లో పుట్టాడు. తల్లికి గారాల ముద్దుపట్టి, గారాబు బిడ్డ ఎలా తయారవ్వాలో అలాగే తయారయ్యాడు. అతడికి 15 నెలల వయస్సులో తండ్రి గతించాడు. తల్లి మరొకరిని - ఒక పారిశ్రామికవేత్తను - వివాహ మాడింది. తండ్రి మరుగుజ్జుతనం తప్ప అతడి నుంచి ఇతడికి సంక్రమించింది ఏమీ లేదు.

తన జీవిత చరిత్ర 'మాటలు' (Words) అనే గ్రంథంలో, తనపై తండ్రి ప్రభావం ఏమీ లేదని, అతడు తన తల్లి పడక గదిలో ఒక ఛాయా చిత్రం తప్ప, అంత కంటె ఏమీ లేదని రాసు కొన్నాడు.

ఎనిమిది సంవత్సరాలు వచ్చే దాక అతడికి తల్లి జుట్టు కత్తిరించ లేదు. ఆడపిల్ల జుట్టులా జుట్టు. అందుకే తల్లి అతడికి ఆడ పిల్లల బట్టలు వేసేది. అతడికి బాల్యం స్వర్గంలా గడచింది. అందరికీ వంగి లొంగి ఉండే తల్లి అతడికి అన్ని సేవలు చేసింది. 'అందగాడని' మెచ్చు కొనేది. ఈ భావమే అతడి మనస్సులో నాటుకొంది. ఒకసారి, ఫ్లాబర్ట్ రాసిన 'మదామ్ బోవరీ' ని చదవడానికి తల్లిని అనుమతి కోరాడు.

అప్పుడావె ఇలా అంది: ''నా చిన్నారి ఈ వయస్సులోనే అంతటి పుస్తకాలు చదవితే పెద్దయిన తరువాత ఏమి చేస్తాడో?'' ''ఏం చేస్తాడు, వాటిని జీవిస్తాడు'', అన్నాడు సార్త్ర. ఇదంతా అతడు తన జీవిత చరిత్ర ''మాటలు''లో రాసుకొన్నాడు. అతడి నాలుగో ఏట, కుడికంట లేచిన చిన్న గడ్డతో స్కూలులో చేరినప్పుడు కాని, తల్లి తన అందాన్ని గురించి చెప్పిన అసత్యాన్ని అతడు గ్రహించ లేక పోయాడు. ఈ అందవికారానికి పిల్లలంతా ఏడ్పించే వాళ్ళు. తన్నే వాళ్ళు. ఈ అందవికారాన్ని అధిగమించడానికి ఆడవాళ్ల వెంట పడవలసి వచ్చిందని అతడు తన War Diaries లో చెప్పు కొన్నాడు.

విద్యారంగంలో బాగానే రాణించాడు. మంచి విద్యాలయాల్లో చదివాడు. పద్యాలు, నవలలు, నాటకాలు, కథలు, పాటలు రాశాడు. పియానో వాయించాడు. మల్ల యుద్ధం చేశాడు. జీవితంలో మొదటి అమ్మాయిని, సైమన్ జొలివాను చేర దీశాడు. ఈ అమ్మాయి పొడగరి. పొట్టివాడైన తనకు పొడగరి ఆడ వాళ్లంటే ఇష్టం. డిగ్రీ పరీక్షల్లో తప్పి, రెండవ సారి ఫస్టున వచ్చాడు. తరువాత ఇతడు చేర దీసిన రెండవ మహిళ, జీవితాంతం వివాహం లేకుండా ఇతడికి భార్యగా ఉన్న సైమాన్ డి బోవార్. ఈమె రెండో రాంక్‌లో వచ్చింది. రేమండ్ ఆరన్, పాల్ నిజాన్, సైమన్ డి బోవార్‌లు లాంటి మహామహులు అతడి సమకాలీనులు. అతడు స్కూలు మాస్టరుగా చేరాడు..

రాజకీయంగా అతడు ఏ సంప్రదాయానికీ చెందిన వాడు కాదు. బూర్జువాలను ద్వేషించే వాడే గాని మార్క్సుని కౌగిలించుకో లేదు. అయితే సానుభూతి పరుడే. మార్క్సుని అసలతడు, అక్కడక్కడ ఏ కొద్దిగానో తప్ప, లోతుగా అధ్యయనం చేయ లేదు.

**1930**లో అతడు గురువుగా ఉండగా విద్యార్థులకు పూర్తి స్వేచ్ఛ నిచ్చే వాడు. కావాలంటే విద్యార్థులు క్లాసుల్లో చొక్కాలు తీసి వేసి కూర్చో వచ్చు. సిగరెట్లు కాల్చవచ్చు. విద్యార్థులు ఏమైనా చేయ వచ్చు నోట్సు రాసుకోనక్కర లేదు. వ్యాసాలు సమర్పించ నక్కర లేదు. సార్త్ర సందేశం ఏమింటంటే, ''వ్యక్తికి పూర్తి స్వేచ్ఛ ఉంది. అతడి కర్మలకు అతడే పూర్తిగా బాధ్యుడు'', ఇలాంటి భావనలతో ఈ రోజుల్లోనే తాత్విక

సంబంధమైన ఒక నవల రూపు దిద్దు కొంటోంది. దానికతడు 'విషణ్ణత' (Melancholia) అని పేరు పెడదా మనకొన్నాడు. కాని దానికి పబ్లిషర్స్ 'వికారం' (Nausea) అని పేరు పెట్టారు. ఈ పేరు ఎంతో బాగుండడంతో దీనినే అతడు ఖాయం చేశాడు. ఆ పుస్తకంలో అతనే నాయకుడనే విమర్శలు గూడా వున్నవి.

యుద్ధాత్పూర్వ రాజకీయాకాశంలో ఇతడు మిణుకు మిణుకు మనే నక్షత్రమైన కాడు. అందుకని ఇతడు నాజీల దృష్టిలో పడ లేదు. అందుకని ఇతడు వారిని గురించి తీవ్రంగా నిందించ లేదు. యుద్ధ ఖైదీగా విడుదలైన తరువాత తత్త్వశాస్త్రాచార్యుడుగా చేరాడు. అ తరువాత 1945లో జర్మనీ ఆక్రమణను గురించి ఒక వ్యాసంలో ఇలా అంటాడు: ''నేను ఇలా రాస్తే ప్రజలు నన్నెలా అర్థం చేసుకుంటారో తెలియదుగాని, జర్మనుల దారుణాలు సహించరానివే అయినా, అవి మాకు బాగా సరిపోయాయి.... వారి ఆక్రమణలో ఉన్నంత స్వేచ్ఛగా మేమెప్పుడూ లేము''.

సిద్ధాంతాలను వల్లెవేసేవాడే కాని కార్యశూరుడు కాడు. అతడు నమ్మిన ఆదార్శాలను ఆచరణలో పెడితే నాజీ సైన్యం రైళ్ళను పేల్చి ఉండవలసింది. కాని అతడు ఆ పని చేయ లేదు. అతడి దర్శనం క్రియాశీలకం. ఎలాగంటే ''ఒక మనిషి శీలాన్ని, అర్థాన్ని నిర్ణయించేవి అతడి కర్మలు (చేష్టలు) కాని అతడి శుష్క ఆదర్శాలు, దృక్పథాలు, మ్మాటలు కావు''. అని అతడే చెప్పు కొన్నాడు. దమనాధిపత్యాలకు ఇతడు వ్యతిరేకి. మరిలాంటి వాడు యూదుల అణచివేతకు ఎదురాడ లేదు. వారి గురించి సానుభూతితో ఒక మాట రాయ లేదు. బదులుగా నాటకాలు రాసుకొంటూ కూర్చొన్నాడు.

అతడి ముఖ్య దార్శానిక గ్రంథం ' ఉండడం, ఉండక పోవడం' (Being and Nothingness) 1942-43లో విరచితమైంది. చలిరాత్రులు, ఏకబిగిని నాలుగు గంటలు రాసేవాడు, `Cafe Flore' లో కూర్చొని, పాల టీ త్రాగుతూ. ఇది 722 పుటల సుదీర్ఘ గ్రంథం. పేజీల నిండా మసాలా వాక్యాలు. అందులో కొంతవరకు మొత్తంమీద రంధ్రాన్వేషణం జరిగితే, మరి కొంత వరకు గుదా న్వేషణం. '' ఇటలీ శైలిలో రతి చేయడం ఎలా? అనే విషయాల మీద పరిశోధన సాగింది'' అని

1983లో ప్రచురితమైన ఉత్తరాలలో ఉంది. ఇది గొప్ప దార్శనిక గ్రంథమే, అయినా అతడికి పేరు తెచ్చి పెట్టింది మాత్రం నాటక రంగం. అతడి నాటకాలు; ఇవి ధనాన్ని కూడా ఆర్జించి పెట్టాయి. ఈ నాటకాల్లో ముఖ్యమైంది, ''బయటికి దారి కాదు'' (No Exit) అనే నాటకం. ఇది 27 మే 1944న ప్రారంభమైంది. ఇందులో ముగ్గురు వ్యక్తులు ఒక గదిలో కూచొని వుంటారు. ఈ గది నరకానికి అనుబంధంగా ఉంటుంది. ఈ నాటకాన్ని రెండు స్థాయిలలో చూడాలి. ఒక స్థాయిలో ఇది మానవ శీలం మీద వ్యాఖ్యానం. ఆ వ్యాఖ్యాన సందేశం ఏమిటంటే, ''మనమూ మన సంస్కృతి తప్ప మిగతా జనం, జాతులు సంస్కృతులూ అన్నీ నరక సదృశ్యాలే''. ఇహ రెండవ స్థాయిలో ఈ నాటకం, హైడెగర్‌ను సమూలంగా పరివర్తితం చేసి, క్రియాశీలతను, నర్మగర్భంగా ధిక్కారాన్ని ప్రబోధిస్తుంది. ఈ నాటకానికి అటు విమర్శకుల నుంచి, సామాజికుల నుంచి బహుళ ఆదరణ లభించింది. ఫ్రాన్స్ స్వర్ణయుగాన్ని ఆవిష్కరించిన సాంస్కృతిక సంఘటనగా దానిని అభివర్ణించారు. ఫ్రెంచి ప్రభుత్వపు అత్యున్నత పురస్కారాన్ని పొందాడు కూడా!

'అస్తిత్వవాదం' పదాన్ని నిర్వచించ మన్నప్పుడు సార్త్ర ''అస్తిత్వ వాదమా? అదేమిటో నాకు తెలియదే'' అన్నాడు. ''నా తత్త్వం ''అస్తిత్వ దర్శనం'' (philosophy of existence) అసలు ఈ ''అస్తిత్వ వాదం'' (Existentialism) అనే పదాన్ని పత్రికల వాళ్ళు సృష్టించినట్లు కనిపిస్తున్నది''. తరవాత తరవాత సార్త్ర ఈ పదాన్నే స్వీకరించాడు. ఆ తరువాత అతడిచ్చిన ఒక ఉపన్యాసానికి 'అస్తిత్వవాదం ఒక మానవవాదం' (Existentiaism is a Humanism) అని పేరు పెట్టాడు. ఈ ఉపన్యాసం తరువాత గ్రంథస్థమైంది. అందులో అతడు అస్తిత్వవాదాన్ని ఇలా వివరించాడు. ''మనిషిని, అతడు చేసిన కర్మల (పనుల) ఆధారంగా, అస్తిత్వవాదం నిర్వచిస్తుంది. అతడి ఆశలు, ఆశంసలు కర్మలోనే ఉన్నాయి. మానవుని బ్రతుకును సంభావ్యం చేసే, సాధ్యం చేసే ఒకే వస్తువు కర్మ. అందువలన మనిషి తనను తన జీవితానికి అంకితం చేసు కొంటాడు. ఆవిధంగా అంకితం చేసు కొన్న మానవుడు, దాని ఆధారంగా తన ప్రతిమను (సారాన్ని) తయారించు కొంటాడు. దీనికి వెలుపల, ఆవల మరేమీ లేదు''. 1945 తరువాతి ఐరోపావాసి 'నూతన అస్తిత్వ వ్యక్తి'గా ''అతడు

ఏకాంతంగా, ఏ కారణం లేకుండా ఉన్నాడు''. ''మనిషికి స్వేచ్ఛనుంచి విముక్తి లేదు'' అనడంలో సార్త్ర ఉద్దేశం ఇదే. ఈ తారక మంత్రం, యుద్ధానంతర నవతరాన్ని ముఖ్యంగా యువతను - అన్ని రకాల, వర్గాల వారిని - ఏకాంతులను, ఉదారులను, నిష్ఠురులను, ఒక మాదిరి దౌర్జన్యవాదులను, విశిష్ట జన వ్యతిరేకులను - అందరిని ఆకర్షించింది.

ACC NO - 30540

ఆయనకు పత్రికలు విస్తృత విశిష్ట ప్రచారాన్ని కల్పించాయి. అయితే అతడిపై దాడి చేసిన పత్రికలూ లేక పోలేదు. ఒక కాథలిక్ దినపత్రిక అతడిని విమర్శిస్తూ, ''పద్దెనిమిదవ శతాబ్ది హేతువాదం కంటే, పందొమ్మిదవ శతాబ్ది సకారాత్మకవాదం కంటె అస్తిత్వవాదం దుర్మార్గమైంది'' అంది. స్టాలిన్ సాంస్కృతిక రాయబారి ఫెడయేవ్ (Fedayev) సార్త్రని ''టైప్‌రైటర్‌తో ఉ: నక్క'' ''ఊటకలంతో ఉన్న సివంగి'' అని వర్ణించాడు. ఎవరు ఏమన్నా ఎన్ని పేర్లు పెట్టినా అతడి పేరు, ఇనుమడించిందే కాని తరగ లేద "Les Temps Moderns" ఒక సంచికలో ఇలా రాసింది: ''ఫ్రాన్స్ చితి: చితికి పతనమైంది. అది మిగిల్చిందీ, వారసత్వంగా ఇచ్చిందీ ఫ్యాషన్లను, సాహిత్యాన్ని మాత్రమే; కాని అస్తిత్వవాదం ఫ్రాన్స్ ప్రతిష్ఠను ఇనుమడింప జేసి, క్షీణయుగంలో వ్యక్తిత్వాన్ని నిలబెట్టడానికి వచ్చింది. సార్త్రను అనుకరించడం, అనుసరించడమంటే దేశభక్తిని ప్రదర్శించడమే''. అస్తిత్వవాదం చదువు కొనేది కాదు. అనుభవైక వేద్యం మాత్రమే! దానిని వివరించ వలను పడదు. జీవించ వలసిందే. లక్షలాది యువతకు సార్త్ర ఆధ్యాత్మిక నాయకుడయ్యాడు.

920.02
25=00
VEN

**1905**లో పుట్టిన సైమన్ డి బోవార్ (Simone de Beauvoir) **1925**ల నుంచే సార్త్రకు చేరు వైంది. ఆవిడ చాలా తెలివైంది; మంచి రచయిత్రి. సాంకేతికంగా చూస్తే తత్వశాస్త్రంలో సార్త్రకంటె ఆవిడే దిట్ట. పారిస్ విశ్వవిద్యాలయంలో మంచి పేరు మోసిన తత్త్వశాస్త్ర విద్యార్థిని. మొదటిగా సార్త్ర ఈమెను చేర దీసినప్పుడు, ''నేటి నుంచి నిన్ను నా రెక్కల క్రింద పొదుగుతాను'', అన్నాడు. ఈ పొదుగుడు, ఆమెకు సుఖాసుఖ మిశ్రమాన్నే ఇచ్చింది గాని పూర్తి సంతోషాన్ని ఇవ్వలేక పోయింది. ఈమె అతనికి జీవితాంతం ఉంపుడుగత్తె, భార్య (వివాహం లేకుండా), వంటగత్తె, పనిమనిషి, మానేజరు, సంరక్షకురాలు, నర్స్ - అన్నీ తానే అయింది.

అయితే అతడికి ఆమె మీద, ఆమెకు అతడిమీద ఎలాంటి చట్టపరమైన అధికారాలు, హక్కులు లేవు. ఈమె అతడిని కలిసిన దగ్గరనుంచి అతడికి బానిస అయింది. 'స్త్రీ పుట్టుకతోనే స్త్రీ కాదు, ఆమె అలా మలచబడ్డది' అనే వాక్యంతో మొదలైన 'రెండో లింగం' (Second sex) అనే గ్రంథం రాసిన బోవార్, స్త్రీ విమోచనోద్యమానికి ఆద్యురాలైన బోవార్, నిజంగా నిజ జీవితంలో ఈ ఆశయాలకు తిలోదకాలిచ్చి, మోసపూరిత జీవితాన్ని, సార్త్ర దోపిడికి గురికావడాన్ని, ఎన్నుకొన్న దంటే ఆమె చిత్తశుద్ధిని మనం శంకించాలి. ఆమెను ఎలా అర్థం చేసుకోవాలి? సార్త్ర ఆమెను ఎలా లొంగదీసుకొందీ ఎక్కడా చెప్పడు. పోనీ ఆమె అయినా వారిద్దరి మధ్య సంబంధాన్ని గురించి నిజాయితీతో చెబుతుందా అంటే అదీ లేదు. మొత్తానికి వారి మధ్య సంబంధం లైంగికమే అయినా, ఆమె అతడికి బానిస కావడానికి కారణం మాత్రం అది కాదు. అది బౌద్ధికం; ఎందుకంటె అతడికి ఇతర స్త్రీలు ఎవ్వరూ దొరక నప్పుడే అతడు ఆమె వంక చూసే వాడు. అసలతడు ఆడవాళ్లను జయించ వలసిన, ఆక్రమించవలసిన వస్తువులుగా భావించిన మగ దురభిమాని. అతడికి మగవాళ్ళ కంటే ఆడవాళ్ళంటేనే ఎక్కువ ఇష్టం. వారితోనే మాటాడే వాడు. కాలం గడిపే వాడు. ''రేమండ్ ఆరన్‌తో తత్త్వం మీద మాటాడడం కంటె ఆడవాళ్లతో తీపి గుసగుసలు ఇష్టం'' అని తన War diaries లో రాసుకొన్నాడు. ఇందులోనే ఇంకా ఇలా రాశాడు: ''ఆడవాళ్ళను అడవి జంతువును మచ్చిక చేసుకొన్నట్లు చేసుకోవాలి. కాని ఇలా చేయడం ఎందుకంటే ఆమెను ఆటవికత నుంచి మానవ దశకు లేవనెత్తడానికే''.

అతడు బోవార్‌కు మరులు గొలిపి, ప్రేమాయణంలోకి దించి నప్పుడు ఆమెతో చాలా స్పష్టంగా చెప్పాడు తనకు చాలా మంది అమ్మాయిలతో పడుకోవాలని ఉందని. ఇందుకు ఆవిడా సమ్మతించింది. అసలు అతడి ఉద్దేశంలో ప్రేమ రెండు రకాలు: ఒకటి అసలు ప్రేమ లేదా ఆవశ్యక ప్రేమ; రెండవది అంచు ప్రేమ (అనుషంగిక ప్రేమ). ఈ రెండవ రకం ప్రేమ క్రిందకు వచ్చే వాళ్ళంతా అంచుమీది ఆడవాళ్ళు. కాని బోవార్ ఈ కోవకు చెందదు. మొదటి రకం ప్రేమకే చెందుతుంది. అవసరమనుకొంటే ఆమె కూడా పైపై తిరుగుళ్ళు తిరగవచ్చు నన్నాడు. ఆమె రాసిన 'చాందసులు' (The Mandarins = పాత పద్ధతులను వీడని వారు)

అనే నవలలో తానెలా ఆర్థర్ కోజ్లర్‌ను మరులు గొలిపి విమోహితుణ్ణి చేసిందీ వర్ణించింది. ఆ వర్ణనను చూసి సార్త్ర నవ్వాడు. ఆవిడ మరొక అంచు ప్రేమికుడు అమెరికన్ నవలాకారుడు నెల్సన్ ఆల్గ్రిన్. ఇతడితో సంబంధాన్ని, అదే నవలలో వర్ణిస్తూ, అతనిని మారు పేరుతో పేర్కొంది. అయినా అతడు ఒక ఇంటర్వ్యూలో ఇలా ఉల్లేఖించడంపై, తన ఆగ్రహాన్ని వెలి బుచ్చాడు. ఆమె అంతటితో ఊరుకోక `The Prime of Life' అనే తన స్వీయ చరిత్ర రెండవ సంపుటంలో అతని గురించి అతని పేరు పెట్టి రాయడమే కాక, ధృవపత్రంగా అతడి ప్రేమ లేఖనే ఉటంకించింది. ఈ సంగతులను ఆల్గ్రిన్ ఒప్పుకొంటూనే ఇలా అన్నాడు: ''ప్రేమ లేఖలను ఎవరైనా రహస్యంగా అట్టిపెట్టు కొంటారు. ప్రపంచంలో నేను ఎన్నో వేశ్యావాటికల్లో విహరించాను. అక్కడ ఆడవాళ్ళంతా - అది ఇండియా కానివ్వండి, కొరియా కానివ్వండి - తలుపులు మూస్తారు. కాని ఇదెక్కడి ఆడదో తలుపులు బార్లగా తెరిచి అందరిని చూద్దురుగాని రమ్మని ఆహ్వానిస్తుంది''. ఈ విషయాలు ఇంటర్వ్యూలో చెప్పి, అదే రాత్రి గుండెపోటుతో అతడు మరణించాడు.

ఆమె ఎంత ''అసలు ప్రేమికురాలైనా'' సార్త్ర తన అంచు ప్రేమలను గురించి రాసిన ఉత్తరాలను భరించడం కష్టం. Letters an castore లో ఇలా ఉంది: ''ఇదే మొదటిసారి నేను ఒక నల్లజుత్తు అమ్మాయితో పడుకోవడం. ఆ అమ్మాయి జుత్తు గుమ్మత్తుగా ఉంది. ఆమె శరీరం నుంచి ఏదో మరులు గొలిపే వాసన. వెన్నుపూస చివర జుట్టుకుచ్చు. తెల్లగ నిగనిగలాడే శరీరం. ఊదే బూర (సంగీత వాయిద్యం) లాంటి సుడులు విచ్చుకొనే నాలుక, నా గొంతులోకి వెళ్ళింది'' ఈ వర్ణనను బోవార్ ఎలా భరించిందో?

సార్త్రకు అనేకమంది అమ్మాయిలతో సంబంధా లుండేవి. అయితే వీటిని అన్నింటిని బోవార్ సమదృష్టితో చూడ లేక పోయింది. మారెవిలీ అనే ఆమెను అసహ్యించుకొనేది. అంతకంటే ఓల్గాను ద్వేషించింది. ఆ తరువాత వరసలో ఓల్గా సోదరి బోవార్ శిష్యురాలు అయిన వాండా సార్త్ర ఉంపుడు గత్తె అయింది. బోవార్ సర్దుకోక చేయ గలిగింది ఏమీ లేదు. ఎప్పుడూ త్రికోణ సంబంధం. అతడు, ఆమె, మరో ఉంపుడు

గత్తె. ఈ అమ్మాయి అతడికిగాని ఆమెకుగాని శిష్యురాలై ఉంటుంది.

1940ల నాటికి సార్త్ర తన శిష్యురాళ్ళను చెడ గొడుతున్నాడన్న పేరు మారు మ్రోగిపోయింది. రాబర్ట్ ఫ్రాన్సిస్ ఇలా రాశాడు: ''మాకందరికీ సార్త్ర ఏమిటో తెలుసు. అతడు తన శిష్యురాళ్ళ లోదుస్తు (Under Wear) లను అధ్యయనం చేసే విచిత్ర దార్శనికాచార్యుడు''. బోవార్ కూడా అధ్యాపకురాలు కావడం, ఆవిడ దగ్గర చదివే ఆడపిల్లలు కావలసినంత మంది ఉండడంతో వారిలో ఎక్కువ మందికి సార్త్ర మరులు గొలిపాడు. అతడి కామానికి గురయ్యారు. ఒక విధంగా ఆమె వారిని ప్రోత్సహించి తార్పుడుగత్తె పాత్రను నిర్వహించింది. ఆమె తార్చిన వాళ్ళల్లో రష్యన్ ప్రవాసుల అమ్మాయి నటాలి ఒకతె. బోవార్‌కు నచ్చిన, మెచ్చిన శిష్యురాలు ఈమె. ఈ అమ్మాయి తలిదండ్రులు బోవార్‌పై కేసు పెట్టారు. స్నేహితులు జోక్యం చేసుకొని కేసును ఉపసంహరింప జేశారు. కాని ఫ్రాన్స్‌లో ఎక్కడా ఆమె చదువు చెప్పకుండా లైసెన్సు రద్దు చేశారు.

సార్త్ర వయస్సు పెరిగిన కొలది 17,16 సంవత్సరాల పడుచులు కావలసి వచ్చారు. ఆ అమ్మాయిలను తాను చట్టపరమైన అర్థంలో దత్తు చేసు కొంటు న్నాననేవాడు. అతడు బోవార్‌కు చెప్పేవన్నీ అబద్ధాలే. ఒక అమ్మాయితో తాను విసిగి పోయానని బోవార్‌కు చెప్పాడంటే, అతడు ఆమెను వివాహ మాడడానికి రహస్య ప్రతిపాదన చేస్తున్నాడన్న మాట. 1940-48ప్రాంతంలో బోరిస్ వియాన్ భార్య, తేనె రంగు అమ్మాయి మైఖిలి, అందమైన ఓల్గా సోదరి వాండా, నటి ఎవిలిన్‌రే ( ఈమె కోసం తన చివరి నాటకంలో ఒక పాత్ర రాశాడు), పదిహేడు సంవత్సరాల ఆర్లెటీ ( ఈమెనే బోవార్ అతిగా ద్వేషించింది ఈమెనే సార్త్ర చివరకు దత్తు చేసుకొందీ), గ్రీకు యువతి హెలీన్ లాసిథియోటకిస్ - వీరందరినీ తన జనానాలో చేర్చు కొన్నాడు. ఒకరికి తెలియ కుండా ఒకరిని అందరినీ మోసగించాడు.

ఇక ఆడవాళ్ళ గొడవ వదిలేస్తే, మగవాళ్లతో అతడికి పెద్దగా పడేది కాదు. ముఖ్యంగా తనతో సరిసమానులైన మేధావులతో అసలే పడేది కాదు. అసలు రహస్యం ఏమిటంటే, ఈ మేధావులు ఎప్పుడైనా అతడి వాదనలను తేలికగా అలవోకగా, ఊదివేయ గలరు. ఉదాహరణకు రేమండ్ ఆరన్, ఆర్థర్

కోజ్లర్, మెర్లొపాంటీ, ఆల్బర్ట్ కామూ (Albert camus) మొదలైన మేధావులతో ఎవరితోనూ పడేది కాదు. మరో కారణం ఇతడికి రాజకీయంగా స్పష్ట, స్థిర దృష్టి అంటూ ఒకటి లేదు. ఆర్థర్ కోజ్లర్ లాంటి వారు ఒక విస్పష్టరాజకీయ దృష్టితో ఎవరినో ఒకరినే బలపరుస్తుంటే, ఇతడు ఎప్పుడైనా, ఎవరినైనా బలపరచ గలిగే వాడు. ఇతడు మార్క్సిస్టు కాదు. ఎలాగంటే మార్క్సిజం ఇతడు చెప్పే వ్యక్తి స్వేచ్ఛకు వ్యతిరేకం; అయినా, 1940లో ఆరన్, కోజ్లర్‌లు కమ్యూనిజాన్ని ఖండిస్తుంటే, ఇతడా పని చేయ లేక పోయాడు. వారిద్దరితో ఇతడికి గల తగవుకు ఇదో కారణం.

1952 నాటికి అతడు సంధిగ్ధావస్థ నుంచి ఒక నిర్ణయానికి తెమిలి ఒక కొలిక్కి వచ్చాడు. కమ్యూనిస్టు పార్టీని బలపరచాలనే ఒక నిర్ణయానికి వచ్చాడు. ఒక ప్రక్క స్టాలిన్ నేరాలన్నీ బహిర్గతం అవుతు న్నప్పుడు, మరో ప్రక్క వామపక్ష మేధావులంతా కమ్యూనిస్టు పార్టీనుంచి బయటికి వస్తున్న తరుణంలో కమ్యూనిస్టు పార్టీని సమర్థించడ మంటే, తల క్రింద, కాళ్ళు పైన పెట్టి నడవడమే. స్టాలిన్ క్యాంపులను గురించి అతడు నోరు మెదప లేదు. ''మానవునికి స్వేచ్ఛనుంచి విముక్తి లేదు'' అనే తన సిద్ధాంతం నుంచి స్టాలిన్ క్యాంపులను ఎలా సమర్థిస్తాడు? అందుకనే నెమ్మదిగా జారు కొన్నాడు. ''మేము పార్టీ సభ్యులంకాము గనుక వారి తగవులను గురించి, వారి వ్యవస్థ స్వభావం గురించి ఏమీ మాటాడం''.

1954లో రష్యా పర్యటన నుంచి తిరిగి వచ్చాక, ఒక ఇంటర్వ్యూ ఇచ్చాడు. ఇదొక గొప్ప ఇంటర్వ్యూ. పాశ్చాత్య మేధావి అయిన బెర్నార్డ్ షా 1930లో రష్యా పర్యటనానంతరం ఇచ్చిన ఇంటర్వ్యూ తర్వాత ఇదే గొప్ప ఇంటర్వ్యూ. అందులో సార్త్ర ఇలా అంటాడు: ''సోవియట్ ప్రజలు యాత్రలు చేయరు; కారణం వారిని ఎవరో ఆపడం కాదు. వారు తమ అద్భుత దేశాన్ని వదలి బయటికి రానిచ్ఛగించరు. అక్కడి పౌరులు రష్యాను విమర్శిస్తారు కూడా. మనం ఇక్కడ మనదేశాన్ని విమర్శించే కంటె ఎక్కువగానే విమర్శిస్తారు. రష్యాలో విమర్శకు పూర్తి స్వేచ్ఛ ఉంది.''

తరువాత చాల సంవత్సరాలకు ఆ ఇంటర్వ్యూలో తాను చెప్పినదంతా అబద్ధమేనని చెప్పాడు. సన్నివేశాలు (Situations) అనే గ్రంథంలో ''1954లోనా రష్యా యాత్రానుభవాల గురించి అబద్ధం చెప్పాను. వాస్తవానికి

అబద్ధమనే మాట ఘాటైన పదమే కావచ్చు. నేనొక వ్యాసం వ్రాశాను. అందులో రష్యా గురించి నేను నమ్మని అనేక స్నేహ పూర్వక విషయాలు చెప్పాను. అలా ఎందుకు చెప్పానంటే, ఇంటికి తిరిగి రాగానే అతిథులను గురించి చెడుగా మాట్లాడలేము గదా. ఇదొక కారణం. మరో కారణం, నిజంగా నా భావాలకు రష్యాకు మధ్య సంబంధాలలో నేనెక్కడ ఉన్నానో నాకే తెలియదు''.

జాన్‌పాల్ సార్త్ర మాటలవాడే కాని చేతల వాడు కాదు. అందుకే నేమో తన ఆత్మకథను ''మాటలు (Words) అని పేరు పెట్టుకొన్నాడు. అతను ఎప్పుడూ ఒక మాట మాత్రం నిలబెట్టు కొన్నాడు. అదేమిటంటే రోజుకు ఒక పంక్తయినా రాయకుండా నిద్ర పోరాదు. ఒక పంక్తికేం కర్మ, రోజుకు 10,000ల పదాలు రాసే వాడు. విపరీతంగా రాసిన మాట నిజం. అందులో ఎక్కువ భాగం గుణహీనం అయింది. పరిమాణమే కాని గుణం ప్రధానం కాదు అతడికి; పేజీలు నింపడం కావాలి. 1940లో బోవార్‌కు రాసిన ఒక ఉత్తరంలో ''పరిమాణాన్ని గుణంగా ఎంచాను'' అన్నాడు. ఫ్లాబర్ట్ మీద అతడు రాసిన గ్రంథం మూడు సంపుటాల్లో - 2802 పుటలు అయింది. ఇందులో ఎక్కువభాగం అపఠనీయం. ''నా దగ్గర ఉన్న సరుకు నంతా సాహిత్యంలోకి చొప్పించాను. మతం లేని లోటును సాహిత్యం పూడుస్తుంది. మాటలు జీవితం, మాటలు మాటలు, మాటలు మాటల మూటలు, మాటలే ప్రపంచం, మాటలు (పదాలు) కేవలం అక్షర సంయోగాలు కావు, అర్థాలు కావు. అంతకంటె ఎక్కువైనవి. అవి సజీవ వస్తువులు. పదాల మార్మికత నాకు అనుభవంలోకి వచ్చింది. కొంచెం కొంచెంగా నాస్తికత్వం, అంతటిని తినివేసింది. నేను నా రాతను లౌకికీకరించాను. అవిశ్వాసిగా భాషకు అర్థమేమిటో తెలుసుకోవలసిన అవసరంతో పదాలను చేరాను. నన్ను నేను అనుప్రయుక్తం చేసు కొన్నాను. కాని నా యెదుట ఒక స్వప్నం - మరణాన్ని, ఒక సంతోషకర క్రౌర్యాన్ని, ఒక సాతత్య దురాకర్షణ క్రౌర్యాన్ని వాసన పట్టాను'', అని అప్రమురిత రాత ప్రతులలో రాసుకొన్నాడు. దీనికి అర్థం ఏమిటి? అర్థం లేని రాతలు. జాన్సన్ ఒకసారి ఫ్రెంచివాళ్లను గురించి ఒకమాట అన్నాడు: 'ఫ్రెంచి వాడు ఎప్పుడూ ఏదో ఒకటి వాగుతూ ఉండవలసిందే, ఆ మాటాడే దేమిటో అతడికి తెలిసినా తెలియక పోయినా'.

ఒకసారి 1958-59లలో ఫ్రాయిడ్ మీద సినిమా తీయడానికి జాన్‌పాల్ సార్త్ర, జాన్ హోస్టన్‌లు కలిసి స్క్రిప్టు రాస్తున్నారు. ఆ పనిమీద సార్త్ర వచ్చి హోస్టన్‌తో ఐర్లండ్‌లో ఉన్నాడు. సార్త్రమీద హోస్టన్‌కు ఏర్పడిన అభిప్రాయాలను హోస్టన్ తన `An Open Book' అనే గ్రంథంలో రాశాడు: ''అతడి ముఖ్య లక్షణం ఎప్పుడూ ఏదో ఒకటి వాగుతూ ఉండడం. అతడితో సంభాషించడం అంటూ ఉండదు; ఎందుకంటె అతడు నిన్ను మాటాడ నీయడు. అసలతడు మాటాడడం ఆపితే గద. మధ్యలో నీవు అతనిని ఆప లేవు. శ్వాస తీసుకోవడానికైనా ఆపుతా డేమోనని నీవు ఎదురు చూడాలి. కాని అతడు శ్వాస తీసుకోడే. పదాలు వరదలా పొర్లి వస్తాయి''. గమ్మత్తు ఏమిటంటే సార్త్ర తను మాటాడే దానికి తానే నోట్సు రాసుకోవడాన్ని చూసి హోస్టన్ ఆశ్చర్య పోయాడు. ఒకసారి మధ్యలో హోస్టన్ ఏదో పనిమీద బయటికి వెళ్ళాడు. తరువాత కాసేపటికి తిరిగివచ్చి చూస్తే అతడు ఇంకా మాటాడుతూనే ఉన్నాడు.

ఇదే కాకపోయినా ఇలాంటిదే మరొక సంఘటన జరిగింది. సార్త్రని మాటాడ వలసిందని జాన్‌వాల్, College of Philosophy లో ఉపన్యాసం ఏర్పాటు చేశాడు. ఆ ఉపన్యాసంలో అతడు తన రాతప్రతిని తెరిచి యాంత్రికంగా, ఎవరో తరుము కొస్తున్నట్లుగా గంట నలభై ఐదు నిమిషాలు కళ్ళెత్తకుండా చదువుకు పోయాడు. హాలు కిక్కిరిసి ఉండడంతో కొందరు క్రిందపడి పోయారు. ఇది అతడు గమనించ కుండానే చదువుకు పోతున్నాడు. చివరకు గత్యంతరం లేక జాన్‌వాల్ సార్త్రకు ఆపమని సంజ్ఞ చేశాడు. వెంటనే సార్త్ర, మాట పలుకూ లేకుండా, కాగితాలు చుట్టుకొని బయటకు విస విస నడిచి పోయాడు.

సార్త్రకు సంపాదన లోటు ఏమీ లేదు. డబ్బు విపరీతంగానే వచ్చేది. అయితే అతని చేతి వేళ్ళ మధ్య సందు లుండేవి. వాటి గుండా అది నీళ్ళలా జారి పోయేది. అందుకే అతడు ''ధనానికి చచ్చి పోయే లక్షణం వుంది. అది నా వేళ్ళ మధ్య జారిపోతే అంతర్ధానం అవుతూ ఉంటే ఎంతో అందంగా ఉంటుంది. అలా జరగడం నాకెంతో ఇష్టం'', అని War Diaries లో రాసుకున్నాడు. ఇతడు డబ్బు విషయంలో మాత్రం ఇతర మేధావులు లాంటి వాడు కాదు. మంచి దాతృ హృదయం కలవాడు.

మంచి కార్యక్రమాలకు ఉదారంగా డబ్బిచ్చే వాడు. అసలు తనకు డబ్బుతో పని అంటూ ఉండ గూడదనే వాడు. అయితే మరి అది లేనిదే ఏమీ జరగదు. ఒక్క ప్రక్క విపరీత దాతృత్వంతో అప్పుల్లో పడేవాడు. మరో ప్రక్క ఆదాయపు పన్నుల వారు. ఇతడికి తెలియకుండానే తల్లి పన్నులు చెల్లిస్తుండేది. ఒకసారి అయితే ఒక కొత్త చెప్పుల జత కొనుక్కోవడానికి కూడా డబ్బులు లేవని బాధ పడ్డాడు.

తాగుడు, స్త్రీలు అతడి ఆరోగ్యాన్ని హరించి వేశాయి. ముసలితనం ముందుగానే వచ్చేసింది. బోవార్ తన ''సార్త్రకు వీడ్కోలు'' అనే గ్రంథంలో అతడి చివరి సంవత్సరాలను కడు నిష్ఠురంగా వర్ణించింది. అతడి నిగ్రహరాహిత్యం, అమ్మాయిలు తన కనుగప్పి అతడికి విస్కీ సీసాలు అందించడం, దాని మూలంగా ఎక్కువైన తాగుడు, అతని మనస్సులో మిగిలిన భాగంపై అధికారం కోసం పోరాటం - ఇవన్నీ 15 ఏప్రిల్ 1980న అతడి మరణంతో ఊరట చెందాయి. ఊపిరి పీల్చుకొన్నాయి. అతడి శవాన్ని కాటికి తీసుకు పోయేటప్పుడు, ఏభైవేల మంది దానిని అనుసరించారు. జనం చెట్లపైకి గూడా ఎక్కారు.

1965లో రహస్యంగా అర్లెటీని కూతురుగా దత్తత తీసుకున్నాడు. ఆ కారణాన అతడి మరణానంతరం అతడి ఆస్తికంతటికి - సాహితీ ఆస్తికి కూడా - ఆమె ఉత్తరాధికారిణి అయింది. చివరిసారిగా ఈ విధంగా బోవార్ నమ్మక ద్రోహానికి గురయింది. తరువాత ఆమె ఐదు సంవత్సరాలే జీవించింది.

''అంచు ప్రేమ అసలు ప్రేమను జయించింది''.

*(91 ఫిబ్రవరి మిసిమి)*

# బెర్ట్రాండ్ రసెల్

మరో అవకాశం ఇస్తే, ఇదే జీవితాన్ని తిరిగి గడపడానికి నీవు ఇష్టపడతావా, అని ప్రశ్నిస్తే నీ సమాధానం ఏమిటి? ఇంతకంటే మంచి జీవితం కావాలని అడుగుతావు. మరి రసెల్ ''నన్ను ముంచెత్తి మునకలు వేయించిన మూడు మహాబలోపేతమైన మోహాలు నా జీవితాన్ని తీర్చిదిద్దాయి. జీవనలాలస, జ్ఞానాన్వేషణ, మానవాళి వ్యథకు నాలో రేగిన భరింపశక్యంగాని కరుణ - ఈ మూడు మోహాలు, పెనుగాలులా, నన్ను అటు ఇటు ఊపి, విచలిత పథంలో, వ్యథాభరిత మహాసాగరంలో నిరాశా నిస్పృహల అంచుకు తీసుకు పోయాయి. ఇదీ నా జీవితం. ఇటువంటి జీవితం నాకు విలువైందిగానే కనిపించింది. మరో అవకాశం ఇస్తే ఇలాంటి జీవితం గడపడానికి బహు సంతోషంగా అంగీకరిస్తాను''.

**27** మే **1919**న లిటన్ స్ట్రాచీ, వర్జీనియా ఉల్ఫ్‌కు రాసిన లేఖలో రసెల్‌నుగురించి ఇలా అంటాడు: ''రసెల్ బుద్ధి కుశలత వలయాకార రంపం''. ఈ పోలిక చాలా అర్థవంతమైంది. గుండ్రని రంపపు పళ్ళు ఎదురెదురు దిశల్లోనే కాక దశ దిశలా తిరుగుతాయి. అంతేకాదు ఆ రంపం అలా తిరుగుతూనే ఛేదించు కొంటూ ముందుకు చొచ్చుకు పోతుంది. తన సిద్ధాంతాలలోని లోపాలను తానే విమర్శించు కొంటాడు. అతడు తనపై చేసుకొన్న ఆ విమర్శలను చూడ కుండానే, అదే విమర్శలను ఇతరులు అతనిపై చేశారు. అలా విమర్శించి ఆ విమర్శలు తమ సొంతం అని భ్రమిస్తారు. అతడి బుద్ధివిశేషం అలాంటిది.

తనదంటూ ఒక ప్రత్యేక దర్శనం లేని దార్శనికు డాతడు. దర్శనం లేకుండా అతడు దార్శనికుడు ఎలా అయ్యాడు? ఇదే విషయాన్ని మరోలా చెబితే, అతడు సర్వదర్శన దార్శనికుడు. ఎలాగంటే, ఈనాడు చెప్పుకో దగిన తాత్విక దృక్పథం ఏదైనా ఉందీ అంటే, అది అతడి రచనలో ఎక్కడో అక్కడ నిశిత పరిశీలనకు గురైనదే. అన్ని దర్శనాలను పరిశీలించి వాటి మీద అంతో ఇంతో వెలుగును ప్రసరించాడు. అతడొక దర్శనాన్ని పరిశీలించాడంటే దానిని పుటం పెట్టినట్లే.

A.N. వైట్‌హెడ్ ఒకసారి ఆయన్ను గురించి. ''అతడి కతడే ఒక ప్లేటో సంవాదం'' అన్నాడు. రసెల్ ఒకరు కాదు, ఇద్దరూ అంటారు విల్‌డ్యూరాంట్. ప్రపంచ సంగ్రామంలో చచ్చిపోయిన గణిత శాస్త్రజ్ఞుడు రసెల్ ఒకరు. ఆ గణిత తార్కిక భస్మం నుంచి తిరిగి ఊపిరి పోసుకొన్న మార్మిక కమ్యూనిస్ట్ రసెల్ మరొకరు. మొత్తం మీద అతడు గణితాన్ని దేవుని స్థాయికి పెంచాడు. ఆ రోజుల్లో అంటే **1914**లో అతణ్ణి చూస్తే ఏమనిపించే దంటే, తాత్కాలికంగా మూర్తీభవించిన అమూర్తీకరణం అని, రెండు కాళ్ళపై నిలబడ్డ ఒక గణిత సూత్రమని.

స్పెన్సర్ పంథాలో అతడు, పాఠ్య ప్రణాళికలో శాస్త్రీయ విజ్ఞానానికి పెద్దపీట వేయాలనే వాడు. ప్రపంచంలో ఎదురయ్యే చిక్కులన్నిటికి కారణం మార్మికతే. ఆలోచన క్రమబద్ధంగా శాస్త్రీయంగా లేని కారణాన ఏర్పడిన గందరగోళం. అందుకని ప్రతి ఒక్కరూ తిన్నగా ఆలోచించడం నేర్చుకోవాలి. ''నేనుగాని మరొకరు కాని ఒక అబద్ధాన్ని నమ్మ వలసి రావడం కంటే, ఈ ప్రపంచం వినాశనమైనా పరవా లేదు. శాస్త్రీయ సత్యాన్ని బోధించాలి.''

అతడికి క్రైస్తవం గణితంలా తోచ లేదు. మతంలో నీతిని తప్ప తతిమ్మాదానినంతా గర్హించాడు. ''ఒక ప్రక్క క్రైస్తవాన్ని కాదన్న వారిని వేధించే నాగరకత, మరో ప్రక్క దానిని కౌగిలించుకొనే వారిని జైలులో పెట్టే నాగరకత - ఈ నాగరకతలు ఎటువంటివి? అటువంటి వైరుధ్యాల ప్రపంచంలో దేవుడు ఎలా ఉంటాడు?'' అని అతడు ప్రశ్నించాడు. అతని జీవితంలో అతడు స్పృశించని - ఊరికే తడమడం కాదు - సునిశితంగా పరిశీలించని, తనదైన ముద్రను దాని మీద వేయని విషయంగాని, జీవిత రంగం గాని లేదంటే అతిశయోక్తి లేదు. ఒక అసంపూర్తి లిస్టు ప్రకారం అతడి రచనలు **68**. ఆయన రాసిన మొదటి గ్రంథం జర్మన్ సోషల్ డెమోక్రసీ **(1896)**. అతని మరణానంతర ప్రచురణ ''విశ్లేషణలో వ్యాసాలు (essays in Analysis 1973). ఈ మధ్యలో అతడు రాసిన విషయాలు రేఖాగణితం, తత్వం, గణితం, న్యాయం, సామాజిక పునర్నిర్మాణం, రాజకీయభావాలు, మర్మవాదం, తర్కం, బోల్షివిజం, చైనా, మెదడు, పరిశ్రమ, ఎబిసి ఆఫ్ ఆటమ్స్ **(1923)**, విజ్ఞానశాస్త్రం, సాపేక్షవాదం,

విద్య, సంశయవాదం, వివాహం, సుఖం, నీతి, సోమరితనం, మతం అంతర్జాతీయ వ్యవహారాలు, చరిత్ర, నాస్తికవాదం, జ్ఞానం, భవిష్యత్తు, ఆయుధ విసర్జన, శాంతి యుద్ధనేరాలు, ఇంకా ఎన్నో విషయాలపై అతడు గాఢంగా, లోతుగా తన ముద్రవేశాడు. అంతేకాక వార్తాపత్రికల్లో, మాసపత్రికల్లో, ''పెదాల రంగునుంచి - భార్యలను బాదడం'' వరకు, మనం ఊహించగల అన్ని అంశాలపై రాశాడు, రేడియో ప్రసంగాలు చేశాడు. **1920**లో మాలెసన్ అతనిని గురించి ఇలా రాశాడు: ''ప్రతి ఉదయం బెర్టీ ఉదయాన్నే ఒంటరిగా నడకకు వెళతాడు. ఆ సమయంలో తానారోజు ఏమి రాయాల్సిందీ ఆలోచించు కొంటాడు. ఇక ఆ తరువాత ఇంటికి వచ్చి సాఫీగా ఒక్క దిద్దుబాటు గూడా లేకుండా మిగిలిన సమయం అంతా రాస్తాడు''. అతడు అన్ని విషయాలమీద అంత ప్రమాణంలో రచన ఎలా చేయ గలిగాడు? కొంతమంది ఆయన రాసిన ప్రతి పదానికి డబ్బులు వచ్చేవి కనుక అలా రాయ గలిగాడన్నారు. డబ్బు వచ్చిన మాట నిజమే అయినా, అతడి అన్ని సంపుటాల రచనకు ప్రేరణ అదే కాలేదు. అతడు రాయ కుండా ఉండలేక రాశాడని మనం భావించ వచ్చు. అది అతని ఆత్మాభివ్యక్తీకరణ.

**1872**లో లండన్‌లో జన్మించాడు. అనాథగా పెరిగాడు. ఎలాగంటే తల్లి, తండ్రి - ఇద్దరూ అతనికి నాలుగేళ్ళు నిండక ముందే గతించారు. తండ్రి స్వేచ్ఛా చింతనుడు కావడాన, అతడు మరణించే ముందే, రసెల్‌ను జాన్ స్టూవర్ట్ మిల్ దార్శనిక బాణీలో పెంచాలని ఆదేశించి చని పోయాడు. కాని నాయనమ్మ అదేమీ కుదరదని బైబిళ్ళ మధ్య పెంచింది. ట్యూటర్లను ఇంటికి రప్పించి చదువు చెప్పించారు. అయితే ఈ ప్రభావా లేమీ అతడి మీద పనిచేయ లేదు. తన దారినే తాను పెరిగాడు. పదిహేనేళ్ళ వయస్సులో, తన మత వ్యతిరేక భావాలు, పెద్దవాళ్ళకు తెలియరాదనే ఉద్దేశంతో అతడు వాటిని తన డైరీలో గ్రీకు అక్షరాలతో రాశాడు. ''నన్ను ఏ మతస్థునిగా పెంచారో ఆ మతం పునాదులను చూశాను''- అన్నాడు. ఆ రోజుల్లోనే అతడు అవిశ్వాసిగా మారాడు. జీవితాంతం అలాగే ఉండి పోయాడు. దేవుడు కాకపోయినా, ఈ ప్రపంచం నిలబడడానికి నడవడానికి ఏదో ఒక అతీతమైన శక్తి ఉండాలని అనేకమంది చేసే వాదం అతనికి రుచించ లేదు. ఈ ప్రపంచ ప్రహేళికలకు సమాధానం కనుకొంటే

ఎప్పటికైనా మానవ మేధ మాత్రమే కనుక్కోవాలి. లేదా అసలు కనుక్కోకపోవడమైన జరగాలి. మరో విధంగా వీటిని పరిష్కరించే వీలు లేదు. మానవ మేధస్సు మీద అతడికి అంతటి అచంచల విశ్వాసం. అంతే కాదు. అతనికి అమూర్త ఆలోచన అంటే మహా ఇష్టం. అందుకే ఆయనను గణితం ఆకట్టు కొంది. ''గణితం అంటే నాకు మహా ఇష్టం. ఎందుకంటే అది మానవం కాదు. గణితంలో సత్యమే కాదు. అందం కూడ ఉంది. ఆ అందం అతి శీతలం, కడు నిష్ఠురం, శిల్ప చందం దాని అందం. మానవ బలహీనతలను రెచ్చగొట్టదా అందం. నిజమైన కళ ప్రదర్శించే పరిపూర్ణతను అది ప్రదర్శిస్తుంది'', అంటాడు రసెల్.. ఆ సౌందర్య భావనతోనే అతడు Principia mathematica అనే గ్రంథాన్ని వైట్‌హెడ్ తో కలిసి రాశాడు. దీనికే నోబెల్ బహుమానం పొందాడు.

(నోబెల్ బహుమానం వచ్చింది సాహిత్యానికి. ఈ పొరపాటు ఎలా దొర్లిందీ పి. ఎ. చౌదరిగారి విమర్శకు సమాధానంలో చూడవచ్చు.)

గణితం, తత్వం మామూలు మనుషుల కోసం కాదు. అవి ఆయా శాస్త్రాలలో పారంగతులైన వారికోసం మాత్రమే. మామూలు మనిషికి లోకజ్ఞానం మాత్రమే ఉంటుంది. లోకజ్ఞానంలో ''ఆటవికుల అధిభౌతిక జ్ఞానం'' మాత్రమే ఉంటుంది. మామూలు వాళ్లు జీర్ణించుకో గలిగిన మేరకే మేధావుల ఆలోచనా ఫలితాలను వారికి అందించాలంటాడు రసెల్. అయితే అతడి జీవితం ఉత్తరార్థంలో, ప్రజలు ఏవి చెయ్యాలో, ఎలా ఆలోచించాలో విస్తృతంగా చెప్పాడు. దీనితో ప్రపంచం అంతా, దార్శనికుడు ఎవరూ అంటే, రసెల్ అనే అభిప్రాయానికి వచ్చింది. అతడు దార్శనికుల ఆదర్శరూపం అయ్యాడు. 'దర్శనం' అంటే ఏమిటి? అంటే రసెల్ చెప్పిందే 'దర్శనం' అన్నారు జనం.

1946లో అతడు ప్రకటించిన ''పాశ్చాత్య తత్త్వ చరిత్ర' (History of western Philosophy) చాలా అద్భుతమైన గ్రంథం. అటువంటి గ్రంథాలలో దానిదే అగ్రతాంబూలం. ఆయన తోటి వారు ఆ గ్రంథం విజయాన్ని చూచి అసూయతో వేగి పోయారు.

అతడి జీవితం మొత్తంలో నాలుగుసార్లు చట్టం తన దీర్ఘ బాహువులను

అతడి వేపు సాచింది. మొదటిసారిగా 1916లో యువకులను బలవంతంగా మిలిటరీలో చేర్చాలని నిర్దేశించే చట్టం. ఈ చట్టాన్ని గురించి అతడొక 'ఆకాశ రామన్న' కరపత్రం వేశాడు. దానిని పంచుతున్న వారిని ప్రభుత్వం నిర్బంధించడంతో, తానే దాని రచయితనని బహిర్గతం చేసి జైలు కెళ్ళాడు. దీనితో ట్రినిటీలో అతని ఫెలోషిప్ ఊడింది. ఒక తప్పుకు రెండు శిక్షలు. తరవాత ''జర్మన్ పీస్ ఆఫర్''ను గురించి 1918 ఫిబ్రవరి 11న ట్రిబ్యునల్ అనే రాడికల్ పత్రికలో వ్యాసం రాసినందుకు రెండవసారి జైలు కెళ్ళాడు. ''అమెరికన్ సైన్యం జర్మన్ సైన్యాన్ని ఎదుర్కోగలిగినా ఎదుర్కోలేక పోయినా, సమ్మె జరిపే వారిని భయపెట్ట గలదు. ఇది వారికి ఇంటివద్ద (అమెరికాలో) అలవాటైన విద్యే'', అని రాశాడు. ఇలాంటి రాత ఇంగ్లాండ్ – అమెరికా సంబంధాలను బెడిసి పోయేట్టు చేస్తుంది. ఆ కారణాన జైలులో వేశారు. తరవాత 1939–40లో న్యూయార్క్ సిటీ విశ్వవిద్యాలయంలో ఆచార్యుడుగా నియమింప బడినప్పుడు అతని మత వ్యతిరేకతను, అనైతిక దృక్పథాలకు అమెరికా నుంచి పంపివేశారు. క్రైస్తవ వ్యతిరేక వ్యాసాలు ఎన్నో రాశాడు. నాస్తిక విశ్వాసాన్ని, మతాధికారులు ముక్కుతో మాట్లాడే పద్ధతితో, వారిని వ్యంగ్యానుకరణం చేస్తూ చెప్పేవాడు. ''మాకు దేవుని మీద నమ్మకం లేదు. కాని మానవాళి అధిక్యత మీద విశ్వాసం ఉంది. మరణానంతర జీవితాన్ని విశ్వసించం. కాని సత్కర్మల ద్వారా లభించే శాశ్వతత్వాన్ని నమ్ముతాము'' – ఈ వాక్యాలను పిల్లలకు చెప్పడంలో అతడు మహదానందం పొందేవాడు. న్యూయార్క్ సిటీ విశ్వవిద్యాలయం పదవికి ఎంపిక చేసినప్పుడు 'ఇతడు మతవ్యతిరేకి కనుక పనికి రాడని' ఒకామె కోర్టుకు వెళ్లింది. ఆమె న్యాయవాది రసెల్ రచనలను కామోద్దీపకాలనీ, వైషయికాలనీ, శృంగార భూయిష్టాలనీ, పచ్చి రతిపూరితాలనీ, కామోన్మాదాలని, కామవాంఛా జనకాలనీ, అసత్యాలనీ, అసభ్యాలనీ, అనైతికాలనీ వర్ణిస్తే, ఆ కోర్టు న్యాయమూర్తి అతనిని ''వైదేశిక నాస్తికుడని, స్వేచ్ఛా ప్రణయవాది,'' అనీ అభిశంసించి అమెరికానుంచి పంపివేశాడు.★ ఇక ఆఖరు సారిగా 1961లో అతడి ఎనభయ్యో ఏట – న్యూక్లియర్ బాంబులకు వ్యతిరేకంగా, రక్షణ శాఖ కార్యాలయం ఎదుట బైఠాయింపు సమ్మె చేసి, అనేక గంటలు అక్కడ కూర్చొని అరెస్టు కావాలని ప్రయత్నించాడు. కాని ఏమీ జరగ లేదు. గృహోన్ముఖుడు కాక తప్ప లేదు.

★ పంపివేయలన్నాడు, పంపివేయలేదు. పరిచయంచూడు.

కావి ప్రజలను రెచ్చగొట్టే నందుకు 12 సెప్టెంబరున, కోర్టుకు హాజరుకమ్మని, సమన్లు వచ్చాయి. ఒక నెల జైలు వేసి, దానిని వారానికి తగ్గించి, జైలు ఆసుపత్రిలో ఉంచారు. శిక్షను ప్రకటిస్తూ న్యాయమూర్తి ''ఇంతకంటే మంచి విషయాలు తెలియ వలసినంత వృద్ధుడవయ్యావు'', అని మాత్రం అన్నాడు.

సోక్రటీజ్‌లో తత్వాన్ని నడిబజారులోకి తేగలిగాడా లేదా అన్నది అనుమానాస్పదమే అయినా అతడి ప్రయత్నాలలోని నిజాయితీని ఎవరూ శంకించరు. ప్రపంచంలోకి తత్వాన్ని తీసుకెళ్ళడంకంటే, ప్రపంచాన్ని తత్వానుసారం మార్చాలని ప్రయత్నించి విఫలమయ్యాడని కొందరు విమర్శిస్తారు. అమూర్తంగా ఎంతటి విషయాన్నైనా ఆలోచించ గలడు గాని, ఆచరణలో చిన్న చిన్న పనులు గూడ చేసుకో లేడు. కనీసం టీ పెట్టుకోవడం లాంటి చిన్న పనులు చేయడం అతడి బుర్రకు మించిన పని. అతడికి టీ అంటే ఎంతో ఇష్టం. ఒకసారి మూడవ భార్య టీ పెట్టుకోవడం ఎలాగో వంట ఇంటి పలక మీద రాసి పెట్టి వెళ్ళిపోయింది. ''కెటిల్ పొయ్యి మీద ఉంచు. మరగనివ్వు. తరువాత టీ పాట్‌లోకి వంచాలి.'' ఈ పనులు చేయడం ఆయన వల్లకాలేదు. ముసలితనంలో చెవుడు వస్తే, 'చెవిటి మిషన్ను' చెవిలో పెట్టుకోవడం ఆయనవల్ల కాలేదు. ఎవరైనా చేసి పెట్ట వలసిందే.

అతడికి భౌతిక ప్రపంచం, మానవ ప్రపంచం - ఈ రెండూ ఎప్పుడూ అర్థం కాలేదనిపిస్తుంది. మొదటి ప్రపంచ యుద్ధానంతరం ''నా ఉద్దేశాలు మార్చుకొన్నా'', నన్నాడు. ''అప్పటిదాకా తలిదండ్రులకు పిల్లల్ని ప్రేమించడం సహజ మనుకొన్నాను. కాని యుద్ధాన్ని చూసిన తరవాత ఆ పని బహు అరుదు అని తెలుసుకొన్నాను. అలాగే యుద్ధానికి ముందు అందరికీ డబ్బంటే ఇష్టం అనుకొన్నాను. కాని యుద్ధం తరవాత మనుషులకు 'వినాశం' అంటే ఇష్టం అని గ్రహించాను. మేధావులు సత్యాన్ని ప్రేమిస్తా రనుకొన్నాను. కావి 10 శాతం కూడ 'పేరు' కంటే 'సత్యా'నికి విలువ విస్తారని తెలుసు కొన్నాను.''

సిద్ధాంత జ్ఞానం, ఆచరణాత్మక అజ్ఞానం - ఈ రెండింటి సంయోగం ఇతరులలో ఉన్నప్పుడు ( ఈ సంయోగమే తనలోనూ ఉంది) అతడు

దానిని స్పష్టంగా చూడ గలడు. 1920 మే 19న బోల్షివిస్ట్ రష్యాలో లెనిన్‌ను కలుసు కొన్నాడు. లెనిన్‌ని 'రూపుకట్టిన సిద్ధాంతం'గా రసెల్ దర్శించాడు. ''అతడు మనుషులను గర్హించే భౌద్ధిక కులీనుడని'' అనిపించిందన్నాడు. లెనిన్ గురించి ముందుగా ఏమీ తెలియకుండా అతడిని కలిస్తే, అతడు ''ఏవో కొన్ని అభిప్రాయాలున్న ఆచార్యుడు''గా కనిపిస్తాడే కాని, ఒక నాయకుడని మాత్రం అతనిని ఎవరూ అనుకోరు. ఇందులో గమ్మత్తు ఏమిటంటే అతడికి లెనిన్ ఎలా కనిపిస్తాడని రాశాడో, రసెల్ కూడా వాస్తవంలో ఇతరులకు అలాగే కనిపిస్తాడనే విషయం గుర్తించ లేకపోయాడు.

మామూలు మనిషి వికార, మోహాలపుట్ట అని, ఊరికే ఉద్వేగాలకు గురవుతాడరని రసెల్ భావన. వీటి నుంచి మనిషిని మరల్చాలంటే తర్కాన్ని ఆశ్రయించాలంటాడు. మానవుడు మరీ తార్కికంగా పోయి, అతికి పోకపోతే, మానవ సంబంధాలు మెరుగు పడతాయి. యుద్ధాలు రావు. గణితశాస్త్రవేత్తగా రసెల్ చెప్పేదేమంటే, ప్రతి గణిత సమస్యను తార్కికంగా పరిష్కరించినట్లే, వివేచన ద్వారా పరిష్కారంకాని మానవ సమస్య ఉండదు. అంటే ప్రతి సమస్య గణిత సమీకరణంలా ఉంటుందని రసెల్ ఉద్దేశం కాదు. సహనంతో కొంత సమయం తీసుకొని ఆలోచిస్తే మానవ సమస్యలు చాలావరకు పరిష్కార సాధ్యాలని అతడి భావన.

కాని ఈ వాదునే రసెల్ వ్యక్తిగత జీవితానికి అన్వయిస్తే, పై సిద్ధాంతాలు రుజువు కావు. అతడి జీవితంలో ఎదురైన ప్రతి ముఖ్యమైన సమస్యా పరిష్కారంలో ముఖ్యంగా అతని ''అర్థం'' దెబ్బ తింటున్నప్పుడు - తర్కం కాక ఉద్వేగాలు వికారాలే అతడిని పాలించాయి.

రసెల్ జీవితంలో 'యుద్ధం - శాంతి' అనే అంశం మిగతా అన్ని విషయాలకంటే గూడ అధిక ప్రాముఖ్యాన్ని సంతరించు కొంది. బహుశా అతడు దీని మీదే తన శక్తియుక్తులన్నీ కేంద్రీకరించాడు. రసెల్ ఉద్దేశంలో మానవుని అహేతుక ప్రవృత్తికి యుద్ధం ప్రతీక. రెండు ప్రపంచ మహాసంగ్రామాలను చూశాడు. వాటి వినాశకర ఫలితాలనూ చూశాడు. యుద్ధాన్ని ఎవరు ఏ విధంగానూ సమర్థించ లేరు. మొదటి ప్రపంచ యుద్ధానంతరం అతడొక అభిప్రాయానికి వచ్చాడు. బలవంతగానైనా సరే

శాంతిని మానవాళి మీద రుద్దాలిసిందే. అగ్రరాజ్యమైన అమెరికా ప్రపంచంలో ఆయుధ విసర్జనకు తన బలాన్ని వినియోగించాలన్నాడు. అమెరికా అణ్వాయుధాల మీద గుత్తాధిపత్యం సంపాదించిన **1945-49** సంవత్సరాలలో ఇదే ప్రతిపాదనను పదే పదే చేశాడు. రష్యామీద ''నివారణ యుద్ధం'' (Presentive war) చేయాలని పలుమార్లు ప్రతిపాదించాడు. మార్క్సిజమ్‌ని పూర్తిగా పరిహరించాడు. స్టాలిన్ భీకర రాకాసి. అమెరికా, జపాన్ మీద మొదటి సారిగా అణుబాంబును వేసినప్పుడు, అతడు మళ్ళీ మళ్ళీ చెప్పాడు: ప్రపంచం మీద అమెరికా ఆయుధ విసర్జన విధించాలి. కావల్‌కేడ్ (Cavalcade) లో అతడు ఇదే విషయాన్ని రాసి దాని శీర్షిక 'మానవాళి ఆఖరి అవకాశం' అని పెట్టాడు. యుద్ధానికి దారితీసే రాజకీయ సంఘటనను కనుక్కోవడం కష్టం కాదన్నాడు. **1945 - 50** ప్రాంతాలలో రష్యామీద 'నివారణ యుద్ధం' గురించి ఎంతో చర్చ జరిగింది. **1948**లో ఆమ్‌స్టర్ డామ్‌లో జరిగిన ఫిలాసఫీ కాంగ్రెస్‌లో ఈ ప్రతిపాదనను దృష్టిలో ఉంచుకొని రష్యా ప్రతినిధి రసెల్ మీద దాడి చేశాడు. దీనికి ప్రతిగా అతడు, ''మీరు తిరిగి మీ దేశం పోయి, మోసం, ప్రచారాలను చాకచక్యంతో నిర్వహించగల సమర్థులైన సేవకులను పంపమని మీ యజమానులకు చెప్పండి'' అన్నాడు. న్యూయార్క్ టైమ్స్ మాగజీన్‌లో **1953** సెప్టెంబర్ **27**న రాశాడు: ''యుద్ధం భయానకమైందే, అయినా నా మట్టుకు నేను, కమ్యూనిస్టు మహాసామ్రాజ్యం కంటే యుద్ధాన్నే కోరతాను.''

సరిగ్గా ఈ సమయంలోనే యుద్ధాన్ని గూర్చిన అతడి అభిప్రాయాలు మార్పుకు లోనయ్యాయి. రష్యామీద 'నివారణ యుద్ధాన్ని' తానెప్పుడూ ప్రతిపాదించ లేదని నేషన్ పత్రికలో **1953** అక్టోబరులో రాశాడు. నాపై వచ్చిన ఈ కథలన్నీ రష్యన్ల కల్పితాలే నన్నాడు. కాని అమెరికాకు చెందిన ఆయుధ విసర్జన నిపుణులు అతని ప్రకటనలన్నింటని జతపరిచి అతనికి పంపినప్పుడు వాటిని అతడు కాదనలేక పోయాడు.

**1958**లో అణ్వాయుధ విసర్జన కమిటీకి (CND) ప్రెసిడెంట్ అయ్యాడు. జె.బి ప్రీస్ట్లీ, జాన్ కాలిన్స్ దీనిలో సభ్యులు. ఇంగ్లాండ్‌లో, ప్రపంచంలో ఆయుధాల తయారీకి వ్యతిరేకంగా అభిప్రాయాలను కూడగట్టుకు రావడం

దీని పని. తరవాత దీనిని చీల్చి, సహాయ నిరాకరణానికి ఉద్దేశించిన ''వందమంది కమిటి'' (Committee of One Hundred) ని స్థాపించాడు. దీని మీద మొదట సంతకం చేసిన వారిలో కాంప్టన్ మెకంజీ, జాన్ బ్రెయిన్, జాన్ ఆస్‌బరన్, ఆర్నాల్డ్ వెస్కర్, రెగ్‌బట్లర్, అగస్టస్ జాన్, హెర్బర్ట్ రీడ్, డోరిస్ లెసింగ్ లాంటి మేధావులు, కళాకారులు, రచయితలు ఉన్నారు.

యుద్ధాల మధ్య ఆయన కొన్ని విషయాల మీద ఎక్కువగా మాట్లాడారు. అవన్నీ ప్రసిద్ధాలయ్యాయి. 'తోడు కోసం పెళ్ళి', 'స్వేచ్ఛా ప్రణయం', 'విడాకుల సంస్కరణ', 'సహవిద్య' మొదలైన విషయాల మీద ఎంతో చెప్పాడు. వివాహానికి వెలుపల, లోపల స్త్రీకి పురుషునితోపాటు సమానహక్కులు ఉండాలన్నాడు. నైతికాధారం లేని సంప్రదాయ నీతికి స్త్రీలు బలైపోయారు; లైంగిక స్వేచ్ఛ ఉండాలన్నాడు.

అయితే అతడి ప్రవర్తన వాస్తవంలో స్త్రీల యెడ మరో విధంగా ఉంది. రసెల్ సోదరుడు ఫ్రాంక్ **1900**లలో భార్యకు విడాకులిచ్చి రెండో పెళ్ళి చేసుకొన్నప్పుడు, తనతో భోజనానికి కూచోమంటే, ఆమెను వేరే చోట ఉంచి రావాలన్నాడు. ఆ తరువాత మాత్రం అటువంటి నిషేధాలను పాటించ లేదు. సంప్రదాయక లైంగిక నీతిని వదిలి వేశాడు. **1911** మార్చి **19**న లేడీ ఒటోలిన్ మోరెల్‌ను, ఆమె భర్త ఇంట లేనప్పుడు కలసి ఆమెకు ప్రేమ విందు చేశాడు. నాటి నుంచే రసెల్ మొదటి భార్య ఆలిస్‌కు దూరమైనట్లయింది. ఆ రాత్రి ఒటోలిన్‌తో ''నిండు సంబంధాలు'' పెట్టుకో లేదన్నాడు. ఏమైనా, తాను ఆలిస్‌నూ, ఒటోలిన్ ఆమె భర్తను వదిలివేయాలని నిశ్చయించుకొన్నామని రాసుకొన్నాడు. మోరల్ దీనిని ఎలా స్వీకరిస్తాడనేది తన కనవసరం అన్నాడు. ఆమె భర్త, ఒకవేళ తామిద్దరిని చంపినా, ఒకరాత్రి పొందుకోసం ఆ మాత్రం మూల్యం చెల్లించ వెనకాడ నన్నాడు. ఈ సంగతి ఆలిస్‌తో చెప్పి నప్పుడు, ఆమె ఒటోలిన్ పేరును బయటకు లాగి విడాకులకు పడవేస్తానంది. అప్పుడు రసెల్ అంటాడు: 'ఆలిస్ అంతగట్టి పట్టుబడితే మరణమే శరణ్యం. దానితో ఆమె కోపానికి అంతులేక పోయింది. అలా కోపం ఆమె వెళ్ళగక్కాక, ఆమె అన్న కూతురుకు లాక్‌తత్వం మీద పాఠం చెప్పాను.'

1913లో ఆల్ప్స్ పర్వతాలలో ఒక మనోవిశ్లేషకుని భార్యను కలిశాడు. ఆమెతో ప్రేమ నడపాలనుకొన్నాడు. కాని అలా చేయబోయే ముందు ఆమెకు ఒటోలిన్‌తో తన సంబంధాలను గురించి చెప్పాలను కొన్నాడు. కాని ఆమె ఆ వ్యవహారం మీద అంత ఆసక్తి చూపించ లేదు. ఒక రాత్రి పరవాలే దనుకొంది. ఆ తరవాత మరెప్పుడూ ఆమెను కలవ లేదు.

1914లో చికాగోలో ఒక చిన్నమ్మాయితో వ్యవహారం నడిపాడు. ఆ అమ్మాయికి ఇంకా ముగ్గురు సోదరీమణులున్నారు. ''నేను రెండు రాత్రిళ్ళు వాళ్ళింటిలో గడిపాను. అందులో ఒక రాత్రి ఆ అమ్మాయి దగ్గర పండుకొన్నాను. మిగతా ముగ్గురూ ఆమె తలిదండ్రులలో ఎవరైనా అటుకేసి వస్తారేమోనని కాపలా కాశారు''. ఆమె పేరు హెలీన్ డడ్లే. ఆ అమ్మాయిని వేసవిలో ఇంగ్లాడ్ వచ్చి బహిరంగంగానే తనతో ఉండమని కోరాడు. ఈ విషయం ఒటోలిన్‌తో చెప్పాడు. అతడి నోటి దుర్వాసన పోయిన సంగతి తెలిసి, తనతో వ్యవహారం సాగించమని ఒటోలిన్ కోరింది. 1914లో హెలెన్ డడ్లే లండన్ వచ్చింది. ఈలోపు యుద్ధం ఆరంభం కావడంతో, రసెల్ యుద్ధాన్ని వ్యతిరేకించ దలిచి, తన ప్రతిష్ఠను కాపాడుకోవడం కోసం, చెదురు మదురుగా ఆమెతో సంబంధాలు పెట్టుకొన్నా, మొత్తం మీద ఆమెను దూరంగా ఉంచాడు. ''యుద్ధం నా ప్రేమను చంపింది. నే నామె హృదయాన్ని నలిపి వేశాను''.

తరవాత 1916లో కాన్‌స్టన్స్ మాలెసన్ అనే ఆమెతో గ్రంథం సాగించాడు. ఒటోలిన్‌తో కలిసి ఆమె రసెల్‌ను పంచుకొంది. ద్రౌపది సంవత్సరాలు చేస్తే ఈమె వారాలు చేసింది.

తరవాత డోరా బ్లాక్‌తో ప్రేమలోపడి ఆమెకు కడుపు చేశాడు. ఆమె విముక్త. అందుకని వివాహం తంతులో విశ్వాసం లేదని ఆమె వివాహం వద్దంది. రసెల్ కావాలన్నాడు. అందుకని ఆరు వారాల్లో బిడ్డపుడుతుందనగా పెండ్లి చేసుకొన్నారు. కాన్‌స్టన్స్‌ను పూర్తిగా వదిలి వేశాడు. వివాహాన్ని సిగ్గుమాలిన పనిగా, అవమానకరమైన దానిగా భావించిన డోరా బలవంతంగా పెళ్ళి కూతురైంది. రసెల్‌కు ఇప్పుడు ఏభై ఏళ్ళు వచ్చాయి. ఆమె అందచందాలతో మత్తెక్కిన రసెల్ చెప్పులు లేకుండా వెన్నెల రాత్రుళ్ళు తుషార బిందువులతో తడిసిన పచ్చిక మీద ఆమెతో పరుగులు తీశాడు.

శారీరకంగా అతడేమంత అందమైన వాడు కాదు. అతడి నవ్వు వడ్రంగి పిట్ట చెట్టు కొడుతున్నప్పుడు వచ్చే శబ్దంలా ఉంటుందని అతని శిష్యుడు టి. ఎస్. ఇలియట్ చెప్పాడు. జార్జి శాంతాయన దృష్టిలో అది హైనా అరుపులా ఉంటుంది. బియాట్రిస్ వెబ్, తన డైరీలో అతడికి ముసలితనం ముందుగా వచ్చిందనీ, వట్టి సినికల్‌గా తయారయ్యాడనీ వ్రాసుకొంది. మరి అలాంటి వాడి గాలిలో ఎగిరే జుట్టు, కొనతేలిన పెద్ద నాసిక, బుల్లి గడ్డం అంటే మరి డోరాకు ముద్దు. ఎవరికి ఏది ముద్దో చెప్పడం ఎంత కష్టం.

వారికి జాన్, కేట్ అనే ఇద్దరు పిల్లలు కలిగారు. ఇద్దరి మధ్య లైంగికత మీద తగువులారంభ మయ్యాయి. టాల్‌స్టాయ్ లాగా రసెల్ గూడ 'బహిరంగతా' సిద్ధాంతాన్ని పాటించా లన్నాడు. ''లైంగిక సాహసాల్లో బెర్టీ, నేనూ ఒకరి స్వేచ్ఛకు మరోకరు అడ్డురాకూడ దనుకొన్నాము'' అని డోరా అంది. ఫలితంగా గ్రిఫిన్ బారీ అనే ఒక జర్నలిస్టుతో ఆమె బహిరంగంగా ప్రేమ కలాపం మొదలు పెడితే రసెల్ ఏమీ అనలేదు. పైగా, పద్దెనిమిదవ శతాబ్ది విగ్ మహిళలు వేరు వేరు తండ్రులకు బిడ్డలను గన్న ఫక్కీలో ఆమె నడవ వచ్చు అన్నాడు. ఆ రకంగా ఆమె ఇద్దరు బిడ్డలకు, ఆ జర్నలిస్టువల్ల తల్లిఅయింది. స్వేచ్ఛా ప్రణయాన్ని ఎంతగా ప్రతిపాదించినా తన వరకు వచ్చేసరికి అది ఎంతో కష్టం అనిపించింది. సిద్ధాంతం ప్రకారం తార్కికంగా అవునన్నా అంతరంగం కాదంది. అందుకే అతడు ఆమెతో సరిగా ఉండలేక పోయాడు. ఆ తరవాత చాలా కాలానికి తన ఆత్మకథలో ''నా రెండో భార్యకు ఆ గౌరవం ఇవ్వాలని నా సిద్ధాంతం వాకొన్నా, నేను దానికి సరితూగలేక పోయాను'' అని రాసుకొన్నాడు. డోరా సంతానంతో ఇంటికి రావడంతో రసెల్ తన ప్రేమ పీటర్ స్పెన్స్ పైకి మళ్లిందన్నాడు. పీటర్ స్పెన్స్ ఆక్స్‌ఫర్డ్ విద్యార్థిని. సెలవుల్లో రసెల్ పిల్లలను సాకడానికి నియమితమైంది. డోరా తో విడాకులకై కోర్టులో పడేశాడు. 1935లో విడాకులిచ్చే జడ్జి '' ఆమె విశ్వాసఘాతుకురాలు కాకముందే ఆమె భర్త రెండుసార్లు విశ్వాసఘాతుకానికి పాల్పడినట్లు రుజువైంది'' అని పేర్కొన్నాడు.

తరవాత రసెల్ ఆ విద్యార్థినిని వివాహమాడాడు. 15 సంవత్సరాలు ఈ మిథున దాంపత్యం కొనసాగింది. ''1949లో నానుంచి నా భార్యకు

కావలసింది ఏమీ లేదు - అనే స్థితికి ఆమె రావడంతో, అది మా వివాహానికి భరతవాక్యం పలికింది'' అన్నాడు రసెల్. కాని ఈ మధ్యలో చెదురుమదురుగా ''చిల్లర వ్యవహారాల నిపుణుడయ్యాడు. సిడ్నీ హుక్‌కు ప్రేమ వ్యవహారం. గురించి అడగకనే ఒక సలహా పారవేశాడు. ''హుక్! ఎప్పుడైనా నీవు ఒక హోటల్‌కు అమ్మాయిని తీసుకు వెళ్ళినప్పుడు, రిసెప్షన్ క్లర్క్‌కు అనుమానం రాకుండా ఉండాలంటే, వాడు రూము అద్దెరేట్లను చెప్తున్నప్పుడు, 'అమ్మో అంత అద్దే' అని ఆ అమ్మాయిని అనమను చాలు. అతడికి ఇక అనుమానం రాదు.''

అతడు తన శిష్యుడైన T.S. ఇలియట్ భార్య వివెన్ హెల్టర్‌ను గూడ వదల లేదు. వివెన్‌తో తన సంబంధాలు ప్లేటోనిక్ (కామరహితం) అని ఒటోలిన్‌తో చెప్పి, కాన్‌స్టన్స్‌తో కామ సహితమే నన్నాడు. ఏది ఏమైనా ఇతడి కారణంగా ఆమె పిచ్చిదైంది. ఆచార్య సిడ్నీహుక్ రసెల్ మీద ఒక పదచిత్రణం రాస్తూ ''వయస్సు ముదిరిన రోజుల్లో గూడ రసెల్ తనకెదురైన లంగాలను (లంగా = Skirts) వదలిపెట్టలేదు'' అన్నాడు.

80వ యేట పీటర్ స్పెన్స్‌కు విడాకులిచ్చి ఎడిత్‌ను వివాహ మాడాడు. ఈమె అతనికి ఎంతో కాలంగా తెలుసు. మిగిలిన అతని జీవతమంతా ఆమె తోడునీడై అతడి అవసరాలను తీర్చింది. తన ఆత్మ కథను ఆమెకు అంకితమిస్తూ.

సుదీర్ఘమైన ఎన్నో సంవత్సరాలుగా శాంతిని అన్వేషించాను

పారవశ్యాన్ని కనుగొన్నాను, వ్యథను చూశాను.

ఉన్మాదాన్ని అనుభవించాను

ఏకాంతాన్ని భరించాను

హృదయాన్ని నమిలి మెలిపెట్టే ఏకాంత బాధను ఎరిగాను

కాని శాంతిని నేనెరుగను

ఇప్పుడో, వృద్ధుడనై, కాటికి చేరువవుతున్న ఈ సమయంలో,

నిన్ను నేను ఎరిగాను,

నిన్ను ఎరగడంతో

పారవశ్యాన్ని, శాంతిని '- రెండింటిని కనుగొన్నాను.

విశ్రాంతి తెలిసింది

యిన్ని ఏకాంత సంవత్సరాల అనంతరం జీవితం, ప్రేమ ఏమికావచ్చో తెలుసుకొన్నాను.

ఇప్పుడిక నేను నిదురిస్తే,

కృతార్థుడుగా నిదురిస్తాను.

తన ఆత్మకథలో తన తల్లి శీలాన్ని గురించి తన అనుమానాన్ని వ్రాయటానికి సాహసించాడు.

*(91 మార్చి మిసిమి)*

# లియో టాల్‌స్టాయ్

గొప్పవారు ఎవరూ మరొకరు చెప్పిన దానిని ఎప్పుడూ అంధంగా విశ్వసించరు. తాము స్వంతంగా కనుగొన్న జీవితార్థాన్ని తమ అనుభవ పరంగా వివరిస్తారు. బుద్ధుడు, సోక్రటీజ్, కన్ఫ్యూషియస్, మోజీజ్ మొదలు పాస్కల్ వరకు అందరూ అదే పని చేశారు. టాల్ స్టాయ్ గూడా అదే చేయా లనుకొన్నాడు. అజ్ఞాతంగా అంతరించి పోగూడ దనుకొన్నాడు. అతడి డైరీని పరిశీలిస్తే ఈ విషయం అర్థ మవుతుంది: ''నేను ఒక మహోద్భుతమైన వ్యక్తిని; నా ఆత్మ మహోన్నతం. నన్నెవరు ఎందుకు గుర్తించరు? నేను కుంటి గుడ్డిని కాను. చెడ్డవాణ్ణి అంతకంటె కాను. అయినా నన్నెవరూ ఎందుకు ప్రేమించరో నాకర్థం కాదు.'' (1853 అక్టోబరు 12, నవంబరు 2,3 తేదీలు). పాపం అతడు మనుషులతో ఎంతగానో కలిసి పోవాలని, తాదాత్మ్యం చెందాలని ఆక్రోశించే వాడు. అయినా అతడు జనానికి దూరుడే అయ్యాడు. బాహిరకుడే అయ్యాడు.

అతడొక మహా నవలాకారుడు. బహుశా ప్రపంచంలోనే అంతటి మహా నవలా రచయిత మరొకరు లేరంటే అతిశయోక్తి కాదేమో. టాల్‌స్టాయ్ తానెప్పుడూ ఒక మామూలు మనిషినని భావించ లేదు. తాను దేవుడికి పెద్దన్న ననుకొన్నాడు. మనుషుల మీద తీర్పుచెప్పే న్యాయాధిపతి ననుకొన్నాడు. అందుకే ''తన నవల్లో ఒక పాత్రకు ఒక గుణం ఇవ్వడం, మరో పాత్ర నుంచి తీసివేయడం చేస్తానని'', గోర్కీతో అన్నాడు. తాను దేవుడు ననుకొన్నాడు. దేవుడు తనను ఆవహించాడని తలచాడు. ''హే తండ్రీ, సహాయపడు, నాలో ఉండిపో. నీవు ఇప్పటికే నాలో ఉండి పోయావు. ఈ సరికే నీవు నేనయ్యావు'' (1888 జనవరి 19 డైరీ). దేవుడు టాల్ స్టాయ్‌ని ఆవహించడంలో ఉన్న చిక్కు ఏమిటంటే, గోర్కీ చెప్పినట్లు, అతనికి తన సృష్టికర్తపై సందేహం. ''టాల్‌స్టాయ్, దేవుడూ కలిసి ఉండడమంటే రెండు తోడేళ్ళు ఒకే గుహలో ఉండడం లాంటిది'' అంటాడు గోర్కీ.

ఇలాంటి ఆలోచనలు రావడానికి కారణం అతడు కులీన వంశంలో పుట్టడం, వేల ఎకరాల ఎస్టేటుకు పాలకుడు కావడం, ఆ ఎస్టేటుకు

అంటిపెట్టుకొని ఉన్న వేలకొలది వెట్టి బానిసలపై ఆధిపత్యం. చట్టం ప్రకారం ఆ బానిసలు ఆ భూమిలో భాగమే. భూమి ఎవరికి చెందితే బానిసలు వారికే చెందుతారు.

కులీనత, జమీ, బానిసలు, బిరుదులు అతనిలో గర్వాన్ని పెంచాయి. సాహితీ మిత్రులు అతని గర్వాన్ని చూసి అసహ్యించు కొనేవారు ''కులీనత, బిరుదులు అంటే ఆ అర్థరహితమైన వ్యామోహం ఎందుకో నాకు అర్థం కాదు'' అన్నాడు తుర్గనీవ్, టాల్‌స్టాయ్ గర్వాన్ని చూసి. ''మాకందరికీ అతడంటే అసహ్యం, జుగుప్స'', అన్నాడు నెక్రసావ్. ''నీవు రాజుల కూతుళ్ళ దగ్గరకు వెళ్ళు, మా దగ్గర కెందుకు?'' అన్నాడు కోపంతో ఒకసారి తుర్గనీవ్.

అతడిది ఆధికారిక తత్త్వం. అది అతడికి వారసత్వంగా దిగుమతి అయింది. టాల్‌స్టాయ్‌ని గురించి అతని కొడుకు ఇల్యా ఇలా రాస్తాడు: ''(మా దృష్టిలో) ప్రపంచం రెండుగా విభాజితమైంది. ఒక భాగం మేము; రెండోది మిగతా వారంతా. మేము ప్రత్యేకమైన మనుష్యులం. మిగతా వారు మాకు సములు కారు. ఈ నిరాధారమైన అహంకారానికి, ఆత్మ గౌరవానికి బాధ్యత మా నాన్న మమ్ములను పెంచిన తీరు. దీని నుంచి నేను బయట పడడం కష్టమై పోయింది.'' ముసలితనంలో గూడ టాల్‌స్టాయ్ తన ఆదేశాలను ఎవరైన సరే తక్షణమే పాలించాలని ఆశించే వాడు.

అతడిది వజ్ర సంకల్పం. దానికి తోడు పరిస్థితులు దానిని ఇంకా ఘనీభవింప జేశాయి. చిన్ననాడే తలిదండ్రులు మరణించారు. ఉన్న ముగ్గురన్నలు బలహీనులు. దురదృష్టవంతులు. అతనిని, ఎర్రని ఏగాని లేని అతని ఆంటీ టాత్యానా పెంచింది. పాపం ఆమె, అతనికి ఏమి చెయ్యాలో, ఏమి చేయ్యరాదో నేర్పింది. అయితే ఏం, ఆమెకు అతని మీద అధికారం లేదు. అతడి తొమ్మిదవ యేట నుంచి అతని జీవితం ఒక క్రమపద్ధతిలో నడవ లేదు. స్కూల్లో తాను చదవాలనుకొంది చదివే వాడు. ఏది చెయ్యాలనుకొంటే అది చేసే వాడు. అయితే చేసే పనిని మాత్రం బహు నిష్ఠతో చేసే వాడు. పండ్రెండవ యేట పద్యం రాశాడు. పదహారవ యేట ఓల్గా ఒడ్డున ఉన్న కజక్ విశ్వవిద్యాలయానికి వెళ్ళాడు. కొంత కాలం ప్రాచ్య భాషల అధ్యయనం చేశాడు. తరవాత పందొమ్మిదవ

యేట విశ్వవిద్యాలయాన్ని వదిలి, ఇంటికి వచ్చి, స్వంత చదువు మొదలు పెట్టాడు. రస నిష్యందతుందిలవైన కాల్పనిక సాహిత్యాన్ని ఆకళించు కొన్నాడు. డీ కాక్, డ్యూ్యవూ, యూజిన్స్యులను ఒంట బట్టించు కొన్నాడు. డేకార్ట్, రూసోలను ఔపోశన పట్టాడు. ఒక రకంగా ఇతడు రూసోకు మరణానంతర శిష్యుడయ్యాడు. నూతన నిబంధనల గ్రంథంలోని క్రీస్తు తరవాత, తనను అత్యంతంగా ప్రభావితం చేసిన వాడు రూసోయేనని అతడు చెప్పు కొన్నాడు. అతడికున్నంత అహంకారమూ ఉంది. అతనిలా రచయితగా కుదురు కోబోయే ముందు ఎన్నో - రాజనీతి తంత్రం, లా, విద్యా సంస్కరణలు, వ్యవసాయం, సైనికత్వం, సంగీతం - రంగాలలో ప్రయత్నించాడు.

కొన్నాళ్ళు సైన్యంలో పనిచేశాడు టాల్‌స్టాయ్. అతనికి ప్రదర్శన అంటే ఇష్టం. నలుగురి కంట పడడానికి, నలుగురి మెప్పుకోసం ఏది చెయ్యడానికైనా వెనకాడడు. అందుకై తన సుఖ సంతోషాలనే కాదు, ప్రాణాలను ఇవ్వడానికైన సంసిద్ధమే. సైనికుడిగా ఉన్న రోజుల్లోని డైరీలో ''పడే కష్టాలకు, చేసే త్యాగాలకు గుర్తింపు లేనప్పుడు అవి దేనికి?'' అని ప్రశ్నించాడు. అది నిరుత్సాహం కలిగించింది.

కాని, అతడు సైనికుడిగా ఉన్న కాలం, అతనిని ఏదో విధంగా నిజంగా హీరోనే చేసింది. ఈ కాలంలోనే అతడు మంచి శక్తిమంతుడైన రచయితగా రూపుదిద్దు కొన్నాడు. అసలతడు జన్మతః రచయితే. చిన్ననాటి నుంచి కూడ అతడు ప్రకృతిని, మనుష్యులను నిశితంగా పరిశీలించే వాడు. ఈ పరిశీలనలో అతనిని కొట్టిన మరో రచయిత ప్రపంచలోనే లేడు. ఎంతగా పుట్టుకతో రచయిత అయినా, తగు సమయం వచ్చే వరకు ఎవరైనా నిరీక్షించ వలసిందే. ఈ సమయం అతనికి సైన్యంలో చేరడానికి వెళుతూ ఉన్నప్పుడు మార్గమధ్యంలో, కాకసస్ పర్వత సానువులను దర్శించి నప్పుడు, వచ్చింది. అతని నిగూఢ రచనా శక్తులు పురివిప్పి నాట్యం చేశాయి. ఆ దృశ్యంలోని 'అతి ప్రాకృతికశోభ', అతడి 'చూపుల ఆకలిని' ఉత్తేజ పరిచింది. అంతేకాదు. అప్పుడే అతనిలో నిద్రాణంగా ఉన్న రచనోత్సుకత, ఆ దేదీప్యమాన అతి ప్రాకృతిక దృశ్యాన్ని పదబంధం చేయాలని ఉవ్విళ్ళూరింది. అతనిలో కొట్ట వచ్చినట్లు కనిపించే మరో లక్షణం ఉంది. అది దేవుని ఘనతకు సంబంధించిన అతని భావన. ఆ మహాదేవుని

ఘనతకు సంబంధించిన భావన, దానితో ఏదో విధంగా ఐక్యమైపోవాలనే వాంఛ - ఈ రెండూ ఆ దృశ్యంతో అతనిలో మోసులెత్తాయి.

వెంటనే అతడు రాతకు పూనుకొన్నాడు. అతడు ''బాల్యం'' రాశాడు. ఆ తరువాత సైనిక జీవితాన్ని ప్రతిబింబిస్తూ ''కథలు'' రాశాడు. స్కెచ్‌లు రాశాడు. వాటిల్లో ముఖ్యమైనవి. "The Raid", "The Cossacks", "The Wood Felling", "Notes of a Billiard Marker", Three Sebastapol sketches", "Boyhood" (Part of youth) "A Landlords's Morning", Christmas Eve" లు. ఇక్కడ గమ్మత్తు ఏమిటంటే, ఒక ప్రక్క సైనికుడుగా పని చేస్తూనే, అతడే చెప్పుకొన్నట్లు, కొజక్ ఆడవాళ్ళ వెంట పడుతూనే, తాగి తందనాలాడుతూనే, తీరిక చిక్కినప్పుడెల్ల ఇవన్నీ రాశాడు. అటువంటి సమయాల్లో రాయడం అంటే మాటలు కాదు. ''రాయాలనే ప్రబల వాంఛ'' ఏదో అతని గంగవెర్రు లెత్తించి ఉంచాలి.

అతనిలో ఈ ''ప్రబల వాంఛ'' వెలుగుతూ ఆరిపోయే దీపంలా పని చేసింది. ఒక్కో మాటు, మంచి ఉల్లాసంతో తన శక్తి ఏమిటో తనకు తెలిసి రాసే వాడు. **1858**లో చెప్పుకొన్నాడు, ''అప్పుడప్పుడు నేను వడికే దారానికి తలా తోక ఉండవు''. మరో మాట **1860**లో ఇలా అన్నాడు. ''గుండె మనకు తెలియకుండానే ఎలా కొట్టు కొంటుందో, నాకు రచనా అంతే.'' అయితే రాయడం అంత తేలిక అనుకో రాదు. అతడు పెట్టుకున్న ప్రమాణాలు ఎంతో ఉన్నతాలు. వాటితో సరితూగడానికి అతడు ''యుద్ధమూ - శాంతీ'' నవలను ఏడు సార్లు తిరగ రాశాడు. ''అన్నా కెరెనీనా''ను అంతకంటె ఎక్కువసార్లు తిరగ రాశాడు. ఈ తిరగరాతలో అతడు అనేక మౌలికమైన మార్పులు చేసే వాడు. ఉదాహరణకు ''అన్నా కెరెనీనా''లో జుగుప్సాకరమైన ఆస్థాన వేశ్యగా ప్రారంభమైన 'అన్నా' చివరి రాతలో మనకు తెలిసిన అత్యంత మాననీయమైన విషాద నాయికగా పరివర్తితమైంది. అతనిలోని ''కళాకారు''ని పిలుపును అతడు విన్నాడు, గుర్తించాడు. అందుకే మానవావిర్భావం తరువాత అతని లాగా రాయ గలిగిన వాడు రాలేదు. అందులో ముఖ్యంగా ప్రకృతిని అంత హృద్యంగా, అత్యంత సత్యతా శోభయమానంగా, పూర్ణంగా వర్ణించిన మరో మానవుడు కాన

★ మొదట ''రెండు పెళ్ళిళ్ళు'' (Two Marriages) అని పేరు పెట్టాడు.

రాడు. ఉదాహరణకు, అతడు ''మంచు తుఫాన్'' (Snow Storm) లో కాకసస్ నుంచి యాస్నయాకు తిరుగు ప్రయాణంలో ప్రకృతిని వర్ణించిన తీరు అనితర సాధ్యం. అది మనలను సమ్మోహితులను చేస్తుంది. ధ్వనులు, అంతర్వాహినులు, చాటువులు ఏమీ లేకుండానే, అతడు ఆ సమ్మోహ మార్మికతను సాధించాడు. దీనిని గురించి ఎడ్వర్డ్ క్రాంక్‌షా ఇలా అంటాడు: ''పరిపూర్ణ స్వచ్ఛత, దర్శనీయతలను ఉపయోగిస్తూ, చిత్రలేఖనంలో వెలుగు చీకట్లను, ఛాయలను రూపొందించు చిత్రకారుని లాంటి వాడు టాల్‌స్టాయ్''. మరొకరు అయన్ను ప్రాక్ రాఫిలైట్ చిత్రకారునితో పోల్చాడు. అతడి రచనలలోని ఆకృతులు, స్వరాలు, శబ్దాలు, అల్లిక, వాసనలు, సంవేదనలు – అన్నీ గూడ స్ఫటిక పారదర్శకతతో ప్రత్యక్ష మవుతాయి.

ఉదాహరణకు బహిర్ముఖుడైన వ్రాన్ స్కీ,

''చాలా. బాగుంది!'' తనలో తాను అనుకొన్నాడు. కాలు మీద కాలు వేసుకొని, ఒక కాలిని చేతిలోకి తీసుకొని, అంతకు ముందురోజు పడడం వలన దెబ్బతిన్న మోకాలి కండర బాధను అనుభవించాడు.... అతని బలమైన కాలి తేలికపాటి నొప్పిని ఆనందించాడు. అన్నాను నిరాశానిస్పృహలకు గురిచేసిన ఆ శీతల ప్రకాశ మాన ఆగస్టు రోజు అతనికెంతో ఆహ్లాదకర మనిపించింది.... గుర్రపు బగ్గీ కిటికీ అద్దంలో నుంచి చూసిన ప్రతిదీ, తానెంత తాజాగా, ఆనందంగా, వీర్యవంతంగా ఉన్నాడో, అంత తాజాగా ఆనందంగా, వీర్యవంతంగా కనిపించింది. అస్తమిస్తున్న సూర్యుని అరుణ కాంతిలో మిల మిల మెరుస్తున్న ఇళ్ళ కప్పులు, ప్రహరీల వంపు సొంపులు, భవంతుల దృష్టి వీక్షణాలు, ఆలుగడ్డల పంట చేలు – అన్నీ సుందరంగా, అప్పుడే కళాకారుని కుంచె తడియారని వార్నిష్ చేసిన సుందర ప్రకృతి దృశ్యంలా ఉన్నాయి.

## మరో వర్ణన

''చందమామ కళ తప్పి, ఆకాశంలో శ్వేత మేఘంలా ఉంది. ఒక తార గూడ కనిపించడం లేదు. అంతకు ముందు వెండిలా మెరిసిన బురద గడ్డి మొక్క బంగారు కాంతుల నీనుతోంది. నిలువనీటి గుంటలన్నీ జేగురు రంగుమ దాల్చాయి. నీలం గడ్డి 'పీత–హరితం'లోకి మారింది... గద్ద లేచి

గడ్డివామి మీద వాలింది, తల అటూ ఇటూ తిప్పుతూ. అనంతృప్తితో చిత్తడి నేల వంక చూస్తూ కాకులు పొలాల మీద ఎగురు తున్నాయి. తాను కప్పుకొన్న కోటును తీసి వేసి లేచి తల దువ్వుకొంటున్న ఒక ముసలివాని కోసం, చెప్పులు లేని కుర్రాడొకడు గుర్రాలను తోలు కొస్తున్నాడు. తుపాకి నుంచి వెలువడిన పొగ, ఆకుపచ్చని గడ్డిమీద తెల్లగా ఉంది.''

ఈ వర్ణనను చూస్తే మనకు ఏమి అనిపిస్తుంది! ప్రకృతి అంటే అతనిలో ఉన్న ఆరాధన, వర్ణనా సామర్థ్యం, ఉత్తేజం బహిర్గతమయ్యాయి. జీవితాంతం ఈ శక్తిని మనం అతనిలో చూస్తాము. 1896 జూలై 19 తేదీన అతడు తన డైరీలో రాసుకొన్నది చూడండి: ''దున్నిన చేలో వంగిన కలుపు మొక్క ఇంకా బ్రతికే ఉంది. నల్లగా దుమ్ము కొట్టుకుపోయి ఉంది. అయినా బ్రతికే ఉంది. మధ్యలో మాత్రం ఎర్రగా ఉంది. అది నన్ను రాయ మంటోంది. జీవితాన్ని అది చివరి కంట నిరూపిస్తున్నది. ఆ మొత్తం పొలం మధ్యలో ఏకాకిగా ఆ మొక్క ఏదో విధంగా 'జీవన సర్జక శక్తి'ని ప్రదర్శిస్తోంది''. నిశిత, శీతల నిరుద్వేగ నేత్రంతో ప్రకృతిని దర్శించి, అతి మేధావంతమైన కలంతో నిర్దిష్ట పదాలలోకి కూర్చి నప్పుడు అతడికి ఎంతో ఆనందం కలిగింది. ఆత్మశాంతి కలిగింది''.

అతడు మహోద్భుతమైన నవలా రచయిత. అన్ని పేజీల ''యుద్ధమూ - శాంతీ'', ''అన్నా కెరెనీనా'' లను రాసినా అతనికి 'పునరుక్తి' దోషాన్ని ఆపాదించ లేము. ''యుద్ధమూ - శాంతీ''లో మొత్తం సమాజం గురించీ, ఒక యుగాన్నే గురించే వ్రాస్తే, 'అన్నా కెరెనీనా'లో ఒక ప్రత్యేక జన సమూహాన్ని గురించి రాశాడు. ఈ రెండు మహోద్భుతమైన నవలలు అతనిని జాతి నేతను చేశాయి. ప్రపంచ ప్రఖ్యాతిని ఆర్జించి పెట్టాయి. డబ్బును బాగా ముట్ట చెప్పాయి. ఏ రచయితకు లభించని నైతిక వైదగ్ధ్యం ఈ నవలలవల్ల ఆయనకు లభించింది.

అతని జీవితంలో మూడు సృజనాత్మక దశలున్నాయి. మొదటిది: 1850ల నాటి తొలి కథల దశ. రెండవది: 1860 ప్రాంతం. యుద్ధమూ - శాంతీ రాయడానికి ఉపయోగించిన ఆరేళ్ళకాలం. మూడవది: 1870ల ప్రాంతం, అన్నా కెరెనీనా రచనా దశ.

రచనే అతడి ముఖ్య వ్యాసంగం గాదు. ఇంతకంటె కొన్ని మంచి పనులు చేయా లనుకొన్నాడు. అవి నైతిక ప్రాముఖ్యం ఉన్న విషయాలు, సమాజ సంస్కరణలకు సంబంధించిన విషయాలు. ఆ రోజుల్లో రచనలు చేయడం కులీనులకు తగిన పని కాదని భావించే వారు. ఎవరో తక్కువ స్థాయి వారు చేయ వలసిన పని అది. టాల్‌స్టాయ్‌లోనూ ఇదే భావన ఉండేది. అసలు తాను ఏదైవజ్ఞుడనో, ప్రవక్తనో అను కొన్నాడు. ఫెట్ అనే కవితో ఒకసారి అతడే అన్నాడు: ''కథలు రాయడమంత బుద్ధిమాలిన పని మరొకటి లేదు. అది అవమానకరమైంది''. ఇక్కడ అవమానం అనే మాటను గమనించాలి. కళాసృష్టి అంటే, రచన అంటే, దేవుడిచ్చిన తెలివి తేటలను దుర్వినియోగం చేయడమే. అందుకే అతడు కాలం మీద పడే కొలది, రచనా వ్యాసంగం వదిలివేసి నైతిక సంస్కరణలు స్వీకరించాడు. కాని ఇక్కడతడు ఆత్మ వంచనకు పాల్పడ్డాడేమో ననిపిస్తుంది. రచయితగా రాణించాడు కాని అతడు రచయిత కాదలచ లేదు. బదులుగా ఏదో నూతన మతాన్ని స్థాపించాలని, ప్రవక్తకావాలని, ప్రపంచాన్ని మార్చాలని కలలు కన్నాడు. కాని దీనికి కావలసిన బౌద్ధిక, నైతిక సామర్థ్యాలు అతనిలో లేవు, ఒక్క సంకల్పం తప్ప. కేవలం సంకల్పంతో ఏమవుతుంది? బహుశా అతడు ఇలా మొగ్గు చూపక పోతే అతని కలం నుంచి ఇంకా ఎన్నో మహా రచనలు జాలువారి ఉండేవి.

అతడు సమాజాన్ని ఎన్నో విధాల సంస్కరించా లనుకొన్నాడు. **1840**లో అతడికి వారసత్వంగా జమీ సంక్రమించి నప్పుడు రైతు సంస్కరణ ప్రవేశపెట్టాడు. బానిస విమోచనను ప్రవేశపెట్టా లనుకొన్నాడు. నూర్పే యంత్రాలను పెట్టి వారి శ్రమ తగ్గించా లనుకొన్నాడు. ఆ తరవాత రైతు సమస్యలకు పూర్తి పరిష్కారం 'విద్య' అనుకొన్నాడు. రూసో మొదలు మేధావులందరూ, నూతన వ్యవస్థను స్థాపించడం ద్వారా శాశ్వత 'మానవ విద్యా' సమస్యను పరిష్కరించవచ్చునుకొన్నారు. అతడే స్వయంగా రైతు బిడ్డలకు చదువు చెప్పడం మొదలెట్టాడు. ఇదీ ఎంతో కాలం సాగ లేదు. బోర్‌కొట్టి జర్మనీ యాత్రకు వెళ్ళాడు.

అతడు నైతికంగా వీరుణ్ణే కావాలనుకోవడానికి కారణాలు వేరే ఉన్నాయి. అతడు చేసిన జులాయి పనులను అతడెప్పుడూ పాపాలుగా భావించ లేదు. దీనికి అతని 'అహం' అడ్డం వచ్చింది. **1849** నాటి నుంచే

అతడికి జూదం పిచ్చి ఉంది. మే 1వ తేదీన అతని సోదరుడు సెర్గీకి వ్రాసిన లేఖలో, "నేను పీటర్స్‌బర్గ్‌కు అనవసరంగా వచ్చాను. పని అంటూ ఏమీ లేదు. డబ్బు జూదంలో పోగొట్టు కొన్నాను. అప్పుల పాలయ్యాను. నా ఎస్టేట్ కొంత అమ్మి డబ్బు పంపించు." ఆ తరువాత పదేళ్ళపాటు మధ్య మధ్య జూదం ఆడుతూనే ఉన్నాడు. విపరీతంగా పోగొట్టు కొంటూనే ఉన్నాడు. ఆస్తులు కరిగి పోయాయి. స్నేహితుల దగ్గర, బంధువుల దగ్గర అప్పులు చేశాడు. సైనికుడుగా ఉండగా ఆడాడు. ఆ తరువాత యూరోపు పర్యటనలో ఆడాడు. 1857లో అతడు రాసుకొన్నాడు: రూలైట్ (Roulettee) (తిరిగే చక్రం మీద ఉన్న అంకెలపై పందెం కాసే జూదం) ఆరు గంటల దాకా ఆడాను. అంతా పోయింది. ఒక ఫ్రెంచివాని వద్ద 200 రూబుళ్ళు అప్పు చేశాను. అవీ పోయాయి. తుర్గనీవ్ దగ్గర అప్పు చేశాను. అవీ పోయాయి. ఆ తరవాత దీనిని గురించి అతని భార్య ఇలా రాసింది: "జూదం మంచిది కాదని, అలా ఆడినందుకు చాల బాధపడ్డాడు. కాని, ఆ కాలంలో చేసిన అప్పులను తీర్చలేని అశక్తతకు అతడు పరితాపం చెంద లేదు. అప్పుపెట్టిన వాళ్ళల్లో పేదవాళ్ళు గూడ ఉన్నారు."

అతడి జూద వ్యసనాన్ని మించింది స్త్రీ వ్యసనం. 1853 మే 4వ తేదీ డైరీలో ఇలా ఉంది: "ఏదో ఒక ఆడది కావాలి. అది లేకపోతే నాకు క్షణం శాంతి ఉండదు". "కామేచ్ఛ శారీరక రుగ్మతగా తయారయ్యేట్టుగా ఉంది" (6 జూన్ 1856). ఆయన జీవిత కథ రాసిన ఐల్మర్ మాడ్ (Aylmer Maude) తో, "నాకు 81 ఏళ్ళు వచ్చే వరకు కామాన్ని వదలలేక పోయాను" అన్నాడు. "గనోరియా మామూలుగా ఎక్కడ నుంచి సంక్రమిస్తుందో, అక్కడి నుంచే నాకు వచ్చింది. దానికి చికిత్స చేయించుకొన్నాను", అని 1847 మార్చి డైరీలో రాసుకొన్నాడు. 1852లో సోదరుడు నికోలాయ్‌కు ఉత్తరం రాస్తూ, "సుఖవ్యాధి నయమైంది. కాని రసం మందుల అనంతర ప్రభావాలు నా దుంప తెంచాయి" అని పేర్కొన్నాడు. వేశ్యలు, జిప్సీలు, కోజక్‌లు, పల్లెపడుచులు, రైతు పడుచులు - ఎవరినీ వదల లేదు.

అయితే తాను మాత్రం ఏరోజు కారోజు, "ఇలాంటి పని మరొకసారి చేయరాదు", అని అనుకొనేవాడు. అసలు అటువంటి ప్రలోభాలకు మూలం

ఆడవాళ్ళే అని భావించాడు. ''ఆడది పాపహేతువు'' అన్నాడు. వాళ్ళకు వీలైనంత దూరంగా ఉండా లనుకొనేవాడు. అయినా అది కుదర లేదు.

టాల్‌స్టాయ్ తన ఎస్టేట్‌కు వెళ్లినప్పుడు బానిస పడుచులను చేర దీసేవాడు. యాస్నా పోలియానాకు రాసిన ఉత్తరంలో ''దునియాషా అందం, యౌవనం మరవరానివి... బలిష్ఠమైన ఆమె స్త్రీ శరీరం... మరువలేను,'' అని పేర్కొన్నాడు. **1856**లో యూరోపు పర్యటనకు వెళ్ళిన కారణం ఒక బానిస పడుచు మరుల నుంచి బయట పడడానికే. తిరిగి వచ్చాక మళ్ళీ మొదలే. ఈ సారి యాక్సిన్యా అనే వివాహిత మరులలో కూరుకు పోయాడు. **1858** మే డైరీలో ''ఈరోజు ఆ పెద్ద అడవిలో. నాకు బుద్ధి లేదు. నేను వట్టి వెధవని.. ఇత్తడిలాంటి ఆమె ముఖం, కళ్ళు.... ఇంతకు ముందు ఎన్నడూ లేనంతగా ఆమె ప్రేమలో పడ్డాను. మరో ఆలోచన లేదు. పరిశుభ్రంగా ఉంటుంది. అందహీన కాదు. గాఢమైన గొంతుక. ఏదో కొత్తదనం వాసన. ఎదపై ఆచ్ఛాదనాన్ని పైకి తంతున్న బలమైన గుండ్రని స్తనాలు''. ఈమె **1859**లో, బహుశ, టిమొఫెయి బజికిన్ (Timofei Bozykin) అనే మగబిడ్డను కన్నది. రైతు బిడ్డలను చదివించాలని సంకల్పం ఉన్నా అతడు ఆబిడ్డను చదివించ లేదు, సరిగదా, అతడి పితృత్వాన్ని అంగీకరించలేదు. మార్క్స్, ఇబ్సెన్‌లూ ఇదే చేశారు. ఒక్క తుర్గనీవ్ మాత్రం తన అక్రమ సంతానానికి తండ్రినని ధైర్యంగా చెప్పు కొన్నాడు. టాల్‌స్టాయ్ ఆ కుర్రవాణ్ణి పశుశాలలో పని చేయనీయడానికి మాత్రం అంగీకరించాడు. ఆ పిల్లవాడేదో తప్పుచేస్తే అతడిని 'అడవి పనికి' పంపాడు. **1900** సంవత్సరంలో టాల్‌స్టాయ్ కొడుకు అలెక్సీ, అతనితో స్నేహం చేసి తన బండి తోలేవానిగా పెట్టు కొన్నాడు. ఇక ఆ తరువాత అతని గురించిన సమాచారం ఏమీ లేదు.

టాల్‌స్టాయ్‌కు స్త్రీ అంటేనే మొదటి నుంచి సదభిప్రాయం లేదు. ''మగవాని లోలుపత, కాముకత, ప్రలోభాలకు స్త్రీయే మూలం'' అనే ప్రాచ్య నానుడిని దాటి టాల్‌స్టాయ్ ఎదగలేక పోయాడు. దీనికి భిన్నంగా అన్నా కెరెనీనాను భావన చేసేటప్పుడు గూడ స్త్రీ మనస్సులోకి లోతుగా తొంగి చూడ లేదు. 'స్త్రీ'ని పరిణతి చెందిన మానవిగా' అతడు అంగీకరించ లేదు. **1898**లో అతడి **70**వ యేట ఇలా రాస్తాడు:

''మామూలుగా స్త్రీ బుద్ధిమాలింది. సైతాన్ కోసం ఆమె పని చేసేట ప్పుడు సైతాన్ ఆమెకు తన బుద్ధిని ఇస్తుంది. ఆమె అప్పుడప్పుడు దూరదృష్టిని, అద్భుతమైన ఆలోచనను, స్థిరతను ప్రదర్శిస్తుంది. ఎందుకో తెలుసా? ఏదో వెధవ పనిచెయ్యడానికే''. స్త్రీ స్వేచ్ఛమీద మిల్ వెలిబుచ్చిన అభిప్రాయాలతో ఇతడు ఏకీభవించ లేదు. వేశ్యావృత్తి మాత్రమే ఆడదానికి గౌరవాన్నిచ్చేది, తగినదిగా పరిగణించాడు.

''కొంతమంది స్వేచ్ఛావాదులు అంటున్నట్లు, స్వైర లైంగిక రతిని అనుమతించాలా? అసంభవం! ఇక కుటుంబ జీవితం నాశనమే. ఈ సమస్యను అధిగమించడానికే చట్టం బంగారు బాట వేసింది. అదే వేశ్య. లండన్‌లో ఉన్న 70,000 వేశ్యలను లేకుండా ఆ మహానగరాన్ని ఊహించండి! గౌరవం, నీతిగతి ఏమవుతుంది? కుటుంబ జీవితం ఎలా మనుగడ సాగిస్తుంది? ఎంతమంది పడతులు కన్యలుగా ఉండగలరు? కుటుంబం మనుగడకు వేశ్యావృత్తి అవసరమని నా గాఢ విశ్వాసం'' అని స్ట్రాకోవ్‌కు రాసిన ఉత్తరంలో పేర్కొన్నాడు టాల్‌స్టాయ్.

అలాగని అతనికి కుటుంబానికి మూలస్తంభమైన 'వివాహం' అంటే గౌరవం ఉందా అంటే అదీ లేదు. క్రైస్తవ వివాహం మీద అసలే విశ్వాసం లేదు. మొదట, అతడి ఇరవయ్యోయేట, వలేర్యా ఆర్సెనెవ్ అనే అనాథను పెళ్ళి చేసుకొందా మనుకొన్నాడు. ఆమెను ప్రేమించాడు. ఆమె అదృష్టం బాగుంది. ఆ వివాహం జరుగ లేదు. ఆయన డైరీలు చూస్తే తెలుస్తుంది. ''పాపం ఆమెకు ఎముక లేదు, వేడి లేదు, వట్టి ముద్ద. కాని ఆమె నవ్వు లొంగుబాటును సూచిస్తుంది.'' తరవాత ఆమెకు రాసిన ఉత్తరంలో, ''మన మధ్య చాలా అంతరం ఉంది. ప్రేమ, పెళ్ళి మనకు దుఃఖాన్ని తప్ప ఏమి ఇచ్చి ఉండేవి కావు'', అని పేర్కొన్నాడు.

అతడి 34వ యేట, అతడి చూపు ఒక 18 ఏళ్ళ డాక్టరు కూతురుపై పడింది. ఆమె పేరు సోన్యాబెర్స్. ఈ పెళ్ళి జీవితాంతం సాగుతుందని అతడు ఊహించ లేదు. కాని మొత్తానికి కొనకంట సాగింది. పెళ్ళికి అతడు గంట ఆలస్యంగా వచ్చాడు. ఆమె కంట తడి పెట్టింది. పెళ్ళైన తర్వాత ఆరుగుర్రాల బండిమీద మధుమాస యాత్రకు బయలుదేరారు. అప్పుడు ఏడ్చింది. ''మీ అమ్మా నాన్నలను వదిలి రాలేనిదానవు నన్నేం ప్రేమిస్తావు?''

అన్నాడు. బండిలో కూర్చున్న తరువాత ఆమె తొడ గిల్లడం ప్రారంభించాడు. ఆమె ఏడ్చింది. హోటల్లో ఆమె అతనికి టీ సర్వ్ చేస్తున్నప్పుడు, ఆమెను గిల్లాడు. మళ్ళీ ఆమె ఏడ్చింది. చివరకు ఆమెతో పడుకొన్న తరవాత ''నమ్మశక్యం గాని సుఖాన్ని ఇచ్చింది. ఈ సుఖం జీవితాంతం కొనసాగు తుందనుకోను'' అన్నాడు. అలాగే అలాంటి సుఖం తరవాత కరవైంది.

కొంతమంది మేధావులు భార్యాభర్తల మధ్య రహస్యాలుండ గూడదంటారు. టాల్‌స్టాయ్ గూడ ఈ కోవకు చెందిన వాడే. అందుకే తన డైరీల నన్నింటిని ఆమె పరం చేశాడు. ఆమె డైరీలు తాను చూడాలన్నాడు. టాల్‌స్టాయ్ చేసిన పెద్ద పొరపాటు పని ఇదే. అతని డైరీలలో ఆమె ఏమి చూసింది? అతని విశృంఖల లైంగిక జీవితం, పిచ్చి తిరుగుళ్ళు, వేశ్యల వేట, జూదం, జిప్సీలతో, బానిస పడుచులతో సాగించిన సంభోగ వర్ణనలు. అప్పుడన్నది ఆమె ''నా కెందుకిస్తారు. ఆ భయానకమైన మీ డైరీలు తీసుకుపొండి''.

ఇరవై రెండేళ్ళ కాలంలో ఆమె పన్నెండుసార్లు గర్భం దాల్చింది. కొన్ని గర్భస్రావాలు, కొన్నిసార్లు బిడ్డలు పుట్టి మరణించారు. గర్భాధారణలతో విసిగిన ఆమె లైంగిక జీవితాన్ని నిరాకరిస్తే, '' ఆరోగ్యవంతుడైన భర్తకు, అనారోగ్యమైన భార్య ఉంటే, అతడి జీవితం దుర్భరమే'' అన్నాడు టాల్‌స్టాయ్. పెళ్లైన మొదటి నుంచీ టాల్‌స్టాయ్ ఆమెను ప్రేమించడం మాని వేశాడు. కాని గత ప్రేమావశేషం మాత్రమే ఆమెలోనూ మిగిలి ఉంది. ఆమె డైరీలో రాసుకొంది: ''అతడి ప్రేమ, అనుకంప తప్ప నాకింకేమీ అక్కరలేదు. కాని అదే అతడు నాకివ్వడం లేదు. ఎవ్వరికీ అక్కరలేని, ఎవరూ ప్రేమించని, వేవిళ్ళతో, పెద్ద బాన కడుపుతో, బురదలో తొక్కబడ్డ నిరుపయోగకరమైన పురుగుని'' ఇటువంటి వివాహం కొనసాగడం కష్టమే అయినా, ఇక ఆమె ప్రేమ జీవితం గురించి ఆలోచించకుండా, గృహ నిర్వహణలో మునిగి పోయింది. అతడి చిత్తు రాత ప్రతులను సాపురాసేది.

వివాహం అతని దృష్టిలో దుఃఖహేతువు. వివాహ వ్యవస్థ, దాంపత్య ప్రేమ శుద్ధ అబద్ధం.

''వివాహంలో ఒక దుర్మార్గుడికి ఎలా విముక్తి దొరుకుతుందో నేను అర్థం చేసు కోగలను. కాని ఒక శుద్ధమైన అమ్మాయి ఆ వివాహబంధంలో ఎందుకు ఇరుక్కోవాలో నాకు అర్థం కాని విషయం. నేనే ఆడపిల్లనైతే ఈ ప్రపంచంలో ఏమిచ్చినా పెళ్ళి మాత్రం చేసుకోను. ఇక ప్రేమ విషయానికి వస్తే, ఆడకు గాని, మగకు గాని - అదంటే ఏమిటో నాకు బాగాతెలుసు - అందహీన, రసహీనమైన ఒక అనుభూతి భావం - దానికి నా హృదయ కవాటాలు మూసి వేసి ఉండేవాణ్ణి. ఆ ప్రేమ అంటువ్యాధి నాకు సోకకుండా వీలైనన్ని జాగ్రత్తలు తీసుకొని ఉండేవాణ్ణి'' అని **1877**లో తన కూతురు తాన్యాకు చెప్పాడు.

ఇకపోతే టాల్‌స్టాయ్ స్వార్థాన్ని, క్రౌర్యాన్ని బాగా చవిచూసిన వాడు తుర్గనీవ్. రచనా వ్యాసంగంలో సీనియర్ అయిన తుర్గనీవ్ టాల్‌స్టాయ్‌కు ఎంతో సహాయం చేశాడు. తుర్గనీవ్ పెద్దమనిషి. సహృదయుడు. టాల్‌స్టాయ్‌తో తాను విసిగి పోయానన్నాడు. తుర్గనీవ్ అంతటి వాడు తన నవల ''తండ్రులూ - కొడుకులూ''ను చూడమని టాల్‌స్టాయ్‌కిస్తే అతడు దానిని ప్రక్కన పడేసి ఎంచక్కా నిద్రపోయాడు. తుర్గనీవ్‌ను గురించి టాల్‌స్టాయ్ తన డైరీలో ఎన్నో అప్రియాలను రాశాడు. అసత్యాలు రాశాడు. తుర్గనీవ్ మరణ శయ్య మీది నుంచి రాశాడు: ''ఈ చీటిమీకు అందితే, గట్టిగా ఒకసారి మిమ్ము, మీ భార్యను, పిల్లలను కౌగిలించుకోనివ్వు, నేనిక రాయలేను. అలసి పోయాను''. ఈ దయనీయ, హృదయ విదారక అభ్యర్థనకు టాల్‌స్టాయ్ ఎలా ప్రతిస్పందించాడు? టాల్‌స్టాయ్ వెళ్ళి చూడలేదు సరికదా, చిన్నచీటి ముక్కైనా పంప లేదు. అతడు అలాగే ఇంకా రెండు నెలలు రోగతల్పంపై జీవచ్ఛవంలా పడే ఉన్నాడు. కాని ఆ తర్వాత తుర్గనీవ్ మరణించి నప్పుడు టాల్‌స్టాయ్ వెలువరించిన సానుభూతి వాక్యాలు చూడండి:

''నేనెప్పుడూ తుర్గనీవ్‌ను గురించే ఆలోచిస్తుంటాను. నేను అతనిని అతిగా ప్రేమిస్తాను. అతనంటే నాకు ఎనలేని సానుభూతి, దయ. అతని రచనలు చదివాను. అతనిలో జీవించాను.''

ఒక నటుడు ప్రజలకు కావలసిందీ, వారాశించిందీ చెప్పాడు అంతే. అతని భార్య సోన్యా అంది: ''వ్యక్తిగత సంబంధాలు, ప్రేమ నెరపడం,

నిజమైన స్నేహం చేయడం ఆయన శక్తికి మించిన పని. బదులుగా అతడు మానవాళిని (వ్యక్తులను విస్మరించి) కౌగిలించు కొన్నాడు. ఎందుకంటే ఈ కౌగిలింతను జనవేదిక మీద జనరంజకంగా, నాటకీయంగా, రసపూరకంగా ప్రదర్శించ వీలవుతుంది''.

క్రమ క్రమంగా సోన్యా-టాల్‌స్టాయ్‌ల మధ్య సంబంధాల్లో మెరమెరలు అధికమయ్యాయి. సంబంధాలు ఎండు వారాయి. 1898లో టాల్‌స్టాయ్ జీవిత కథా రచయిత అయిన ఐల్ మర్‌మాడ్‌తో అన్నాడు: ''మళ్ళీ రాత్రి నేను మగవాణ్ణయినాను''. ఇలా పడకటింటి రహస్యం బయటి ప్రపంచానికి తెలియడం అంతటి దురదృష్టం మరొకటి లేదనుకొంది ఆమె. ఈ కాలంలోనే అతడి డైరీలలో ఆమెపై విమర్శ ఎక్కువైంది. ఆమె 1890లో రాసింది: ''నేను ఆయన డైరీలు సాపు రాయడం ఇప్పుడాయనకు ఇష్టం లేదు. పాత డైరీలు నాశనం చేసి పిల్లల, ప్రజల దృష్టిలో పెద్ద మనిషిగా, కనిపించదలిచాడు.'' అందుకని డైరీలు ఆమెకంట పడనీయకుండ జాగ్రత్తపడ్డాడు. ''మా సంబంధాలు మెరుగు పరుచుకోవచ్చు నేమోనని ఆయన డైరీలను రహస్యంగా చదివాను. కాని అవి నా మనస్తాపం పెంచాయి'' అంది ఆమె. ఆమెకు ఏమి కనపడక పోయేం సరికి, అనుమానంతో వెతికితే అసలు డైరీ కనపడింది. దానిని కాపీచేసి, దానిమీద ఒక కాగితాన్ని అంటించి ఇలా రాసింది. ''బాధా తప్త హృదయంతో విచారణీయమైన నా భర్త డైరీని కాపీ చేశాను. నన్ను గురించి అతడు రాసిందంతా అబద్దం. మా దాంపత్యాన్ని గురించి అతడు రాసిదంతా అబద్ధం, అన్యాయం, దారుణం - దేవుడు క్షమించుగాక! అబద్ధం, వక్రీకృతం, అల్లిక, కల్పన''.

''శరీరాలతో వేరు చేయబడిన ఆత్మల కలయికయే ప్రేమ'' అంటాడు టాల్‌స్టాయ్. అలా అన్న టాల్‌స్టాయ్ అదేరోజు (1910 జూలై 22) దగ్గరలో ఉన్న గ్రామానికి వెళ్ళి రహస్యంగా తన చిన్న కూతురు పేర వీలునామా రాయించాడు. దస్తావేజులు చెర్ట్‌కోవ్ రాయించాడు. అందులో ఏమి రాసిందీ ఆయనకు తెలియదని అన్నాడు బ్యుల్గకోవ్.

సోన్యా అక్టోబరు 27-28 అర్ధరాత్రి అతడి కాగితాలు - వీలునామా కోసం - వెతకడం చూశాడు. అప్పటికప్పుడు అలెగ్జాండ్రాను లేపి

''ఇప్పుడే ఇల్లు వదిలి పోతున్నాను - ఇది మంచికే'' అన్నాడు. ఆ రాత్రికి రాత్రే రైలందుకొన్నాడు. ఈ సంగతి తెల్లవారిన తరవాత సోన్యాకు తెలిసినప్పుడు ఆమె ఒక చెరువులోకి దూకింది. నవంబరు 1వ తేదీ నాటికి న్యూమోనియో అస్మాలతో బాధపడుతున్న టాల్‌స్టాయ్‌ని ఆస్టపోవ్ స్టేషన్ వద్ద రైలు దించారు. 7వ తేదీ ఆయన మరణవార్త వచ్చింది.

ఆయన సాహిత్యాభిమానును కలవరపెట్టేది అతని కుటుంబ నాటకం. అందులో విషాదం, అసూయ, ద్వేషం, పగ, మోసం, హిస్టీరియా, లోభం, వెకిలితనం - అన్నీ ఉన్నాయి.

ప్రజలను - వ్యక్తులను - వదిలిపెట్టి అమూర్త భావాలతో అంబరాలకు వారధి కట్టే మేధావులకు టాల్‌స్టాయ్ జీవితం ఒక ఉదాహరణ. టాల్‌స్టాయ్ తన కుటుంబాన్ని నాశనం చేసుకొన్నాడు. తాను తీసుకురాక తప్పదనుకొన్న నైతిక పరివర్తన తీసుకు రావడానికి తనను తాను చంపు కొన్నాడు. రష్యాలో తానాశించినట్లు నూతన యుగం రావాలని ఆశించాడు. నూతన యుగం వచ్చింది. కాని తానాశించినట్లు కాదు. 1917లో రష్యా అతడూహించని విధంగా పరివర్తితమైంది. సామాజిక పునరుజ్జీవనాన్ని గురించి అతడు రాసిన దానినంతా అది అర్థ రహితం చేసింది.

*(91 మే మిసిమి)*

# రూసో

ఆధునిక మేధావులకు ఆద్యుడు జాన్ జాక్ రూసో (1712-78) అని చెప్పొచ్చు. తరువాతి వారందరికీ ఇతడే ఒరవడి పెట్టాడు. బహుశా మేధావులందరిలోకి సమాజాన్ని ఎక్కువగా ప్రభావితం చేసిన వాడు ఇతడే.

18వ శతాబ్దానికి వచ్చేసరికి మతం, మతాధికారుల ప్రభావం సన్నగిల్లింది. ఒక రకమైన శూన్యంతో నిండిపోయింది ప్రపంచం. ఆ శూన్యాన్ని నింపడం తనొక్కడికే సాధ్యం అనుకొన్నాడు రూసో. శృతు లంటే అతడికి విశ్వాసం లేదు. సనాతన మతం, ఆచారాల నుంచి, అనుభవాల నుంచి, పనికి వచ్చే వాటిని ఏరుకొని ఔదల దాల్చడం, పనికిరాని వాటిని పూర్తిగా పరిహరించడం చేయాలన్నాడు. ''మేము దేవతలకు వ్యాఖ్యానం చెప్పే వారి కోవకు చెందిన వారం కాము. అసలు మేము ఆ దేవతలకు సాక్షాత్తు ప్రతినిధులం'' అని భావించేవాడు రూసో. ''సమాజానికి రోగాలు వస్తాయి. వాటిని నిదానం చేయగలం. మందు మాకు వేసి వాటిని కుదర్చగలం. దానికి తగ్గ సూత్రాలు మా దగ్గర ఉన్నాయి'' అన్నాడు. దేవలోకం నుంచి దొంగతనంగా నిప్పును మానవాళి కోసం తెచ్చి అందించిన ప్రమీథ్యూస్ తమ నాయకుడన్నాడు.

అతడి కంటె పెద్దవాడైన వోల్టేర్ లాంటి దార్శనికులు దైవ పీఠాలను బద్దలు కొట్టి, వివేచనను, హేతువును సింహాసనం ఎక్కిస్తుంటే, రూసో ఆధునిక యుగ ముఖ్య లక్షణాలన్నింటిని కౌగిలించు కొన్నాడు. ఆనాడు సమాజంలో ఉన్న యథాతథ స్థితిని పూర్తిగా కూలదోసే హక్కు తనకుందన్నాడు. అట్టడుగు నుంచి సమాజాన్ని తను కనుగొన్న సూత్రాల కనుగుణంగా పునర్నిర్మించే అతడి శక్తిపై అతడికి పూర్తి విశ్వాసం ఉంది. దీని నంతా రాజకీయ ప్రక్రియ ద్వారా సాధించ వచ్చు ననుకొన్నాడు. మానవుని ప్రవర్తనను నిర్దేశించేది, నియంత్రించేది కేవలం తార్కిక బుద్ధి (వివేచన = Reason) మాత్రమే కాదు. సహజాతం (instinct), అంతర్బుద్ధి (Intuition), ప్రచోదనం (impulse) ల పాత్ర ఎంతో ఉందని గుర్తించాడు. ఇది చాలా ముఖ్యమైన విషయం.

ఇతడు ఫ్రెంచి విప్లవానికి (1789) పదేళ్ళు ముందే గతించినా, ఆ

విప్లవానికి స్ఫూర్తి ఇతడిదేనని, ఇతని సమకాలీనులు ఇతనినే విప్లవానికి బాధ్యుణ్ణి చేశారు. ఐరోపా అంతటా పాత తరహా రాజ్యాలు కూలి పోవడానికి అతడే మూలం.

సమకాలీనుల మీద అతడి ప్రభావం ఎంతగా పడిందంటే, రూసో భావ సంపదకు ''నేను దగ్గరంటే, నేను దగ్గర''ని వారంతా పోట్లాడుకొనే వారు. సమకాలీనుల మీద, తరువాతి తరాల మీద, అతడి ప్రభావం విపరీతంగా పడింది. దీనిని మనం ఐదు భావనల సాయంతో పరిశీలించ వచ్చు.

మొదటిగ, విద్యాపరంగా అతడి ప్రభావాన్ని చూసినట్లయితే, దాని సంగతి అతడు రాసిన ఎమీల్ (Emile) గ్రంథం చెబుతుంది. దీనిలో అతడు, ప్రకృతి అంటే ఆధునిక మానవుని కున్న భావాలపై ధ్వజమెత్తాడు. ప్రకృతి ఆరాధనకు అతడు శ్రీకారం చుట్టాడు. నాగరికతలోని కృత్రిమత్వాన్ని, అభాసను ఉతికి ఆర వేశాడు. ఆరుబయటి గాలిమీద అభిరుచికి, తాజాతనం, సహజత్వాలను అయత్న కృత్యాలను (Spontaneity) కోరడానికి ఇతడే చాలావరకు కారణం. చన్నీటి స్నానాలు, క్రమబద్ధ వ్యాయామం, ఆటలు శీలాన్ని పెంచుతాయి. వారాంతాల్లో ఊరు బయటి కుటీరాలకు తరలి వెళ్ళడం లాంటి భావనలకు అతడే పితామహుడు.

రెండవది హేతువుకు అంటే తార్కిక బుద్ధికి పరిమితు లున్నాయన్నాడు. అంటే దీని అర్థం మనస్సు వెనుక, మనం ఇంకా వాడుకోని కావ్య అంతర్దృష్టి (Poetic insight), అంతర్బుద్ధులు (intuition) న్నాయి. ఇవి తార్కిక బుద్ధిని (హేతుత్వాన్ని) అదుపుచేస్తాయి. ఈ విషయాన్ని అతడు తన Confessions లో ప్రతిపాదించాడు. ఇహ మూడవ భావన. ఇదే ఆధునిక కాల్పనిక ఉద్యమానికి, అంతఃపరీక్షణ సాహిత్యానికి అంటే స్వీయ విశ్లేషణ సాహిత్యానికి దారితీసింది. దీనిద్వారా ఒకడు 'వ్యక్తి'ని దర్శిస్తాడు. పునర్వికాస ఉద్యమం సాధించింది ఇదే. దీనిద్వారా అంతరంగంలోకి చొచ్చుకు పోయి ప్రతి ఒక్కడు అక్కడి తన స్థితి గతులను దర్శించవచ్చు. సాహిత్యంలో మొదటి సారిగా హృదయం లోపలి ప్రక్కను బయటకు తిరగవేసి చూపడం జరిగింది – ఇదే ఆధునిక సాహిత్య ముఖ్యశీల లక్షణం.

ఇహ రూసో ప్రాచుర్యంలోకి తెచ్చిన నాలుగవ భావన మిగతా అన్నింటిని తలదన్నింది. అదేమంటే: సమాజం తన ఆదిమ సమాజ స్థితి

నుంచి ఆధునిక నాగరికతా భాసకు పరిణామం చెందడంలో మానవుడు చెడిపోయాడు, కలుషితు డయ్యాడు. మానవుడు తన సహజ స్వార్థస్థితి నుంచి అహంకారాన్ని ఆత్మసమ్మానాన్ని ప్రదర్శించే వాడుగా మారి పోయాడు. ఆత్మ సమ్మానం అంటే, ఇతరుల దృష్టిలో తానేమిటో అంచనా వేసుకొని, ఇతరులు తనను గురించి ఏమనుకొంటున్నారో అనే దాని ఆధారంగా, ధనం, అధికారం, బలం, తెలివి తేటలు, నైతికాధిక్యతలతో ఇతరుల మీద తన ప్రతిమను ముద్రించడం. ఈ విధంగా అతడి సహజ సామర్థ్యం అహమహమికగా, ఆర్జనాత్మకంగా మారుతుంది. దీనితో అతడు తాను ప్రత్యర్థులుగా చూసే ఇతరుల నుంచే కాక, తనకు తానే దూరు డవుతాడు, బాహిరకు డవుతాడు. ఇటువంటి బాహిరత (Alienation) మనిషికి మానసిక వ్యాధిని కలిగిస్తుంది. ఈ వ్యాధి లక్షణం – పైకి కనిపించడం ఒకటి, లోపలి వాస్తవం మరొకటి.

అతడి ఐదవ భావన పెట్టుబడిదారీ విధాన విమర్శలో ఉంది. ఇందులో అతడు " ఆస్తి – దానిని ఆర్జించడంలో పోటీ" బాహిరకతకు ప్రథమ కారణంగా చెప్పాడు. ఈ భావననే ఆ తరువాత మార్క్స్ ఇతరులు కొల్ల గొట్టారు.

అతడి దృష్టిలో "సహజమైంది" అంటే మౌలికమైంది. సంస్కరింపబడక ముందరిది. సంస్కృతి ఏర్పడక ముందరిది. సంస్కృతి సమస్యలను తెచ్చి పెడుతుంది. ఎందుకంటే అది మనిషికి మనిషికి మధ్య ఏర్పడే సంబంధాలు. ఈ సంబంధాలు అతనిలోని దుష్ట ప్రవృత్తిని లేవదీస్తాయి. అతడు ఎమీల్‌లో అంటాడు: ఒక మనిషి ఉచ్ఛ్వాస నిశ్వాసలే రెండో వాడికి ప్రాణఘాతకం .... ఈ విధంగా మానవుడు నిరసించే సంస్కృతి పరిణామి, కాల్పనికం, మానవ ప్రవర్తన నియంత్రిణి. సంస్కృతిని నీవు మార్చడం ద్వారా – సంస్కృతిని పుట్టించిన పోటీ శక్తులను అంటే సామాజిక ఇంజనీరింగ్‌ను మార్చడం ద్వారా – మానవ సంబంధాలను అభివృద్ధి పరచవచ్చు. పూర్తిగా మార్చి వేయవచ్చు.

ఈ ఐదు భావనలు ఆధునిక చింతన యొుక్క ఆకృతిని తీర్చిదిద్దాయంటే అతిశయోక్తి కాదు. దీనికి కారణం అతడు విస్తృతంగా చదివాడు. డేకార్ట్‌ని, రబెలియాని, పాస్కల్‌ని, లైబెనిట్స్‌ని, బెల్‌ని, కార్నెలీని,

లాక్‌ని, మాంటేగ్‌ని పోషణ పట్టాడు. ప్రపంచంలో ఎప్పుడూ ఏ మానవుడికీ లేని మానసిక శక్తులు అతడికి దత్తమయ్యాయని అంటూ, ''అతడు నూతనంగా దేనినీ కనిపెట్టకపోయినా ప్రతి దానికీ వేడినీ వాడినీ జోడించాడని'' జర్మేన్ డి స్టేల్ అంది.

1712 లో జాన్ జాక్ రూసో జెనీవాలో ఐజాక్ సిజానె బార్నెర్డ్‌లకు జన్మించాడు. తల్లి ధనిక కుటుంబం నుంచి వచ్చింది. అతడు పుట్టిన కొద్ది కాలానికే ఆమె గతించింది. తండ్రి గడియారాలు తయారు చేసేవాడు. రూసో కుటుంబం పాలకవర్గానికి చెందింది కాకపోయినా, వీరికి వోటు వేసే హక్కు మాత్రం ఉంది. వీరికి కొన్ని ప్రత్యేక హక్కులున్నాయి. ఈ కుటుంబం నేపథ్యాన్ని పురస్కరించుకొని అతడు ఒక రకం మితవాదిగా తయారై వోటులేని మూకను అసహ్యించు కొనేవాడు.

రూసోకు అక్క చెల్లెళ్ళు లేరు కాని, ఒక అన్న మాత్రం ఉన్నాడు. అతనికి తల్లి పోలికలు వచ్చాయి. తల్లి చనిపోవడంతో తండ్రి, తల్లిని పోలిన అతనిని, అతి గారాబం చేశాడు. లేదా అతిగా దండించాడు. పిల్లవానిలో తండ్రి, భార్యను చూశాడు. తండ్రి తనను పెంచిన ఈ తీరు గురించే '' ఎమీల్''లో రూసో రాస్తాడు: ''అత్యాశ, నియంతృత్వాలతో గూడిన ముందు చూపులేని తండ్రి పెంపకం కంటే ఆలోచన లేకుండా పెంచే తల్లుల స్నిగ్ధత్వం వందరెట్లు మెరుగు'' పాపం! ఇతడికంటే ఇతడి అన్న, తండ్రి క్రౌర్యాన్ని ఎక్కువగా రుచి చూశాడు. 1723లో అన్న ఇంటి నుంచి పారి పోయాడు. మరల తిరిగి రాలేదు. తరవాత తండ్రి, ఆ తరవాత పెంపుడు తల్లి మరణించారు. ఆ తరవాత రూసో గూడ ఇంటినుంచి వెళ్ళిపోయాక మేడమ్ ఫ్రాంకాజ్ - లూయీ డి వారెన్స్ అనే ఫ్రెంచి భద్రమహిళ రక్షణలో పెరగడానికి అతడు కాథలిక్‌గా మార వలసి వచ్చింది. తండ్రి ఏమో అతడిని కాల్వినిస్టుగా పెంచాడు.

రూసో ఆమె దగ్గర 14 సంవత్సరాలు (1728-42) పెరిగాడు. ఈ దశలో అతడు కొంతకాలం పాటు ఆమెకు ప్రియుడుగా కూడా ఉన్నాడు. మధ్య మధ్య ఇతరులతో చెక్కర్లు కొట్టాడు. ముప్పయ్యో ఏటిలో పడేటప్పటికి అతడు పరాలంబన జీవిగా, ముఖ్యంగా ఆడవాళ్ళ మీద ఆధారపడి బ్రతికాడు. కాని ఏమీ ప్రయోజకుడు కాలేక పోయాడు. ఈ

లోపల పదమూడు రకాల ఉద్యోగాలు చేశాడు. 1743లో వెనిస్‌లో ఫ్రాన్స్ రాయబారి కోమ్ట్ డిమాంటేగ్ దగ్గర కార్యదర్శిగా పదకొండు నెలలు చేసిన తరవాత, ఉద్యోగానికి ఉద్వాసం జరిగింది. అరెస్టు కాకుండా తప్పించుకోవడానికి నానా పాట్లు పడి పారి పోవలసి వచ్చింది. ఈ సందర్భంలో మాంటేగ్ అంటాడు: ''నా కార్యదర్శి వట్టి నికృష్టుడు, బడాయి కోరు, ఒక రకం ఉన్మాది, తనెంతో గొప్పవాడి ననుకొనే గర్వి''

1745లో తనకంటె పదేళ్ళు చిన్నదైన థెరెసా లెవాసర్ అనే ఒక చాకలి అమ్మాయిని కలిశాడు. ఆమె అతడికి శాశ్వత ప్రాతిపదికపై ఉంపుడు గత్తెగా ఉండి పోవడానికి అంగీకరించింది. దీనితో చుక్కాని లేని అతని జీవన నౌకకు కొంత వరకు కుదురు లభించింది.

విజ్ఞాన సర్వస్వం సంపాదకుడు, ఫ్రాన్స్ పునర్వికాస యుగ ముఖ్యుడు అయిన డెనిస్ డి డెరాట్ జైలులో ఉన్నాడు. రూసో ఆయనను చూడడానికి వెళ్లి నప్పుడు దారిలో ఒక వార్తాపత్రికలో ఒక 'వ్యాసరచన పోటీ' ప్రకటనను చూశాడు. ''శాస్త్రాల కళల పునర్జన్మ నైతిక విలువల అభివృద్ధికి దోహదం చేసిందా?'' అనే శీర్షిక మీద వ్యాసరచన పోటీని డి జాన్ అకాడమీ నిర్వహిస్తున్న ప్రకటన అది.

ఈ సంఘటన 1750లో జరిగింది. ఇది అతని జీవితంలో పెద్ద మలుపు. ఎందుకంటే అతడు ఆ శీర్షికపై వ్యాసం రాయడం, దానికి ప్రథమ బహుమతిని పొందడం జరిగాయి. అందరూ కళలూ శాస్త్రాలను సమర్థిస్తూ రాస్తారని అతడికి తెలుసు. అందుకని అతడు అందరిలా కాక ప్రకృతి ఔన్నత్యాన్ని సమర్థించాడు. ఆ ప్రకటన చూసి నప్పుడు అతడికి ఏదో ఆవేశం కలిగింది. ''నాలో సత్యం, ధర్మం, స్వేచ్ఛల కోసం ఏదో ఆవేశం ఉవ్వెత్తున లేచి పడింది. నాకు తెలియకుండానే నా కళ్ళవెంట నీళ్లు జాలు వారాయి. చొక్కా తడిసి పోయింది. ఇదంతా నాకు తెలియకుండానే జరిగింది. అక్కడి కక్కడే వ్యాసం రాయాలని తీర్మానించు కొన్నాను''. ఆ వ్యాసంలోని అంశాలే తరువాతి అతని దర్శనానికి ప్రాతిపదిక అయ్యాయి.

వాస్తవానికి ఆ వ్యాసంలో అసలు పస ఏమీ లేదు. ఈనాడది చదవడానికి నడిచేది కాదు. ప్రఖ్యాత విమర్శకుడు జూల్స్ లే మాత్ర్ ఇలా అన్నాడు: '' ఈ సంఘటన రూసోను దేవుణ్ణి చేసింది. మానవాళి బుద్ధిహీనతకు

ఇంతకంటే పరమ నిదర్శనం మరొకటి లేదు''. 1752లో ఆరంభించి, ఆ తరువాత పూర్తయి పదేళ్ళకు వెలుగు చూసిన అతడి 'సామాజిక ఒడంబడిక' సిద్ధాంతాన్ని అతడు జీవించి ఉండగా ఎవరూ చదవ లేదు. ఆరోజుల్లోని 500 గ్రంథాలయాలను పరిశీలిస్తే ఈ గ్రంథం ఒక్కటంటే ఒక్క గ్రంథాలయంలో మాత్రమే ఉంది. రూసోని ఆరాధించడం వేరు. అతడి ''రాజకీయ చింతన'' ప్రభావం వేరు. అతడిని ఆరాధించడం రెండు పుస్తకాల మీద కేంద్రీకృతమైంది. ఒకటి, '' ఇద్దరు ప్రేమికుల ఉత్తరాలు'' అనే అతడి నవల. మొదటి నవలాకారుడైన రిచర్డ్‌సన్ రాసిన ''క్లారిస్'' నవలను ఇతడు అనుకరించాడు. ఈ కథలో ఒక యువతి వెంటపడడం, విమోహితను చేయడం, పశ్చాత్తాపం, దండనలాంటి విషయాలు మంచి రసవంతంగా, కౌశలంతో పాఠకుల – ముఖ్యంగా స్త్రీ పాఠకుల – లోలుపత లాలసలను సంతృప్తం చేసే విధంగా రాశాడు. దీనిని ఆర్చిబిషప్ (పారిస్) ఇలా విమర్శించాడు: ''అది పైకి నీతిని బలపరుస్తున్నట్టే కనిపించినా, వాస్తవానికి విషయవాంఛలను రెచ్చగొడుతుంది.'' ఆర్చిబిషప్ విమర్శతో దాని అమ్మకాలు పెరిగి పోయాయి. దీనికి తోడు రూసో ''ముందు మాట''లో '' ఈ నవలలో ఏ ఒక్క పేజీని చదివిన ఏ అమ్మాయి అయినా పతనమైనట్లే, ఎందుకంటే మంచి ఆడపిల్లలు ప్రేమ కథలు చదవరు'' అని పేర్కొన్నాడు. దీనితో ''మంచి ఆడపిల్ల'' లంతా ఈ నవలను తెగ చదివేశారు. అవసరమైతే దానిలోని నీతి వాక్యాలను ఉటంకించి తమ చర్యను సమర్థించు కొనేవారు.''

రెండవ పుస్తకం ఎమీల్ (Emile) (1762). ఇందులో ''ప్రకృతి, దానికి మానవుడు చేసే ప్రతిస్పందన'' గురించి చెబుతూ, నాటి బుద్ధిజీవులను విమర్శించాడు ముఖ్యంగా నాస్తికులను. కేవలం ప్రకృతి నివేదనలు ఆధారంగా దేవుణ్ణి విశ్వసించే ఆస్తికులను కూడా ఎండగట్టాడు. ''వీరంతా ఛాందసులు. ప్రతిదీ తెలుసన్నట్లు నటిస్తారు. ప్రతి దానిని శంకిస్తారు. వీరంతా విశ్వాసాన్ని తక్కువగా అంచనా వేయడం వల్ల సత్పురుషులను దెబ్బ తీస్తున్నారు. మానవాళి గౌరవించే ప్రతి దానిని వీరు తమ పాదాల క్రింద వేసి తొక్కుతున్నారు. మతం నుంచి బాధాతప్తజనం పొందే సాంత్వనాన్ని వీరు దక్కకుండా చేస్తున్నారు. ధనవంతులను, అధికార మదోన్మత్తులను అదుపుజేసే ఆ ఒక్క శక్తిని వీరు కాదంటున్నారు.''

మరీ ఇటువంటి విమర్శ ఒంటి కొమ్ము కాసినట్లుగా ఉంటుందేమోనని బాగా తెల్సినిన క్రైస్తవ మతంలోని అద్భుతాలను, మహాత్మ్యాలను, అంధ విశ్వాసాలను మరో ప్రక్క దుయ్యబట్టాడు. ఇతడేదో ''ద్వంద్వ క్రీడ'' ఆడుతున్నాడని మతవాదులు వెంటనే పసి గట్టేశారు. వారు అనుకొన్నట్లుగానే కాథలిక్కుగా మారిన అతడు, జెనీవా పౌరసత్వం కోసం కాల్వినిజాన్ని కౌగిలించు కొన్నాడు.

ఎమిల్‌లో కాథలిక్కులకు వ్యతిరేకంగా రాసిన విషయాలకు పారిస్ పార్లమెంటు అభ్యంతరం తెలిపి, ఆ గ్రంథాన్ని న్యాయప్రాసాదానికి ఎదురుగా తగుల బెట్టించింది. అతడి అరెస్టుకు ఆదేశించింది. స్నేహితులు ఈ విషయాన్ని ముందుగా తెలియ జెయ్యడంతో, అతడు పలాయనం చిత్తగించాడు.

రూసో ఆ రోజుల్లో మొత్తం మీద జీవితాన్ని ప్రయోజకత్వం తోనే సాగించాడని చెప్పాలి. అయినా ఎప్పుడూ తన ఆరోగ్యాన్ని గురించి, స్థితిగతుల గురించి ఇతరుల సానుభూతి కోసం అర్రులు సాచినట్లు కనిపిస్తాడు. ప్రకృతి తనను బాధలు పడడానికే మలిచిందని చెప్పు కొన్నాడు. అతడికి పుట్టకతోనే శిశ్నరంధ్రం ఉండవలసిన చోట కాక వేరో చోట ఉంది. దీనితో అతడు మూత్రవ్యాధితో బాధ పడేవాడు. ''ఆడవాళ్ళ మధ్య ఉన్నప్పుడు, వాళ్ళతో మాటలు పూర్తయ్యేదాక ఆగవలసి వచ్చేది.... ఏదైన చెట్టుచాటుకు వెళదామా అంటే అక్కడి ఆడవాళ్ళు నన్ను ఆపి మాట్లాడిస్తుండే వారు... నాకు ఒక పాడు బడ్డగోడగాని, మూలగాని, నా ''పని'' తీరడానికి లభించక బాధపడ్డాను.'' ఇది ఆత్మ దయనీయత (Self Pity) కంటె భిన్నం కాదు.

మరోసారి తన వాదాన్ని బలపరుచు కోవడం కోసం తాను ఎంతో మంచి ఆరోగ్యవంతుణ్నని చెప్పు కొనేవాడు. అతడు ఇంగ్లాండ్‌కు నౌకాయానం చేస్తున్నప్పుడు, అతడితో కలిసి ప్రయాణించిన డేవిడ్ హ్యూమ్, అతడి ఆరోగ్యాన్ని గురించి ఇలా రాశాడు: ''గడ్డకట్టుకుపోయే చలిలో అతడు ఏక బిగిని పది గంటల కాలం పాటు డెక్‌మీద నిలబడ్డాడు. అయినా అతడికి ఏమీ కాలేదు''.

''ఈ ప్రపంచంలో నేను పడ్డన్ని కష్టాలు ఎవరూ పడ లేదు. నేను

కార్చినన్ని కన్నీళ్ళు మరెవ్వరూ కార్చ లేదు.'' అని చెప్పుకొనే అతని ఆత్మ దయనీయత వెనుక అహంకారం గూడా ఉంది. ''నా కష్టాలతో పోలిస్తే నీ కష్టాలెంత! నాలాగే ప్రేమించగల వాడు ఇక పుట్టాల్సిందే. నా లాంటి మంచి స్నేహితుడు మరెవ్వరూ లేరు.... నా కంటె మంచివాణ్ణి, హృదయం కాగలిగిన వాణ్ణి, సున్నితమైన వాణ్ణి చూపండి..... రాబోయే తరాలు నాకు బ్రహ్మరథం పడతాయి... యూరపు అంతటిలో ఏదైనా వివేకవంతమైన ప్రభుత్వం ఉంటే, అది నా పేర విగ్రహాలు వేసి ఉండ వలసింది'' – ఇలా సాగాయి అతని రాతలు. వీటిని చూసి ఎడ్మండ్ బర్క్ ఇలా అన్నాడు: '' ఉన్మాదానికి చేరువైన స్థాయిలో అతడికి గర్వం అనే దుర్గుణం ఉంది''.

అహంకారి, తగువుల మారిఅయిన అతడు అంతమంది స్నేహితులను ఎలా సంపాదించ గలిగాడు? గమ్మత్తు ఏమిటంటే, అతడి వ్యాసం విజయవంతం అయ్యాక, ప్రతి చోట అతడు, ''ప్రకృతి తురుపు ముక్క''ను ఉపయోగించాడు. తన మోటుతనాన్ని, గ్రామ్యాన్ని కప్పిపెట్టు కోవడానికి మారు, దానిని నొక్కి వక్కాణించే వాడు. మేధావులను అనుకరించడం ఫ్యాషన్‌గా ఉన్న రోజుల్లో రూసో ఆ అనుకరణకు వ్యతిరేక పంథాను తొక్కాడు. దానితో అతడు ఫ్యాషన్‌బుల్ సర్కిల్స్‌లో ''తెలివైన ప్రకృతి పశువు'' ''ఎలుగు గొడ్డు'' అని పేర్లు పొందాడు. ఆచారం కన్న అనుభూతిని, సభ్యప్రవర్తన కన్న హృదయ స్పందనను అతడు నొక్కి చెప్పేవాడు: ''నా అనుభూతులను నేను దాచుకోను. అవి నన్ను మర్యాదస్తునిగా ఉండనీయవు. సూత్రప్రాయంగా చెప్పాలంటే సభ్య సంస్కారాదులు లేని వాణ్ణి. మెరటువాణ్ణి.'' ఈ రకమైన దృక్పథం అతడి లక్ష్యానుగుణంగానే ఉంది.

''సత్యం సర్వదా వద'' – తన ధ్యేయమని చెప్పు కొన్నాడు. తన నిజాయితీని నిరూపించు కోవడానికి తన సెక్స్ రహస్యాలన్నీ పూస గుచ్చినట్లు బహిర్గతం చేశాడు. యువకుడుగా ఉన్నప్పుడు టురిన్‌లో చీకట్లు కమ్మిన వీధుల్లో తిరుగుతూ, ఆడవాళ్ళకు ''లాగులేని ముడ్డి''ని ప్రదర్శించాడు. ''అలా చేయడంలో నేను పొందిన ఆనందం అంతా ఇంతా కాదు'' తన స్వపీడన కామాన్ని (Masochism) వర్ణించాడు: ''నా పిరుదుల

మీద మేడమ్ లాం(బ్రసీర్ కొడుతూ ఉంటే ఎంతో హాయి అనిపించేది'' ''యజమానురాలు పాదాల చెంత, ఆమె ఆదేశాల కోసం, క్షమ కోసం పడి ఉండడం తియ్యగా ఉండేది'' (Confessions అనే అతడి గ్రంథం చూడండి) మేడమ్ డివారెన్స్‌ను తోటమాలితో పాటు పంచుకొని తాను అనుభవించానన్నాడు. ఒక చూచుకం (nipple) లేని అమ్మాయితో పండుకోవలసి వచ్చినప్పుడు, తాను ఎలా విఫలమైందీ వర్ణించాడు: ''ఆ అమ్మాయి అంది గదా - 'ఆడవాళ్ళ జోలికి మరెప్పుడు రాకు. పోయి గణితం చదువుకో'. ఇవన్నీ బహిర్గతం చెయ్యడం ద్వారా తాను సత్యసంధుడనని ఋజువు చేసు కొంటున్నా ననుకొన్నాడు. కాని జాగ్రత్తగా అతడి Confessions చదివితే అవి అన్నీ అర్ధసత్యాలనీ, అతడి నిజాయితీ, అతడి కనుకూలమైన నిజాయితీ అని అర్థ మవుతుంది.

ఇంతవరకు అతడి సత్యప్రియత్వం మాటనే చెప్పాము. మరి అతడి నైతిక స్థాయి మాటేమిటి? అతడి పెంపుడు తల్లి, ఉంపుడుకత్తె అయిన మేడమ్ డి వారెన్స్ తోడి అతడి సంబంధాలను పరిశీలించి నట్లయితే ఈ విషయం తెలుస్తుంది: ఆమెతో అతడు చాల నికృష్టంగా వ్యవహరించాడు. అతడు పేదరికంలో ఉన్నప్పుడు అతడిని చేరదీసి, సేదదీర్చి ఆదుకొంది. ఆమె చివరలో కడుదారిద్ర్యాన్ని అనుభవిస్తుంటే తిరిగి అతడేమి చేశాడు? ధనం ఉండి కూడ, ఆమెకు అతి స్వల్పంగా డబ్బు పంపి, ఇంకా ఎక్కువగా పంపితే, ఆమె చుట్టూ ఉన్న దగుల్బాజీలు మేసేస్తారన్నాడు. ఇది మిష మాత్రమే. ఆ తర్వాత ఆమె అనేక సార్లు అతడిని వేడు కొంటే, కనీసం సమాధానం కూడా పంప లేదు. ఆమె, సరిగా తిండి గడవక, 1761లో మరణించింది. ఈ ఇద్దరిని ఎరిగిన కోమ్ట్ డి చార్మేట్, ఆమె చేసిన సహాయానికి అతడు చూపిన కృతఘ్నతకు రూసోను గర్హించాడు.

ఏ రకమైన సాపవాదాలు లేకుండా అతడు స్త్రీని ప్రేమించ గలడా? అతడు చెప్పు కొన్నట్లు అతడు జీవితంలో గాఢంగా ప్రేమించిన ఒకే ఒక స్త్రీ సోఫీ. అతడు నిజంగానే ప్రేమించి ఉండవచ్చు. కాని అతడు ఆమెకు రాసిన ఉత్తరాలను రాయడంలో ఒక జాగ్రత్త తీసుకొన్నా నన్నాడు. ఒకవేళ ఆ ఉత్తరాలు బయట పడడం జరిగితే, నష్టం ఆమెకు కలిగేట్టు రాశా నన్నాడు. అదీ అతడి ప్రేమ.

అతడి జీవితాంతం అంటే ముప్ఫై మూడేళ్ళపాటు అతడినే అంటి పెట్టుకొని ఉన్న థెరిసాపై ప్రేమ లేశం గూడ సారించ లేదు. విషయలంపట సంబంధమైన లైంగిక వాంఛలన్నీ ఆమెతోనే తీర్చు కొన్నాడు. ఆమెతో సంబంధం పూర్తిగా లైంగికం మాత్రమే. ఆమెను ఎప్పుడూ ఒక మనిషిగా ఒక వ్యక్తిగా పరిగణించ లేదు. ''నేను ఆమెకు రాశాను - 'నిన్ను ఎప్పటికీ వదలిపెట్టను. కాని నిన్ను పెళ్ళిచేసుకోను.'' కాని కొంతకాలం తరవాత ఉత్తుత్తి పెళ్ళి కొద్దిమంది స్నేహితుల సముఖంలో చేసు కొన్నాడు.

ఆమెకు సరైన హోదా ఇవ్వక పోయినా, ఆమెను గురించి అతడు రెండు మంచి మాటలు చెప్పాడు: ''ఆమె చాలా మంచిది, సరళ మనస్క. వగల సెగలు లేవు. కోమలి. మంచి సలహాలిచ్చేది''. ఈమెను గురించిన అసలు సంగతి మనకు **1764**లో రూసోను ఐదుసార్లు కలిసిన బాస్వెల్ ద్వారా తెలుస్తుంది. ఆమెతో బాస్వెల్ ఇంగ్లాండ్‌కు కలిసి పయనించ వలసి వచ్చింది. ఆమెకు లంచం పెట్టి, రూసో ఆమెకు రాసిన రెండు ఉత్తరాలను కాజేశాడు. ''నేను ఆయనతో ఇరవైరెండేళ్ళ నుంచి ఉంటున్నాను. నన్ను ఈ దేశానికి రాణిని చేస్తానన్నా ఆయనను వదిలి పెట్టను'' మరోసారి బాస్వెల్ ఆమెతో కలిసి పయనించి నప్పుడు,. ఏ మాత్రం కష్టం లేకుండా తేలికగా అతడికి లొంగి పోయింది. ఈ సంగతి సవివరంగా బాస్వెల్ డైరీలో రాసుకొన్నాడు. ఆ భాగాన్ని తరవాత కత్తిరించి పబ్లిషరు ప్రకటించాడు. కత్తిరించిన ఖాళీని ''నిందావాక్యాలు'' అని పూరించి ప్రకటించారు. కత్తిరించిన వారు పూర్తిగా కత్తిరించ కుండా ఒక వాక్యాన్ని వదిలిపెట్టారు. ''నిన్న ఉదయం ఆమెతో పడుకొన్నాను. ఒకసారి చేశాను. మొత్తం పదమూడు సార్లు'' దీనిని బట్టి ఆమె సరళ మనస్క, తెలివి తక్కువది అని పించదు. రూసో ఆమెను ఎలా ఉపయోగించు కొన్నాడో, ఆమె గూడ అతనిని అలాగే ఉపయోగించు కొంది. ''నీ వొకందుకు పిలిస్తే, నేను ఒకందుకు వచ్చానన్నట్లుంది'' వారి సంబంధం.

థెరెస్సా మొదటి బిడ్డను **1746-47**లో కన్నది. ఆ బిడ్డ ఆడో, మగో తెలియదు. నలుగురిలో తలెత్తుకు తిరగాలంటే ఆ బిడ్డను వదిలెయ్యమన్నాడు. ఆమె అతికష్టం మీద ఒక పెద్ద నిట్టూర్పుతో అంగీకరించింది. మంత్రసాని ఆ బిడ్డను పొత్తిళ్ళలో పెట్టి ఆసుపత్రిలో వదిలి వేసింది.

మొత్తం రూసోకు ఐదుగురు సంతానం. వారి జనన తేదీలను అతడు ఎక్కడా రికార్డు చేయ లేదు. వారి గురించి అతడు పట్టించుకో లేదు.

మొత్తంమీద రూసో తన శీలాన్ని గుప్తంగా ఉంచలేక పోయాడు. తన శీలాన్ని అప్పుడప్పుడు ప్రైవేటు ఉత్తరాల ద్వారా సమర్థించు కోవలసి వచ్చింది. 1764లో తన నాస్తికత్వం మీద రూసో చేసిన దాడిని తిప్పి కొట్టడానికి వోల్టేర్ ఒక ఆకాశరామన్న కరపత్రం వేశాడు. అందులో ''రూసో తన ఐదుగురి సంతానాన్ని గాలికి వదిలేశాడని, అతడు సిఫిలిస్ వ్యాధి పీడితుడని, హంతకుడని'', రాశాడు. ఈ ఆరోపణలకు రూసో సమాధానాలు ఇచ్చాడు. వాటిని ప్రపంచం విశ్వసించింది. అతడు ఇచ్చిన సమాధానాలలో పిల్లలను వదిలి వేయడానికి అతడు చెప్పిన సమర్థన ఇలా ఉంది: ''నేను ఆ రోజుల్లో దుర్మార్గులైన నీతి బాహ్యులైన, దైవభీతి లేని మేధావులతో తిరిగాను. వారు అమాయకమైన నా బుర్రలోకి పిల్లలను అనాథలుగా వదలి వెయ్యాలనే భావాన్ని చొప్పించారు''. అంతేకాదు, పిల్లలు ప్రతి దానికి అడ్డం అన్నాడు. మరొకసారి నేను వారిని పోషించ లేక వదిలి వేశానన్నాడు. అనాథశరణాలయాలకు పిల్లల్ని అప్పగించడం ఎంతో మంచిది అన్నాడు.

ఇవన్నీ చూస్తుంటే మహామహులు మనుష్యుల్లాగే మేధావులూ, ఆహేతుకంగా, అన్యాయంగా, ఛాందసంగా, మూర్ఖంగా ఉండ గలరని అనిపిస్తుంది.

రూసో జీవితంలో నిజంగా ప్రేమించానని చెప్పిన స్త్రీ సోఫీ. ఆమె మాటల్లో అతడేమిటో చూదాం. 1813లో ఆమె బాగా ముసలిది అయిన తర్వాత, ఆమె అతడిని గురించి ఇలా అంది: ''అతడు నన్ను భయపెట్టేటంత వికారంగా ఉండే వాడు. అతడి ప్రేమ అతడిని అందంగా మార్చలేక పోయింది. కాని అతడొక దయనీయమైన వ్యక్తి. నేను అతడిని స్నిగ్ధతతో, దయతో చూచేదానిని. అతడొక ఆసక్తికరమైన పిచ్చోడు''.

*(91 జూలై మిసిమి)*

# ఎర్నెస్ట్ హెమింగ్వే

మేధావులందర్నీ ఒకే తీరులో అర్థం చేసుకోవడానికి వీలు లేదు. ఎందుకంటే మేధావులు గూడ వారి వారి నేపథ్యాలతో ప్రభావితులవుతారు. అందుకని హెమింగ్వేని అమెరికా నేపథ్యంతో చూడాలి.

అమెరికా సాంస్కృతిక నేపథ్యం ఐరోపా సాంస్కృతిక నేపథ్యం కంటె భిన్నమైంది. అమెరికాకు సుదీర్ఘమైన గతం లేదు. అందుకని పూర్వం నుంచి అనువంశికంగా వచ్చిన 'ఆదేశిక సంస్కృతి' గాని, పరిపాలన గాని, మతం గాని లేవు. భారతదేశంలో ఉన్న నిచ్చెన మెట్ల సంస్కృతి వారికి లేదు. భారత సంస్కృతిలోని 'అహేతుకత' వారికి లేదు. వారి సంస్కృతిలో అసమానతలు లేవు. వారిది హేతు నిర్దేశిత సంస్కృతి. వారి రాజ్యాంగం సమత మీద, స్వేచ్ఛమీద, సమాజ న్యాయం మీద ఆధారపడింది. అందరికీ సమానావకాశాలు వారి రాజ్యాంగం కల్పించింది. అందుకని అక్కడ జన్మించిన ఏ మేధావికీ ''ఉన్న స్థితిని'' ఎదిరించి ''నూతన వ్యవస్థ''ను స్థాపించాల్సిన అవసరం లేదు.

అయితే వాషింగటన్ ఇర్వింగ్ లాంటి వాళ్లు ఐరోపా సాంస్కృతిక వలస వాదానికి జ్యోతిపట్టారు. అందుకని ఎవరైనా రాల్ఫ్‌వాల్డో ఎమర్సన్ లాంటి వాళ్ళు ఎదురు తిరిగారంటే, వాళ్ళు ఎదురు తిరిగింది ఇటువంటి సాంస్కృతిక వలస వాదానికే. ఎమర్సన్ అమెరికా ఋషి పుంగవుడయ్యాడు. అతడి పుస్తకాల ద్వారా కాక, అతడి ఉపన్యాసాల ద్వారా ఇతడు ప్రఖ్యాతుడు కావడం, **1829**లో జోషియహోల్ బ్రూక్ విప్పారుతున్న జాతికి విద్యాగంధం అంటించడానికి నడిపిన లైసియమ్ (Lyceum) ఉద్యమం - రెండూ ఒకేమాటు జరిగాయి. వీటికి తోడు వాణిజ్య గ్రంథాలయాలు, చర్చావేదికలు, సంఘాలు వెలిశాయి. వీటి అన్నింటి ముఖ్య ఉద్దేశం జనాభాలో అధిక భాగాన్ని వీథుల్లో తిరగకుండ, సెలూన్‌లలో కూర్చొని శుష్క చర్చలు చేయకుండ నిలవరించడానికే. అందుకే అమెరికా జాతి నీతిని, మానసిక వికాసాన్ని కోరినంత తీవ్రంగానే సంపదను కోరింది. నూతన నాగరికతావిర్భావానికి రెండింటి ఆవశ్యకతను అమెరికా గుర్తించింది.

మనం హెమింగ్వేను ఇటువంటి నేపథ్యంలో అర్థం చేసుకోవాలి. ప్రథమ వీక్షణంలో అతడు మేధావిగా కనిపించక పోయినా, కొంచెం నిశితంగా పరిశీలిస్తే, మేధావి కుండవలసిన లక్షణాలన్నీ అతడిలో అసామాన్య స్థాయిలో కనిపిస్తాయి. అతడు అమెరికా జీవితాన్ని పరివర్తించాడు. అతడొక నూతన, వైయక్తిక, సమకాలీన, నైతిక జీవన శైలిని ఆవిర్భవింప జేశాడు. దీని ఆవిర్భావం పూర్తిగా అమెరికాలోనే జరిగినా, ఇది అనేక సంస్కృతులలోకి అనూదితమైంది. అనేక అమెరికన్ దృక్పథాలను సమ్మేళనం చేసి, అతడు దానికి మూల రూపం అయ్యాడు. వోల్టేరు **1750**లో ఫ్రాన్స్‌కు, బైరన్ **1820**లో ఇంగ్లాండ్‌కు సాంస్కృతీ ప్రతినిధులైనట్లు, ఇతడు అమెరికా సంస్కృతికి ప్రతినిధి అయ్యాడు.

హెమింగ్వే **1899**లో చికాగో సమీపంలో ఓక్‌పార్క్ సాల్యుబ్రియన్‌లో గ్రేస్, ఎడ్మండ్ హెమింగ్వేలకు జన్మించాడు. వాళ్లిద్దరూ గూడ నూతన అమెరికన్ ఆర్థిక నాగరికతకు ప్రతినిధులే. బాగా చదువుకొన్న వారు. శ్రమజీవులు. ప్రతిభా వ్యుత్పత్తులు కలవారు. సమర్థవంతులు. ఐరోపా వారసత్వ సంస్కృతికి ఒక ప్రక్క కృతజ్ఞత చూపిస్తూనే, దానిమీద అమెరికా సాధించిన అభివృద్ధిని చూసి గర్వించేవారు. ఎడ్మండ్ హెమింగ్వే వైద్యుడు. వేట, తుపాకి ఉపయోగించడం, చేపలు పట్టడం, నావికాయానాలు అతడి హాబీలు. గ్రేస్ చాలా తెలివైంది. సంకల్ప బలం ఉన్న మహిళ. బాగా చదువుకొంది. మంచి గద్యం - రాసేది. చిత్రాలు గీసేది. పాడేది. అనేక వాయిద్యాల వాదనంలో ఆమె నిపుణ. పాటలెన్నో రాసి, ప్రకటించింది. మొత్తంమీద వీటన్నింటిని వీరిద్దరూ తమ సంతానానికి అందజేశారు. ఆదర్శవంతమైన తలిదండ్రులు. మతాచారాలను నిశితంగా పాటించేవారు.

అయితే మన హెమింగ్వే తలిదండ్రుల మతాన్ని పరిత్యజించి వారాశించిన బిడ్డ కంటే భిన్నంగా తయారయ్యాడు. తన ప్రవృత్తి, మేధల ననుసరించి, తన దృష్టిలో గౌరవనీయమైన పెద్దమనిషి అంటే ఎలా ఉండాలో, ఏది మంచి జీవితమో అలా తయారవ్వా లనుకొన్నాడు. అతడి ఆలోచనలతో మత వాసన ఎక్కడా లేదు. **17**వ సంవత్సరంలో బిల్, కేటీ (కేటీ తరువాత జాన్ డాన్ పాసస్ భార్య అయింది)లను కలసిన తరువాత అతడు మతానికి పూర్తిగా తిలోదకా లిచ్చాడు. బిల్, కేటీల నాన్న డాన్, ''అసలు క్రీస్తు

ఎప్పుడూ పుట్టలేదు'' అనే ఒక అద్భుత గ్రంథం రాశాడు. దానిని చదివాడు అయితే ఈ సంగతి అతడు తల్లిదగ్గర దాచాడు. ఇరవయ్యోయేట, తన తల్లితో ఒకనాడు, ''నేను మంచి క్రైస్తవుణ్ణి కావాలని ఊరికే నసగకు. నేను ఇదివరకటి మీ కొడుకునే. ప్రతిరోజు పండుకోబోయే ముందు ప్రార్థనలు చేస్తూనే ఉన్నాను'', అన్నాడు. ఇది మాత్రం పచ్చి అబద్ధం. తల్లిని నొప్పించడం ఇష్టం లేక అలా చెప్పాడు. అంతేగాని అతనికి దేవుని మీద నమ్మకమూ లేదు. పైగా ''వ్యవస్థీకృత మతం ఎప్పుడూ అభివృద్ధి నిరోధకమే'', అని అతడి నమ్మకం. అతడి మొదటి భార్య హోడ్లే అంది: ''అతడు మోకాళ్ళపై వంగడం నేను రెండే రెండు సార్లు చూశాను. ఒకటి మా పెళ్ళి సందర్భంలో, రెండు నా కొడుకుని బాప్టైజ్ చేసినప్పుడు.'' రెండవ భార్య పాలిన్‌ను సంతోష పెట్టడానికని రోమన్ కాథలిక్‌గా మారాడు. `A clean well - lighted place,' `Death in the Afternoon' అనే కథలలో, The Fifth Column అనే నాటకంలో, మత వ్యతిరేక భావాలను గుప్పించాడు. రెండవ భార్యను వదిలివేసిన తరవాత కాథలిక్ ననే నటన గూడ మానివేశాడు.

1920లో ఇటాలియన్ ఫ్రంట్‌లో అంబులెన్స్ యూనిట్‌లో పనిచేసి, తిరిగి వచ్చాక అతడికి ఉద్యోగం దొరక లేదు. నిర్వ్యాపారంగా కాలం వెళ్ళబుచ్చడం తలిదండ్రులకు కోపం తెప్పించింది. ఏ పనీ చేయకుండ ఉండడమంటే అమెరికన్ సంస్కృతిలో, అందులో అతడి తలిదండ్రుల దృష్టిలో, మహాపాపం. అప్పుడు గ్రేస్ ఎర్నెస్ట్ హెమింగ్వేను చీవాట్లు వేస్తూ ఉత్తరం రాసింది. ఆ ఉత్తరం చాలా అందంగా రాసింది.

''ప్రతి తల్లి జీవితం ఒక బ్యాంక్. ఈ ప్రపంచంలోకి పుట్టే ప్రతిబిడ్డ ఎంత తీసినా తరగని బ్యాంక్ ఎకౌంట్‌తో ప్రవేశిస్తాడు. ఆ ఎకౌంట్ నుంచి బాల్యమంతా బిడ్డ ఊరికే డ్రా చేస్తూనే ఉంటాడు. యుక్త వయస్సు వచ్చేటప్పటికి కొద్దిపాటి పైసలు, సేవలు మాత్రమే ఆ ఎకౌంట్‌లో మిగులుతాయి. వయోజనుడైన తరవాత గూడ ఆ బ్యాంక్ ప్రేమ, సానుభూతులను అందిస్తూనే ఉంటుంది. ఈ సమయంలో ఎకౌంట్‌లోకి కొత్త డిపాజిట్లు కృతజ్ఞతలరూపంలో, తల్లిమీది ప్రేమాసక్తుల రూపంలో, పూవు, పండు, దుస్తులు, ముద్దుల రూపంలో జమ చెయ్యాలి. ఆవిధంగా ఎకౌంట్‌ను మంచి స్థితిలో ఉంచాలి. నా కొడుకు కంటే చేతగాని

వాజమ్మల నుంచి వారి తల్లులకు ఇవన్నీ లభిస్తున్నాయని నాకు తెలుసు. బిడ్డా! నీవు నీవు కా. సోమరి తిరుగుళ్ళకు, విషయ వాసనలకు దూరంగా జరుగు. నీ అందమైన ముఖంతో వ్యాపారం చేయడం మానుకో. దేవుని యెడల నీ విధులను విస్మరించకు. ఇలా చేయక పోయావో నీ బ్యాంక్ ఎకౌంట్ వట్టిపోతుంది.''

ఈ ఉత్తరానికి ఆమె మూడు రోజులు మెరుగులు పెట్టి, అతడికి స్వయంగా తాను ఇచ్చింది. దీనితో అతడికి తల్లి అంటే ఉన్న ఆ కాస్త గౌరవం కూడా పోయింది. తల్లి కూడా శత్రువయింది. తల్లిని నిజంగా ద్వేషించిన వాడు నాకు అతడే కనిపించాడని డాస్‌పాసోస్ అన్నాడు. తల్లిని 'లంజ' అని తిట్టిన వాణ్ణి అతణ్ణే చూచాను, అని ఆ తరవాత జనరల్ లాన్ హామ్ అన్నాడు. ఈ మాతృద్వేషాన్ని అతడి రచనలు వివిధంగా ప్రతిబింబించాయి. అతడు తల్లిని, కుటుంబాన్ని వదిలి, `Toronto Star' అనే పత్రికకు ఐరోపా విలేకరిగా ఇతర దేశాలకు వెళ్ళి పోయాడు. సాహిత్యంలో అతడు పరిపూర్ణతను సాధించడానికి కారణం అతడి మాతృద్వేషమే. ఏది రాసినా తల్లిలా రాయకూడదనే నిర్ణయానికి వచ్చాడు. తల్లిరాసే ''నీరసాలంకారిక శైలి'' (Stale rhetoric style) కి తాను వారసుడు కారాదనుకొన్నాడు.

**1922** లో పారిస్ మేధావుల మధ్యకు వచ్చి వాలాడు. ఫోర్ట్‌మడాక్స్ ఫోర్డ్‌కు సాహితీ ప్రతిభ ఎక్కడ ఉన్నా దానిని వాసన పట్టే సామర్థ్యం ఉంది. లారెన్స్, నార్మన్ డగ్లస్, విండ్ హామ్ లెవిస్, ఆర్థర్ రాన్‌సమ్‌లను, ఇంకా ఇతరులను వెలికి తెచ్చినవాడు అతడే. **1923**లో "Transatlantic Review" మొదటి సంచికను ప్రకటించిన అతడు, ఇజ్రాపౌండ్ సిఫారసుపై హెమింగ్వేను పార్ట్‌టైమ్ అసిస్టెంట్‌గా వేసుకొన్నాడు. హెమింగ్వే దృష్టిలో ఫోర్డు నూతన రచయితలకు, నూతన సాహితీ ప్రక్రియలకు తగు ప్రోత్సాహం యివ్వడం లేదు. ఒకసారి ఫోర్డ్ అమెరికా యాత్రకు వెళ్లినప్పుడు, హెమింగ్వే ఇదే సమయం అని, జూలై, ఆగష్టు సంచికలను అమెరికన్ సాహితీ ప్రతిభతో నింపి వేశాడు. ఫోర్డు తిరిగి వచ్చిన తరవాత, తాను ఇన్నాళ్ళుగా ఆ పని చేయ లేనందుకు 'సిగ్గు పడుతున్నాను, చింతిస్తున్నాను' అన్నాడు.

తలిదండ్రుల మత, నీతి సంస్కృతికి ఆలవాలమైన ఒక ఆభాసిక

ప్రపంచానికి తాను వారసుడనయ్యానని, ఆ ప్రపంచాన్ని తొలగించి దాని స్థానంలో వాస్తవమైన ప్రపంచాన్ని ప్రతిష్ఠించాలనీ హెమింగ్వే భావించేవాడు. మరి ఈ వాస్తవం ఎటువంటిది? తలిదండ్రుల నుంచి వచ్చిన క్రైస్తవ శ్రుతి కాదు. అన్యులు ప్రతిపాదించిన, గత కాలానికి చెందిన, లేదా సమకాలీనానికి చెందిన ఏ రకం మత సత్యమూ కాదు. ఆ ప్రతిపాదనలు ఎంత గొప్పవైనా తాను దర్శించిన, అనుభూతి చెందిన, వాసన చూసిన, రుచి చూసిన సత్యం అది. 'అసలు రాయడం ఎలా?' అనే విషయాన్ని గురించి అతడు "A Movable Feast", "The Green Hills of Africa", "Death in the Afternoon", "By - line" లలో అక్కడక్కడా చర్చించాడు. కాల్పనిక రచనను అతడు ఇలా నిర్వచించాడు: ''నీ ఉద్వేగానికి నాంది ఏమిటో, ఎక్కడో తెలుసుకో. నీకు ఉత్తేజాన్ని ఇచ్చిన చర్య ఏదో గమనించు. దానిని స్పష్టంగా, పాఠకుడు గూడ యథాతథంగా దర్శించగలిగేట్టు రాయి. క్లుప్తంగా, ముప్పేతంగా, సరళంగా, బలమైన క్రియాపదాలతో, వ్యర్థపదాలు లేకుండా చిన్న చిన్న వాక్యాలతో రాయి. గద్యం, శిల్పం గృహోభ్యంత రాలంకరణం కాదు. తళుకు బెళుకుల ఆహార్యానికి కాలం చెల్లింది. నన్ను పౌండ్ ఎంతగానో, అందరి కంటే గూడ ప్రభావితం చేశాడు. విశేషణాలను నమ్మవద్దని నాకు నేర్పిన వాడతడే.''

అతని రాత స్వయంభువు. ఈనాడు అతడి ప్రభావం సోకని సాహిత్యాన్ని మనం చూడం. అయినా అతడు **1920**ల్లో గుర్తింపు కోసం నానా తంటాలు పడవల్సి వచ్చింది. పెద్ద పెద్ద పత్రికలు ఆయన్ను పట్టించుకో లేదు. అతడు రాసిన బ్రహ్మాండమైన ''అపరాజితులు'' (The Undefeated) అనే కథను **1925**లో గూడ `The Dial' అనే పత్రిక ప్రచురించ నిరాకరించింది. అప్పుడు పెద్ద పెద్ద రచయితలంతా ఏమి చేస్తారో అతడూ అదే చేశాడు. తనకు కావలసిన మార్కెట్టును తాను సృష్టించు కొన్నాడు. తన అభిరుచులను పాఠకులకు అంటించ గలిగాడు.

**1925**లో "In our Time" ప్రచురణతో అతడి ఖ్యాతి దశదిశల వెలిగి పోయింది. దీనిని ఎడ్మండ్ విల్సన్, కళాత్మక ప్రతిష్ఠను ఇనుమడింప జేసేదానిగా, మౌలిక రచనగా పొగిడాడు. ఆ తరవాత వచ్చిన రెండు విషాద నవలలు "The Sun Also Rises" (1926), "A Farewell to

Arms" (1929) అతడిని ఆకాశానికెత్తాయి. మొత్తం అతడు రాసిన వాటిలో కెల్ల "A Farewell to Arms" గొప్ప నవల.

చాలమంది మేధావులకు వలె, ఇతడూ తన సొంత డబ్బా వాయించు కోవడానికి ప్రాముఖ్యం ఇచ్చాడు. గతంలో చాల అచ్చివచ్చిన ''కాల్పనిక మేధావి ప్రతిమ'' మెత్తని వెల్వెట్ లాంటి, మృదు విశ్రాంతలతో గూడిన ప్రతిమ-కు వ్యతిరేకం ఇతడి ''మగపురుష'' (He man) ప్రతిమ - సఫారిసూట్లు, తుపాకులు! గోపురం లాంటి టోపీ, పొగాకు, విస్కీలతో గూడిన ప్రతిమ - కంట్లోపడే ఆహార్యాన్ని ప్రజలలోకి చొప్పించాడు. **1940**ల నాటికి హాలీవుడ్ మగ తారలను మించి అన్ని పత్రికలలోను అతని ఫొటోలు పడ్డాయి. అతడు ఇచ్చినన్ని ఇంటర్వ్యూలు, ఫొటోలకు పోజు లివ్వడాలు చరిత్రలో మరొకరు చేసినట్లు కానరాదు. అతడి తెల్లని బవిరి గడ్డం టాల్‌స్టాయ్ గడ్డం కంటె ప్రాచుర్యం పొందింది.

''మంచి రచయితలంతా బాగా అబద్ధాలాడతారు. ఇది వారికి అసహజమూ కాదు, కొత్తా కాదు. అసలు వారి వృత్తే అంత, కాకపోతే ఒక అబద్ధాన్ని కల్పన చేస్తారు "Art is Illusion" కళ భ్రమజనకం. తరముగా వాళ్ళు అనుకోకుండానే, అచేతనంగానే అబద్ధాలు చెబుతారు. ఆ తరవాత వాటిని 'గాఢ చింతనతో జ్ఞాపకం చేసుకొంటూ ఉంటారు.' అని Hemingway's Readings లో మీరు చూడవచ్చు. ఇది అతనికి గూడ వర్తిస్తుంది. ఇకపోతే మామూలు అబద్ధాలు సరేసరి. తన ప్రచురణకర్త అయిన చార్లెస్ స్క్రైబ్నర్‌కు **1949**లో ఒక నోట్ పంపాడు. అందులో ఇలా ఉంది: ''నా ఏభైయ్యో జన్మదినోత్సవం జరుపుకోవడానికి మూడుసార్లు సంభోగం చేశాను. పది పావురాలను పడగొట్టాను. ఒక కేసు పైపర్ హైడ్ సిక్‌బ్రట్ తాగేశాను. సాయంత్రమంతా పెద్ద చేపను పట్టడానికి సముద్రమంతా గాలించాను.'' ఇది అబద్ధం.

ఒకసారి తలిదండ్రులకు, తాను మే మార్ష్ అన సినీనటిని పెళ్ళాడ బోతున్నానని చెప్పాడు. వాస్తవానికి అతడెప్పుడూ ఆమె ముఖమైనా చూసి ఎరగడు. `Birth of a Nation' అనే సినిమాలో ఆమె ముఖాన్ని చూశాడు. అంతే. ఈ అబద్ధాన్ని తలిదండ్రులకే కాదు కనాస్ నగరంలోని

తన సహచరులకు ఇంకొంత కలిపి చెప్పాడు. 150 డాలర్లతో ప్రధానపు ఉంగరం ఇచ్చానని చెప్పాడు. మార్కెట్టులో ఒక పెద్ద చేపను కొనుక్కొని తెచ్చి, దానిని సముద్రంలో పట్టి తెచ్చినట్లు చెప్పాడు. తాను ముష్టియుద్ధ వీరుణ్ణని, ఆ యుద్ధంలో తన చేయి దెబ్బ తిందనీ చెప్పాడు. తనకు ఇండియన్ స్త్రీలతో సంబంధం ఉందనీ వారిద్వారా తనకు కూతుళ్ళు ఉన్నారని చెప్పు కొన్నాడు. అతడి ''స్వీయచరిత్ర'' (A Movable Feast) పైకి నిర్వ్యాజంగా కనిపించి నప్పటికీ, రూసో "Confessions" లా నమ్మడానికి వీలులేనిది. మొదటి ప్రపంచ యుద్ధాన్ని గురించి గూడ అతడనేక అబద్ధపు రిపోర్టులను పంపాడు.

ప్రచ్ఛన్న ప్రపంచం (underworld) లోని వేశ్యలు, తార్పుడుగాళ్ళు, విటులు, పోలీసు ఇన్ఫార్మర్లతో సంబంధాలు పెట్టుకొనే అలవాటు అతడికి ఉంది. వీళ్ళను ఉపయోగించుకొని నాజీల ఆట కట్టించడానికి ఏదో ఒకటి చేయాలని తన స్నేహితుడైన అమెరికా రాయబారి స్ప్రూయిల్ బ్రాడెన్‌ను నమ్మించాడు. "Crook Factory" అని అతడు పిలుచుకొన్న ఈ ఏర్పాటుతో అతడు ఒక్క నాజీ గూఢచారిని గూడ పట్టివ్వ లేక పోయాడు.

ఇతడి స్నేహాలు గూడ ఎక్కువ కాలం నిలిచేవి కావు. స్నేహాల కంటె స్వనీతికి, కాల్పనిక రచనకు ఎక్కువ విలువ నిచ్చేవాడు. చాలమంది మేధావులకు లాగే ఉదాహరణకు రూసో, ఇబ్సెన్‌లకు లాగా తోటి రచయితలతో తగవులు విషమంగా ఉండేవి. రచయితలుగా వారు పొందిన పేరును చూసి ఓర్వలేక పోయేవాడు. 1937 నాటికి తనకు పరిచయం ఉన్న రచయిత లందరితో తగవు పడ్డాడు. దీనికి ఒక్క మినహాయింపు ఉంది. అది ఇజ్రాపౌండ్. స్వీయచరిత్రలో ఇతడిని అభిమానిస్తూనే రాశాడు. తోటి రచయితల యెడ పౌండ్‌కు ఉన్న నిస్వార్థ కరుణను మెచ్చుకొన్నాడు. 1945లో పౌండ్‌ను దేశద్రోహ నేరం క్రింద గ్యాస్ చేంబర్‌కు వెళ్ళకుండ, అతడప్పుడు మతిభ్రంశ స్థితిలో ఉన్నాడని వాదించి, తప్పించాడు.

జేమ్స్‌జాయిస్‌తో గూడ అతడు తగవు పడలేదు. బహుశ అతడితో తగవుపడే అవకాశం లేకనో, అతడి కృతులను అభిమానించడం వల్లనో, ''సజీవులైన రచయితలలో కెల్ల నేను గౌరవించేది ఇతడినే'' అన్నాడు. ఇక

మిగతా వారందరితో తగవే. ఉదాహరణకు స్వీయచరిత్రలో విండమ్ లెవిస్ (Wyndham Lewis) ను గురించి ఇలా రాశాడు: ''లెవిస్ నాస్టీగా కనిపిస్తాడు... అతడి కళ్ళు చూస్తే, మానభంగం చేయడంలో పరాజితుడైన వాని కళ్ళులా ఉంటాయి''. ఇలా రాయడానికి కారణం లెవిన్ అతడిని సాహితీ పరంగా విమర్శించాడు.

అదే గ్రంథంలో స్కాట్ ఫిట్జ్‌రాల్డ్, ఇతడి భార్య జెల్డా గురించి మరికొన్ని అబద్ధాలు రాశాడు: ''నేను నా భార్యను తప్ప అన్య స్త్రీని ఎరుగను. నా శరీర నిర్మాణాన్ని బట్టి నేను ఏ స్త్రీని సుఖపెట్టలేనని నా భార్య అంది. ఇది ఆమెను కుంగదీసింది'' అని ఫిట్జ్ రాల్డ్ తనతో అన్నాడని, ఆ తరవాత వారిద్దరు (ఫిట్జ్‌రాల్డ్ హెమింగ్వేలు) పురుషుల గదిలోకి వెళ్ళినట్లు, అక్కడ పిట్జ్‌రాల్డ్ తన అంగాన్ని తనకు చూపించినట్లు, 'దానికేం అది బాగానే ఉందని', తాను ప్రోత్సాహంతో మాట్లాడానని రాశాడు.'' ఇదంతా కల్పితమేనని జెల్డా ద్వారా తెలిసింది.

అమెరికన్ నవలాకారుడు డాన్ పాసోన్‌తో తగవు పడ్డాడు. దీనికి కారణం అసూయ. పాసోన్ అప్పులు ఎగవేసే బాపతని, అతడి భార్య దర్శనలాలసి (ఇతరులను నగ్నంగా, రతిలో చూడడం వలన కామతృప్తి పొందేవారు) అని వర్ణించాడు. ఇంకా పాసోన్‌ని సభ్యమ్మన్యుడని (సభ్యత లేకపోయినా సభ్యుడుగా కనపడే వాడని), 'లంజకొడుకు' అని తిట్టాడు. ఈ విషయాలన్నింటిని To Have and Have not (1937) లో చొప్పించాలని చూస్తే పబ్లిషర్ న్యాయపరమైన చిక్కుల కారణంగా వాటిని ఒప్పుకో లేదు.

ఇక వైవాహిక జీవితం మాటకొస్తే, కాపురాన్ని ఎలా చెడగొట్టుకోవాలో అతడికి మరొకరు నేర్పక్కర లేదు. స్త్రీల జుట్టు అతడికో సమస్య. ఆ జుట్టు మరీ పొట్టిగా ఉంటే అది అతని మీద ''పీడా అనియంత్రిక భావం''గా పనిచేస్తుంది. దీనికి కారణం వాళ్ళమ్మ అతడికి బాల్యంలో చాలా కాలం వరకు మగవాళ్ళ దుస్తులు వేయ లేదు. అతడి జుట్టు తీయించ లేదు. మొత్తంమీద ఈ కారణాలతో, స్త్రీలు అతడికి అణిగి మణిగి ఉంటే తప్ప, వాళ్ళతో దీర్ఘకాలం నాగరిక సంబంధం పెట్టుకోలేక పోయాడు. తన కుటుంబంలో అతడికి వచ్చింది తన చెల్లెలు ఉరుసుల. ఎందుకంటె ఆ

కుటుంబంలో అతడికి నచ్చింది తన చెల్లెలు ఉరుసుల. ఎందుకంటె ఆ అమ్మాయి అతడిని ఆరాధించేది. రాత్రిళ్ళు అతడు ఆలస్యంగా వస్తే, అతనికి భోజనం పెట్టడానికి ఎదురు చూస్తూ, జోగుతూ మెట్లమీద కూర్చొనేది. ''నాతో పాటు తాగేది. నాతో పడుకొనేది, నన్ను ఒంటరితనం బాధించనీయ కుండా నన్ను నిద్రబుచ్చి ఆ తరవాత వెళ్ళేది'' అని రాశాడు ఆర్థర్‌కు రాసిన ఉత్తరంలో. బహుశా ఇదీ కల్పనకావచ్చు. ఆదర్శ స్త్రీ అంటే అలా ఉండాలని అతడి ఊహ. ఇది నిజమైనా, అబద్ధమైనా, అటువంటి 'ఆదర్శ స్త్రీ' అతడికి దొరక లేదు.

ఇరవయ్యో శతాబ్ది ప్రమాణాల ప్రకారం అతని నలుగురి భార్యలలో ముగ్గురు మాత్రం అసాధారణ దాసభావంతోనే అతడితో గడిపారు. అయినా ఆ 'దాస్యం' అతనికి చాల లేదు. అతనికెప్పుడూ 'కొత్త రుచులు' కావాలి. వైవిధ్యం నాటకీయత కావాలి. మొదటి భార్య హాడ్లీ రిచర్డ్‌సన్. హెమింగ్వే కంటె ఎనిమిదేళ్ళు పెద్దది. బాగా ఉన్నావిడ. బహు అందగత్తె. మొదటి బిడ్డ జాక్‌ను కన్నాక ఆమె బాగా ఒళ్ళు చేసింది. ఆ పెరిగిన ఒంటిని ఎంత తగ్గించుకోవాలన్నా ఆమెకు సాధ్యపడ లేదు. అతడి రచన అమ్మకాలు పెరిగే వరకు ఆమె డబ్బుతోనే జీవించాడు. ఇప్పుడు డబ్బు అవసరం తీరిపోయింది. ఆమె లావైపోయింది. ఆమె సమక్షంలోనే ఇతర స్త్రీలను ఒళ్ళో కూచో బెట్టుకొని లాలించేవాడు. దీనికి అతడికి ఏ నీతి నియమాలు అడ్డు వచ్చేవి కావు. ఉదాహరణకు "The Sun Also Rises" లో బ్రైట్ ఆష్లేగా రూపు దిద్దుకొన్న Twysden ను అలాగే చేశాడు. తరవాత పాలిన్ ఫైఫెర్ అనే ధనికురాలైన ఒక అందమైన కృశోదరి, అతడంటే మోజుపడి, అతణ్ణి విమోహితుణ్ణి చేసింది. ఈ ప్రేమ జంట హాడ్లీని తమతో కలిసి భోజనం చేయాలని కోరింది. ముగ్గురు ఈత దుస్తులతో ఒకేసారి ఈత కొట్టాలని అంది. అయినా ఆ తల్లి ఇవన్నీ సహించింది. ఈ జంట అంతటితో ఊరుకోక ఆమెను వేరు పెట్టారు. ఫలితంగా విడాకులు. విడాకుల విషయంలో హాడ్లీ చాల ఉదారంగా వ్యవహరించింది. దీనిని హెమింగ్వే మెచ్చుకొన్నాడు. ఈసారి విడాకులు అంత తేలికగా ఉండదని పాలిన్ మనస్సులో అనుకొంది.

పాలిన్‌కు ఒక కొడుకు. **1931**లో మరో కొడుకు. క్రమంగా ఈ వివాహ బంధం గూడ దిగజార జొచ్చింది. ఈలోపల హెమింగ్వే క్యూబాలోని పాన్ అమెరికన్ ఎయిర్‌వేస్ అధిపతి భార్య జేన్ మాసన్‌ను

చేపట్టాడు. ఈమె హెమింగ్వే కంటె పధ్నాలుగేళ్ళు చిన్నది. మంచి అందగత్తె. బాగా తాగుతుంది. స్పోర్ట్స్ కార్లు రెక్‌లెస్‌గా నడుపుతుంది. ఆమె తన ఈ సంక్లిష్ట జీవితంతో వేగలేక అవసాదానికి (depression) గురైంది. ఆత్మహత్య చేసుకోవాలని ప్రయత్నించి విఫలమైంది. కాని నడుము విరగ గొట్టుకొంది. ఇక్కడ నుంచి హెమింగ్వేకు ఆమె అంటే ఆసక్తి సన్నగిల్లింది.

ఈలోపల పాలిన్ అతణ్ణి తిరిగి పొందాలనుకొంది. ''మానాన్న చాల డబ్బిచ్చాడు. నీకు కావలసినంత తీసుకో. ఏ సంగతీ తెలియజెయ్యి. మరో స్త్రీని నీ జీవితంలోకి ఆహ్వానించ వద్దు. నీ ప్రియమైన పాలిన్'', అని ఆమె అతడికి లేఖ రాసింది. అతని కోసం ప్రత్యేకంగా ఈత కొలను ఒకటి నిర్మించింది. ''ముక్కును, పెదాలను, ఉలిపిరి కాయలను, పుట్టు మచ్చలను ప్లాస్టిక్ సర్జరీతో అతడి కోసంగా సరిచేయించుకొని క్యూబా వస్తాను. నీ కోసం జుట్టుకు రంగు వేయించుకొంటాను'' అని రాసింది. కాని ఆమె క్యూబా యాత్రసత్ఫలితాల నివ్వలేదు. To Have and Have not లో అతడామెకొక హెచ్చరిక చేశాడు. ఒక పురుషుణ్ణి నీవు బాగా చూస్తున్నట్లు, అతణ్ణి ఎక్కువగా ప్రేమిస్తున్నట్లు తెలియ చేసిన కొలది, అతడికి నీవంటే త్వరలో విసగట గలుగుతుంది.

తరవాత అతడి జీవితంలో ప్రవేశించిన స్త్రీ మార్తా గెల్‌హోలెన్. ఈమె పత్రికా విలేకర్తి, రచయిత. నీలిరంగు కళ్ళు. మంచి పొడగరి. అతని కంటె పదేళ్ళు చిన్నది. శారీరకంగా అతడిని కలవడానికి ఇష్టపడేది కాదు. సంతానాన్ని కనడం ఆమెకు ఇష్టం లేదు. అందుకని ఒక బిడ్డను దత్తు చేసుకొంది. ''మార్కెట్‌లో కొనడానికి పిల్లలు దొరుకుతుంటే కనవలసిన పని ఏముంది?'' అందామె. అతడు పేరుమోసిన రచయిత అనే ఉద్దేశంతో అతడిని ఆమె పెళ్ళి చేసుకొందేగాని మరొకటి కాదు. అతడి సాహితీ ప్రభావం తనకు అంటుకొంటుందేమోనని ఆమె ఆశ. పాలిన్ చివరి వరకు అతణ్ణి తన వాడిగా ఉంచుకోవాలని ప్రయత్నించింది కాని కుదరలేదు. హాడ్లీ తేలికగా విడాకులకు ఒప్పుకొన్న సంగతి గుర్తుకొచ్చింది. ఈమె విడాకులు అంత తేలికగా పడనీయ లేదు.

అతడి తాగుడికి మార్తా అభ్యంతరం పెట్టింది. బార్ నుంచి ఇంటికి బయలుదేరమంది. అతను అత్యంత ప్రేమతో చూసుకొనే లింకన్ (Lincoln) కారులో బయలుదేరారు ఇద్దరూ. ఆమె కారు నడుపుతోంది. తాగనీయ నందుకు కోపం వచ్చి, అతడామెను చేయి తిరగవేసి కొట్టాడు. దానితో

ఆమెకు ఒళ్ళు మండిపోయి, కారు వేగం తగ్గించి, చెట్టుకు గుద్దించి, అతడిని కారులోనే వదిలి, తాను చక్కా ఇంటికి పోయింది. ఆ తరవాత దొంగచాటుగా ఆమెకు చెప్పకుండా లండన్ వెళ్ళి పోయాడు. ఆమె అతడిని వెతుకుతూ లండన్ పోయి 1944లో అతణ్ణి పట్టుకొంది.

ఆ తరవాత అతడి పతన వేగం పెరిగింది. ''అతడు నన్ను బెదరించాడు. నా మీద అశ్లీలంగా పద్యం ఒకటి రాశాడు. దాని శీర్షిక 'మార్తా గెల్హారన్ యోనికి (To Martha Gelluhorn's vagina) చివికిపోయి ముడతలు పడిన పాత వేడినీళ్ల సంచి (Hot water bottle) మూతితో దానిని పోల్చాడు. ఏ స్త్రీతోనైనా పడుకోబోయేముందు ఈ పద్యం వినిపించేవాడు. రాను రాను అతడికి పిచ్చి ముదిరి పోయింది'' అందామె. అతని కొడుకు గ్రగరీ గూడ ''తన తండ్రి మార్తాను తెగ ఏడిపించాడ''న్నాడు. 1944 చివరలో వారి మధ్య వివాహ బంధం విచ్ఛిత్తి అయింది. ''నా జీవితంలో నేను చేసిన పెద్ద పొరపాటు ఆమెను పెళ్ళాడడమే. ఆమె వట్టి తిరుగుబోతు'', అని బెరన్‌కు రాసిన ఉత్తరంలో పేర్కొన్నాడు.

నాలుగోది చివరిదీ అయిన మేరీవెల్ష్ తోటి అతని వివాహం అతని జీవితాంతం సాగింది. దీనికి కారణం ఆమె గొప్పతనమే. ఆమెకు అతడి గురించిన ''భ్రమలు'' ఏమీ లేవు. అతడెటువంటి వాడో తెలుసు. 1945లో పారిస్ రిట్జ్‌లో మొదటిసారి కలుసుకొన్నప్పుడే అతడు పీకల దాకా తాగి ఉన్నాడు. అతడికి కావలసింది ''దాసీ - భార్య'' అని ఆమె అర్థం చేసుకొని విలేకరి ఉద్యోగం మానేసింది. తెలివైంది. శ్రమజీవి. అయినా అతడామెను తిట్టడం మానలేదు. అవన్నీ ఆమె సహించింది. ఆమెను వ్యంగ్యంగా, ''నేను ఎప్పుడూ టైమ్ పత్రిక 'కథ'ల కోసం జనరల్స్ దగ్గర పండుకోలేదు'', అంటూ ఉండేవాడు. అతడామెను "Papa's Pocket Venus" అని వర్ణించి, ''ఆమె క్షేత్రానికి క్రితం రాత్రి నాలుగు సార్లు నీరు పెట్టాను'', అని ఛార్లెస్ లాన్ హోమ్‌కు చెప్పాడు.

అందమైన, పేరున్న, డబ్బున్న ఆడవాళ్ల కోసం అతడేమైనా చేసేవాడు. ఈ నాలుగో భార్య మేరీ సమక్షంలోనే ఇతర ఆడవాళ్లను లాలించేవాడు. వెనిస్‌కు చెందిన అడ్రినా ఇవానిచ్ అంటే మరులుగొన్నాడు. Across the River and into the Trees (1956) యుద్ధానంతరం నవలకు ఈమెయే నాయిక. ఆ తరువాత 1959లో హెమింగ్వే సర్కస్ మూటా

ముల్లెతో వేసవి యద్ధ యుద్ధాలకు స్పెయిన్ వెళ్లినప్పుడు విలేకరి డాన్బిస్మిత్ అనే పందొమ్మిదేళ్ళ పిల్ల హెమింగ్వేని ఇంటర్వ్యూ చేయడానికి వచ్చింది. ఆమెకోసం అర్రులు సాచాడు. ఆమెను పెళ్ళాడే వాడేకాని, మేరీ మంచి భార్య అని జ్ఞాపకం వచ్చి, ఆమెను $ 250 లకు పనికి పెట్టుకొన్నాడు.

కార్లో వెళ్ళేటప్పుడు మేరీని వెనుక సీట్లో కూర్చోబెట్టి, ముందు సీట్లో ఈమెను చేతిక్రింద అట్టిపెట్టు కొనేవాడు. ఆ తరవాత ఈమె హెమింగ్వే కొడుకైన గ్రెగరీని పెళ్ళాడింది. హెమింగ్వే త్రాగుబోతు. త్రాగుడు అతని జీవితానికి, రచనకు, కాల్‌రిజ్‌కి మత్తుమందులా పనిజేసింది. త్రాగుడికి ఎంతగా అలవాటు పడ్డాడంటే 1920ల ప్రాంతాల ప్రాచుర్యంలోకి వచ్చిన "Have a drink" ఉక్తిని ఇతడే కనిపెట్టాడంటారు.

హెమింగ్వే తండ్రి ఆత్మహత్య చేసుకొన్నాడు. ఇతడు అవసాదం (depression) పారనోయాలతో బాధపడ్డాడు. ఆ సమయాల్లో ఏమి చేసేది అతడికే తెలిసేదే కాదు. అలాంటి ఒక తెరలో ఇంగ్లీషు డబుల్ బారల్ గన్‌తో తన జీవితాన్ని 2జూలై 1961న అంతం చేసుకొన్నాడు. కాదు, గన్‌ను తుడుస్తుంటే పొరపాటున ట్రిగర్‌కు ఒత్తిడి తగిలి, పేలి మరణించాడంటారు కొందరు.

అతడు మృత్యువును ఎందుకు వాంఛించాడు? తన కోసం అతడు ఒక నీతిని, ఒక ప్రతిష్ఠను, ఒక వాస్తవాన్ని, విశ్వాసపాత్రతను నిర్వచించుకొన్నాడు. మరి వీటిని వేటిని అతడు ఆచరణలో పెట్టలేక పోయాడు. బహుశా ఇదే కాక, చివరి దశలో, తన సాహితీ వ్యాసంగంలో గూడ దిగజారుడుతనం ప్రవేశించిందని భావించాడు. 1954లో నోబెల్ బహుమతి ఆర్జించి పెట్టిన "The Old Man and the Sea" (1952)లో గూడ తనను తానే అనుకరించే హీన స్థితికి దిగజారాడు. తన పూర్వపు మేధను తిరిగి అందుకోలేక పోతున్నానని బాధపడి, అతడు మృత్యువుకు ఆహ్వానం పలికాడు.

అతడిలో దోషాలెన్నైనా ఉండవచ్చుగాని, అతడి సాహితీ విన్యాసంలో నిజాయితీ, సమగ్రతలు ఉన్నాయి. అవి అతడి జీవితాన్ని జ్వాజ్వల్యమానం చేశాయి. ఇంగ్లీషు రాయడంలో, కాల్పనిక రచనలో అతడు నూతన ఒరవళ్ళు దిద్దాడు. అతడి సృజనాత్మక కళాభినివేశం అతడిని మింగివేసింది.

*(91 సెప్టెంబర్ మిసిమి)*

# విశ్వవిఖ్యాత నాటక కర్త

## హెన్రిక్ ఇబ్సన్

ఏ రచనైనా రాయడం కష్టమే. సృజనాత్మక రచనైతే మరీను. అదే మౌలిక రచన అయితే చెప్పవలసిన పనే లేదు. తన రచనా వ్యాసంగానికి సరిహద్దురేఖలను విస్తృతం గావించడానికి తన కృషినంతా ఉపయోగించాలంటే స్వయమాపాదిత శిక్షణ, బౌద్ధిక పరిశ్రమ ఎంతగానో కావలసి ఉంటుంది. కాని ఇదంతా ఇబ్సన్‌లో పుష్కలంగా ఉంది.

ఆధునిక నాటకాన్ని అతడు కనిపెట్టాడు. ఇప్పటికి గూడా ప్రపంచ నాటక సాహిత్యం మొత్తంలో ప్రముఖ భాగం అతడి నాటక రచనే! అతడు రంగప్రవేశం చేసేటప్పటికి ఐరోపా రంగస్థలం బక్కచిక్కి, శూన్యమై నిర్వీర్యంగా ఉంది. అటువంటి దానిని ఒక్క శక్తివంతమైన కళారూపంగా మార్చాడు. తన దేశపు రంగస్థలినే కాక ప్రపంచనాటక రంగాన్నే పరివర్తించాడు.

నాటకరంగంలోనే కాక, సామాజిక రంగంలో గూడా అతడు తన ముద్ర వేశాడు. ఆడ, మగని అందరిని ప్రకృతికి, సహజత్వానికి దగ్గరవ్వమని రూసో ప్రబోధిస్తే, ఇబ్సన్ మగవారిని, ముఖ్యంగా ఆడవారిని, సామాజిక నీతికంటే, వ్యక్తిస్వేచ్ఛ, అంతరాత్మ ప్రబోధానికి తలవంచమన్నాడు. స్వేచ్ఛాయుత సమాజానికి నాంది పలికాడు. ఆధునికతా హజారరచనానికి అతని రచనలు మూలస్తంభా లయ్యాయి.

అతడు చాలా పేద వాడు, అతడు పుట్టిన దేశం నార్వే అంతకంటే పేదది. సాంస్కృతికంగా గూడా బాగా వెనకబడిన దేశం. ఇది చాలాకాలం డెన్మార్క్‌లో రాష్ట్రంగా ఉన్న కారణాన, డేనిష్ మహాసంప్రదాయానికి (great tradition)కు గురైంది. పద్యం గద్యం, నవల నాటకం అన్నీ డేనిష్ సంస్కృతికి సంబంధించినవే. నార్వే మొదటి విశ్వవిద్యాలయం 1813లో స్థాపింపబడింది. 1850 నాటికిగాని ప్రథమ నార్వేజియన్ రంగస్థలి నిర్మితం కాలేదు. మనకు సాహితీ భాష అంతా సంస్కృతంలో ఎలాగుండేదో, తెలుగులో రాయడం ఎంత అనాగరికమో, అవమానకరమో అక్కడ

ఆరోజుల్లో నార్వే భాషలో రాయడ మంటే అంతే. సంస్కృతీ సాహిత్యమంతా డేనిష్‌మయం.

20 మార్చి 1828లో ఇబ్సన్ స్కైయన్‌లో జన్మించాడు. ఇబ్సన్ అందరి కంటె పెద్దవాడు. ఇతనికి నలుగురు తమ్ముళ్ళు, ఒక చెల్లి. తండ్రి నడ్ ఇబ్సన్. ఇతడు వ్యాపారి. తల్లి నావికా కుటుంబం నుంచి వచ్చింది. ఇబ్సన్‌కు ఆరేళ్ళు వచ్చినప్పుడు తండ్రి పోయాడు. "The Wild Dnek" లో ముసలి ఇక్డల్ అయ్యాడు.

తల్లి ఒకప్పుడు మంచి అందగత్తె; నటి. అంతర్ముఖి అయి, ఇప్పుడామె బొమ్మలతో వహారువయాల ఆడుకొంటోంది. కుటుంబం అప్పుల్లో జీవించింది. ముఖ్యాహారం బంగాళా దుంపలు. అంతేకాదు. ఇబ్సన్ వట్టి అనాకారి; పైగా అతడు అక్రమ సంతానమనే ముద్ర క్రింద బ్రతకాల్సి వచ్చింది. స్థానిక విటుడొకరితో అతడి తల్లికి సంబంధం కలిపారు. దీనిని ఇబ్సన్ అప్పుడు నమ్మి, బాగా తాగినప్పుడు ఇదే విషయాన్ని వాగేవాడు. కాని ఇది నిజమని చెప్పే ఆధారాలేమీ లేవు.

ఇటువంటి అధోగతి స్థితి నుంచి స్వయంగా చదువుకొని, 1850ల నాటికి విశ్వవిద్యాలయ చదువులు పూర్తిచేశాడు. అతడు పద్యం రాశాడు. నాటక విమర్శ చేశాడు. కాని అతడి మొదటి రచన అయిన `Norma' ప్రదర్శితం కాలేదు. అలాగే `St John's Night' తోనూ అదృష్టం కలిసి రాలేదు. బెర్గాన్‌లో ఆడిన అతడి మూడవ నాటకం "The Warriors Barrow" విజయవంతం కాలేదు. అతని నాలుగో నాటకం "Lady Ingar of Ostrat", అతడి పేరు బయట పెట్టకుండా ప్రదర్శించినా, అదీ సఫలం కాలేదు. కాస్త ప్రజల దృష్టిని ఆకర్షించిన అతడి నాటకం "The Feast at Solboug".

సంగీతకర్త ఓల్ బుల్ స్థాపించిన నాటకమండలిలో నెలకు ఐదు పౌండ్ల జీతంపై అన్ని రకాల చాకిరి ఆరేళ్ళు చేశాడు. ఆ తరవాత నూతనంగా పెట్టిన క్రిస్టియానా నాటక మండలిలో మరో ఐదేళ్ళ అనుభవం సంపాదించాడు. ఈనాటక మండలి దివాళా తీయడంతో అతడి ఉద్యోగం ఊడింది. పెళ్లైంది. గొంతు లోతు అప్పులు. కుంగిపోయాడు. విపరీతంగా తాగేశాడు.

అతడికి మొదటి విజయం 1864లో "The Pretenders" అనే గద్య నాటకంతో వచ్చింది. అతనికి కీర్తి మూడు తరంగాలలో వచ్చింది. మొదటిది "Brand and Peer Gyut" (1866-67)తో వచ్చింది. దీని మూలతత్వం సనాతన భౌతికవాదాన్ని ఎదిరించి, సమాజం చెప్పిన నియమాలను కాదని, వ్యక్తి అంతరాత్మ ప్రబోధానికి తలఒగ్గడం. ఇదే అతడి జీవిత తత్వం. ఇదే అతడి అన్ని రచనల వెనుక నర్మగర్భంగా ఇమిడి ఉంది. 1866లో ఇది ప్రచురిత మైనప్పుడు పెద్ద దుమారం లేచింది. దీనితో అతడు ఛాందస భావ వ్యతిరేక నాయకుడుగా ఎదిగి పోయాడు. అతడి పేరు స్కాండినేవియా అంతటా మారు మ్రోగిపోయింది.

రెండవ తరంగం 1870లో వచ్చింది. Brand తో విప్లవ భావాలను నాటకీకరించాలనే నిర్ణయానికి వచ్చాడు. నాటకాలను చదవడం కంటే, ఆడడం చేస్తే ఎక్కువ ప్రభావకంగా ఉంటుందని గ్రహించాడు. దీనితో అతడు పద్యాన్ని వదిలి గద్యాన్ని చేపట్టాడు. దీనితో ఒక రకమైన నూతన రంగస్థల వాస్తవికవాదం రూపం దిద్దు కొంది. దీనితో 'గద్యం దృశ్యాలకు, పద్యం భావాలకు' బాగుంటుందని అతడు అన్నాడు. మహా రచయితల్లాగే ఇతడు ఒకసారి రాసిన విషయాన్ని పునరుక్తి చేయ లేదు. అతడు వేసే ప్రతి అడుగు నూతన అజ్ఞాత ప్రపంచంలోకే వేశాడు. ఇతడి నూతన విధానానికి ఫలితంగా "Pillars of Society" (1877), "A Dolls' House" (1879) "Ghosts" (1881) ఆవిర్భవించాయి. ఇదే సమయంలో విక్టోరియా మధ్య యుగ సంస్కృతి బద్ధలైంది. సమాజంలో వ్యాకులత, అలజడి నెలకొనసాగాయి. ఇబ్సన్ డబ్బు శక్తిని, స్త్రీల అణచివేతను, ఎవరూ నోరు మెదపని ''సుఖ రోగాల'' గురించి ఎన్నో ప్రశ్నలు వేశాడు. ప్రాథమికమైన నైతిక, రాజకీయ సమస్యలను అతడు ప్రజల భాషలో రంగస్థలానికి ఎక్కించాడు. `Pillars' మధ్య ఐరోపా సామాజికులను దున్ని వేసింది. `A Dolls House' ఆంగ్లో-సాక్షన్ ప్రపంచాన్ని కుదిపి వేసింది. ఇవి రెండు మొదటి ఆధునిక నాటకాలు. ఇవే అతడిని ప్రపంచ నాటక కర్తగా మార్చివేశాయి.

అతడి దృష్టి రాజకీయ, నైతిక సమస్యలనుంచి వైయక్తిక స్వేచ్ఛ పైకి మరలడంతో అతడి కీర్తి తరంగం మూడవ దశను అందుకొంది. మానవుని అస్తిత్వ సమస్యలలో కెల్ల ఈ వ్యక్తి స్వేచ్ఛా సమస్యే అతడి మనస్సును

ఆకట్టు కొంది. ''ప్రతి ఒక్కరూ తమ విశిష్ట ప్రత్యేక అవసరాలకి అనుగుణంగా స్వేచ్ఛను సంతరించు కోవడంతోనే 'విముక్తి' (Liberation) ఉంది'', అని తన నోట్‌బుక్‌లో రాసుకొన్నాడు ఇబ్సన్. సమాజంలోని ప్రజల వాస్తవ ప్రవర్తన ఇటువంటి వ్యక్తిక స్వేచ్ఛకు హామీ ఇవ్వక పోతే వైధిక (Formal) రాజకీయ స్వేచ్ఛల వల్ల ఉపయోగం ఏమీ లేదన్నాడు. ఈ సిద్ధాంతానికి అనుగుణంగా అతడు `The wild Duck' (1884), `Rosmersholm' (1886) `Hedda Gabler (1890) `The Master Builder' (1892) `John Gabriel Brokman' (1896) నాటకాలను రాశాడు. ఇవి మొదట ఎవరికీ అంతుబట్ట లేదు. గందరగోళం సృష్టించాయి. కాని ఇవే అతడి నాటకాలలో కెల్ల విలువైనవి. ఈ నాటకాల్లో అతడు మానవుని మనస్సు (Psyche) ను, స్వేచ్ఛ కోసం అది పడే తపనను అన్వేషించాడు. అచేతనను అవలోడనం చేశాడు. ఒక మనిషి మరో మనిషిపై ఎలా పెత్తనాన్ని చెలాయిస్తాడనే 'భయానకమైన సమస్య'ను పరిశీలించాడు. ఆకాలపు డేనిష్ విమర్శకుడు, అతడి స్నేహితుడూ అయిన జార్జి బ్రాండేస్ ఇలా అన్నాడు: ''నాటి పరిస్థితుల్లో పుట్టే భావాలతో ఉత్తేజంతో ఏదో అంతు బట్టని పద్ధతిలో సంబంధాలు నెలకొలుపుకో గలిగేవాడు. అధః పాతాళంలో ఎక్కడో జరిగే భావాల గలగలలను అతడి చెవి పసి కట్టేది''.

అతడి భావాలు ప్రపంచ వ్యాప్తంగా ప్రసరించాయి. ఆ నాటకాలలోని బాధితులతో, పీడితులతో, దోపిడిదార్లతో తమను, తమ ప్రక్కవారిని తాదాత్మ్యం చేశారు ప్రపంచమంతటా సామాజికులు. సనాతన విలువల మీద, వ్యక్తిక స్వాతంత్ర్యం మీద, మానవాళిలో ప్రతి ఒక్కరికి సాఫల్యం పొందే అవకాశం ఉండాలనే ఆధునిక భావాలకు ప్రపంచం స్వాగతం పలికింది. అతడి చివరి దశకంలో (1906లో మరణించాడు) రష్యాలో టాల్‌స్టాయ్‌లా, ప్రపంచ రచయితల, ద్రష్టల స్థాయికి ఎదిగి పోయాడు. విలియమ్ ఆర్చర్, జార్జిబెర్నార్డ్‌షా లాంటి రచయితలు అతడి కీర్తిని ఉగ్గడించారు.

రోజూ కేఫ్ ఆఫ్ గ్రాండ్ హోటల్‌లో ఒక మూల అద్దం ముందు కూచొని, ఆ అద్దంలో ఆ హోటల్ గదిని మిగతా భాగాన్ని అవలోకిస్తూ, ఒకటి రెండు బీర్లు తాగేవాడు వార్తాపత్రిక తిరగవేస్తూ. ఈ దృశ్యం సర్వ సామాన్యం. అతడు ఆ హోటల్‌లో క్రమం తప్పకుండ ప్రవేశించగానే ప్రతిరోజు ఆ గదిలోని ప్రతి ఒక్కరూ లేచి నిలబడి తమ టోపీలను

తీసి అభివాదాలు చేసేవారు. అతడు కూర్చోక ముందు ఎవరూ కూచోవడానికి సాహసించే వారు కారు. అయితే అతడి దగ్గరకు వచ్చి ఎవరూ మాటాడ సాహసించే వారూ కారు.

మానవాళి కోసం కంట తడిపెట్టిన, సనాతన సాంప్రదాయిక శృంఖలాలను ఛేదించడాన్ని బోధించిన మహానాటకకర్త వ్యక్తులకు అంత దూరంగా ఎందుకు ఉండేవాడు? వారిని గురించి పత్రికల ద్వారా మాత్రమే ఎందుకు తెలుసుకొనే వాడు? ఎందుకు ఎల్లప్పుడు ఒంటరిగా ఉండడానికి ఇష్టపడే వాడు? ఎక్కడ నుంచి వచ్చింది ఆభయానక, స్వయం విధిత ఏకాంతం?

దూరపు కొండలు నునుపు. దగ్గరగా చూస్తే గాని అసలు రంగు బయట పడదు. మొదట్లో చాల సరళంగా, నిరాడంబరంగా ఉండే మనిషి కీర్తి పెరగడంతో, పటాటోపాన్ని పెంచాడు. బంగారపు పన్ను, తలాటం ఉన్న చేతికర్రనం చేతపట్టాడు. ''అతడు అప్పుడప్పుడు తల దువ్వుకోవడానికి టోపీ లోపల చిన్న అద్దాన్ని అమర్చుకొన్నాడు'' అని విక్టోరియా మహారాణి మనుమరాలు మేరీలూయిా రాకుమారి రాసింది. జాన్ పాల్సన్ అనే రచయిత అతడి గురించి ఇలా రాశాడు: తోక ఉన్న కోటు, దానిపై గౌరవ బిరుదులను సూచించే రిబ్బన్లు, సిల్కుటోపీ, బంగారు కళ్ళజోడు... పెదవి విప్పని నోరు.... నేను ఒక మూయబడిన పర్వతకుడ్యం ముందు నిలబడ్డాను. అది అభేద్యమైన గోడ''. ఉప్సలా విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేట్ పట్టం ఇచ్చిన తరవాత తన నందరు ''డాక్టర్'' అని సంబోధించడం తన వాంఛితమని తెలియ జేశాడు. డ్రెస్ చేసుకోవడానికి రోజుకు ఒక గంటకాలం వెచ్చించే వాడు.

అతడి గర్వం అంచులు దాటింది. బహుమతులు గౌరవాల పిచ్చి అంతా ఇంతా కాదు. వాటి కోసం అతడు అర్రులు సాచాడు. రాజు కారల్ XV అతడిని ''ఆర్డర్ ఆఫ వస''తో సమ్మానించాడు. దానిని అతడు ఇంట్లో కూడా పెట్టుకు తిరిగేవాడు. ''ఆర్డర్ ఆఫ డాన్ బోర్గ్'' కోసం డేనిష్ న్యాయవాదిని సహాయం ఆర్థించాడు. ''నార్వేలో ఇటువంటి గౌరవాల ప్రభావం ఏమిటో మీకు తెలియ దనుకొంటాను... డేనిష్ బహుమతి ఇక్కడ నా గౌరవాన్ని ఇనుమడింప జేస్తుంది... ఇది నాకు చాలా ముఖ్యం'' అని ఆ న్యాయవాదికి రాశాడు. ఇటువంటి గౌరవాలను ఏర్పాటుచేసే

అమెరికన్ బ్రోకర్‌కు ''ఈజిప్షియన్ మెడల్ కావాలనీ అది నాకెంతో అవసరమనీ'', రాశాడు. చివరకు టర్కిష్‌మెడల్‌ను సంపాదించాడు. 1873లో నార్వీజియన్ ఆర్డర్ ఆఫ్ సెయింట్ ఒలాఫ్, ఆస్ట్రియన్ గాంగ్‌లు లభించాయి. అయినా అతడి దాహం తీర లేదు. ఇంకా మరిన్నింటి కోసం ప్రయత్నించాడు. ''నాకు వ్యక్తిగతంగా ఇటువంటి మెడల్స్, గౌరవాలు అంటే ఏ మాత్రం ఇష్టం లేదు. వాటంతటవి నా కెదురవుతుంటే నేను వాటిని కాదన లేను'', అని ఒక స్నేహితునితో చెప్పు కొన్నాడు. కాని ఇది పచ్చి అబద్ధం. మెడల్స్ కోసం అతడు ఏమైనా చేస్తాడు. ''రాజుగారి రథం దారిలో వస్తుంటే, అందులో ఎవరూ లేక పోయినా, టోపీ తీసి, ఆ రథానికే అభివాదం చేస్తాడు'', అని హాన్స్ హెయబర్గ్ అనే అతడు ''ఇబ్సన్ - ఎ పోర్‌ట్రయిట్ ఆఫ్ ది ఆర్టిస్ట్'' అనే గ్రంథంలో రాశాడు. పోనీ ఇది అబద్ధం అనుకొన్నా, అవసరం ఉన్నా లేకపోయినా అన్ని సమయాల్లోను అతడు మెడల్స్ ప్రదర్శనను మాత్రం మాన లేదు. 1878లో ఒక మామూలు క్లబ్ డిన్నర్‌కు, కుక్క మెడలో పట్టెడలా, మెడల్స్ అన్నీ కూర్చిన పట్టెడను మెడలో వేసుకొని వచ్చాడు. కొన్ని రోజులు అతడు ప్రతి సాయంత్రం వాటిని ధరించేవాడు.

అతడు పెద్ద త్రాగుబోతు కాదు కాని, అతడి నాలుక మాత్రం ''ఆటవిక''మైంది. ఒక డినర్ పార్టీలో కొంచెం డ్రింక్ ఎక్కువైంది. అక్కడే ఉన్న ఆగస్టు లారెంజ్ అనే చిత్రకారుని పట్టుకొని ''నీవు రెండు కాళ్ళమీద నడవ తగిన వాడవు కావు, నాలుగు కాళ్ళమీద ప్రాకవలసిన వాడవు'', అని తిట్టాడు. ''అలా అరక్షితుడైన క్షయ వ్యాధి పీడితుడైన చిత్రకారుని తిడుతూ ఉంటే మాకంతా మాటపడి పోయింది'', అని Knudtzon అన్నారు. క్రిస్టియానాలో అతడి గౌరవార్థం బ్రహ్మాండమైన విందు చేస్తే ఆ విందులో బాగా త్రాగి అతిథి మర్యాదను గూడా పాటించ లేదు. బ్రాండెజ్ ఆ సభలో ఇబ్సన్‌ను ఎంతగానో మెచ్చుకొంటూ మాటాడితే దానికి తిరుగు సమాధానం చెప్పకపోగా ''నాకు నార్వీజియన్ సాహిత్యం గురించి ఏమీ తెలియదు'', అని అతడి అతిథేయునే అగౌరవ పరిచాడు. మరికొన్ని సమ్మాన సభలలో బాగా త్రాగి ''ఏమిటి, ఏమిటి, ఏమిటి?'' అని అనడం తప్ప మరేమీ మాటాడ లేక పోయేవాడు.

అసుఖకర బాల్యానికి తలిదండ్రులను బాధ్యులను చేశాడు. ఒకసారి స్కైయన్ విడిచిపెట్టిన తరవాత మళ్ళీ తన కుటుంబంతో సంబంధం పెట్టుకో లేదు. అంతేకాదు. 1858లో, ధనవంతుడైన తన అంకుల్ (క్రిస్టియన్ పాస్) దగ్గర డబ్బు అప్పుగా పుచ్చు కోవడానికి స్కైయిన్ వెళ్ళినప్పుడు, తన తలిదండ్రులను చూసి రాలేదు. 1867లో తోటి రచయితకు ( ఇతడి కూతురు ఇబ్సన్ కొడుకుని చేసుకొంది) రాసిన దారుణమైన ఉత్తరంలో "కోపం నా బలాన్ని పెంచుతుంది. తల్లి గర్భంలో ఉన్న బిడ్డ అయినా సరే నేను వదిలి పెట్టను.. నా జీవితమంతా నా తల్లిదండ్రుల ముఖం చూడ లేదు. ఎందుకంటే అపరిపక్వ అవగాహనతో గూడిన సంబంధాలను నేను కొనసాగించ లేను" 1877లో తండ్రి చనిపోయే నాటికి వలభై ఏళ్ళుగా అతడితో సంబంధాలు లేవు. తన అంకుల్‌కు రాసిన ఒక ఉత్తరంలో దీనికి కారణం, "మొదటినుంచి ఉన్న అసంభవమైన పరిస్థితులు ముఖ్యకారణం", అనిరాశాడు. దీనికి అసలు అర్థం ఏమిటంటే, "వాళ్ళు (తల్లిదండ్రులు) దిగజారిపోయారు. తాను పైకి ఎదుగుతున్నాడు. వాళ్లు తనని వాళ్లతోపాటు క్రిందకు లాగకూడదు". వికాలాంగుడైన తన తమ్ముడికి గూడ అతడేమీ సహాయపడ లేదు. అతడు అమెరికా వెళ్ళి అక్కడ చనిపోయాడు. అతడి సమాధి మీద రాత ఇలా ఉంది: "అపరిచితులు గౌరవించారు. అపరిచితులు ఖననం చేశారు."

అతడి జీవితంలో ఈ కుటుంబ చరిత్ర కంటే మరో రహస్యమైన కథ ఉంది. 1846లో, పద్దెనిమిదేళ్ళ వయస్సులో, కెమిస్టు షాపులో పనిచేస్తూ ఉండగా, అతనికంటే పదేళ్ళు పెద్దదైన, ఆ షాపులోనే పనిచేస్తున్న ఎల్సీసోఫీ, జెన్స్ డాటర్‌తో, "వ్యవహారం" నడిపాడు. ఆవిడ ఇతడికి 9 అక్టోరు 1846లో హాన్స్ జాకబ్ హెన్రిక్‌సన్ అనే పిల్లవాణ్ణి కన్నది. మార్క్ వెంచన్ లాగానే ఈమె పుట్టింటికి వెళ్లి ప్రసవించి, చాలా విచక్షణ జ్ఞానంతో వ్యవహరించింది. నార్వేజియన్ చట్టం ప్రకారం తల్లిబిడ్డలను అతడు సాకవలసి ఉంది. తన పేదరికం. పైగా వీరిద్దరు. దీనితో అతడు తల్లిని, బిడ్డనూ ఎప్పుడూ క్షమించ లేదు. రూసో, మార్క్‌ల లాగానే ఇతడు కూడా హాన్స్ జాకబ్‌ని తన కొడుకుగా ఎప్పుడూ అంగీకరించ లేదు. పిల్లవాడు కమ్మరి వృత్తిని స్వీకరించాడు. 74వ సంవత్సరంలో 5 జూన్ 1892న అనాథగా ఎల్సి చని పోయింది. బహుశా ఈమె మరణవార్త ఇబ్సన్‌కు చేరి ఉండదు.

హాన్స్ జాకబ్ అచ్చంగా తండ్రిని పోలి ఉండేవాడు. ఇతడు బాగా చదువుకొన్నాడు. అప్పుడప్పుడు క్రిస్టియానాకు వస్తూపోతూ ఉండేవాడు. ఇబ్సన్ రహస్యం తెలిసిన కొందరు, ఇతనిని గ్రాండ్ హోటల్‌లో రోజూ ఇబ్సన్ కూచునే కుర్చీలో, అతని బట్టలు లాంటి బట్టలు వేసి కూచోబెడితే, ఎలా ఉంటుందా అని ఆలోచించారు. అయితే వారు ఆ సాహసం చేయ లేక పోయారు.

తండ్రిని ఇతడు 1892లో మాత్రం ఒకసారి డబ్బు కోసం కలిసాడు. తండ్రి తలుపు తెరిచి, తన 46 ఏళ్ళ కొడుకుని మొదటిసారి చూశాడు. తమ సంబంధాన్ని అతడు కాదన లేదు. కొడుకు చేతిలో ఐదు క్రానులు పెట్టి, ''మీ అమ్మకు నేను ఇచ్చింది ఇంతే. నీకు కూడా ఇంతే చాలు'', అని చెప్పి అతడి ముఖాన తలుపు మూసి వేశాడు. తండ్రి కొడుకు మళ్ళీ కలవ లేదు. తండ్రి తన వీలునామాలో కొడుక్కి ఏమీ రాయ లేదు. హాన్స్ జాకబ్ 20 అక్టోబరు 1916లో మరణించాడు.

ఇబ్సన్ 1858లో సుజానా థొరెసన్‌ను వివాహమాడాడు. ఆమె పుస్తకాల పురుగు. అతడెప్పుడూ ఏకాంతంగా ఉండడానికి ఇష్టపడే వాడు. పెళ్ళి పెళ్ళికోసమే అన్నట్లుగా వారిమధ్య సాగింది. ఈ పెళ్ళి వల్ల ఇబ్సన్‌కు జరిగిన లాభమేమిటంటే, అతడి రచనలు విఫలమైనప్పుడే అతడు చిత్రకారుడుగా మారతానంటే, ఆమె పడనీయ లేదు. అతడిని రచయితగానే ఉంచింది. వారి మధ్య సంబంధాలు అంత సజావుగా లేవు. వారికి ఒక పిల్లవాడు సిగర్డ్ పుట్టాడు. అతడు పుట్టాక ''ఇక పిల్లల్ని కనను'' అంది ఆమె. దానికి అర్థం సెక్సు వద్దని. అప్పుడప్పుడు అతడు భార్యను వదిలివేసి హెల్డర్ హేండర్ సన్‌ను చేసుకొంటాడని రూమర్లు వచ్చేవి. 7 మే 1895లో అతడు భార్యకు రాసిన ఒక ఉత్తరంలో దీనిని తీవ్రంగా ఖండించాడు. ''ఇది తన భార్య సవతి తల్లి వేసిన రూమరు'' అన్నాడు.

మాటల్లో ఆదర్శాల్లో అతడు మానవాళిని బలపరచినట్లు కనిపించే వాడు. అయితే అతడికి ప్రజాస్వామ్యం అంటే ఇష్టం లేదు. ''మెజారిటీ అంటే ఏమిటి?'' అజ్ఞాన ప్రజాబాహుళ్యం. తెలివి తేటలనేవి ఎప్పుడూ మైనారిటీకే చెందుతాయి.

''తెలివైన వాడి చుట్టూ ఎప్పుడూ మెజారిటీ ఉండదు. మెజారిటీ

అతడిని చేరడానికి పదేళ్ళు పడుతుంది. ఈ పదేళ్ళలో అతడు అక్కడే ఉండడు. ముందుకు పోతాడు. అందుకని మెజారిటీ ఎప్పుడూ అతడిని అందుకో లేదు.

''నేను నా మొదటి పుస్తకాలు రాసినప్పుడు ఎక్కడ ఉన్నానో, గుంపులు ఇప్పుడూ అక్కడే ఉన్నాయి. కాని నేను ఇప్పుడు అక్కడ లేను. నేను ఇంకెక్కడో ఎంతో ముందు ఉన్నాను''.

ఇలాంటి ఆలోచనలతో ప్రజలతో, మిత్రులతో, తోటి రచయితలతో, భార్యతో అతడి సబంధాలు సరిగా లేవు. స్త్రీలతో గూడా అతడి సంబంధాలు అలాగే ఉన్నాయి. సిద్ధాంతం ప్రకారం అతడు స్త్రీల పక్షం. స్త్రీల స్థితిని మెరుగు పరచడానికి ఎంతైనా కృషి చేశాడని ఎవరైనా వాదించవచ్చు. "A Dolls' House" అనే అతడి నాటకంలో ''వివాహంలో పవిత్రత ఏమీ లేదు'', ''భర్త అధికారాన్ని ప్రశ్నించవచ్చు'', ''తనను తానెరగడం అన్నిటి కన్నా ముఖ్యం'', అనే అంశాలను నొక్కి వక్కాణించాడు. ఇది స్త్రీ ఉద్యమానికి దోహదం చేసింది. హెడ్ గాబ్లర్ ప్రదర్శించినట్లు ఆడవాళ్ల అనుభూతులను ప్రదర్శించడంలో అతనికి అతడే సాటి.

అందమైన యువతులు అతడి ప్రక్కన ఉండడం అతడికి ఇష్టం. యువతులంటే పదిహేనేళ్ళ వయస్సు వారితో అతడు సంక్లిష్ట పరిభ్రమణ సంబంధాలు పెట్టుకొన్నాడు. యౌవనం అంటే అతడికి అత్యంత ఆసక్తి. మొదటిసారి అతడు ప్రేమలో పడింది పదిహేను సంవత్సరాల హెన్రిక్ హోచ్చుల్స్ట్‌తో. అతడికి డబ్బు పోవడం, ఆమె తండ్రి వద్దనడంతో అది ఆగిపోయింది. ఆ తరవాత 1870లో లారా పీటర్‌సన్‌తో, తరవాత నాలుగేళ్ళకు హెల్డర్ స్టోమ్‌తో. ఈమె వయస్సు పది సంవత్సరాలే. వయస్సుతో అతడి ''యువతి అభిరుచి'' చావలేదు. గెటె (Goethe) కు విలెమర్ అనే ఆమెపై ఉన్న అనుభూతులు అతడి కళకు యౌవనాన్ని అందించినవనే కథ, అతడిని బాగా ఆకట్టుకొంది. అందంగా ఉండి, యౌవ్వనవతి అయిన ఏ అమ్మాయి అయిన అతడితో ఏ పనిఅయినా చేయించుకో గలిగేది.

అతడికి దగ్గరైన వారిలో ముఖ్యులు ఇద్దరు - ఎమిలి బార్డెక్, హెలెన్ రాఫ్డలు, వీరిని అతడు 1889లో కలిశాడు. ఇద్దరూ డైరీలు రాశారు.

వారికి రాసిన ఉత్తరాలు చాలావరకు దొరికాయి. ఎమిలి పద్దెనిమిదేళ్ళ యువతి. ఆమెకంటె అతడు 43 ఎళ్ళు పెద్దవాడు. ఆమె డైరీలో ఇలా ఉంది: ''అతడి వేడి అనుభూతులు నాకు గర్వాన్ని కలిగించాయి. అతడు నాకు చెప్పే వాటిలో బలమైన అనుభూతులను కూర్చి చెప్తాడు. అతడి జీవితంలో ఎప్పుడూ నన్ను అర్థం చేసుకోవడంలో ఉన్నంత ఆనందం పొంద లేదన్నాడు. నన్ను మెచ్చుకొన్నంతగా అతడు ఎవరినీ మెచ్చుకో లేదు. ప్రతి విషయాన్ని బాహాటంగా చెప్పలేవున్నాడు. నేను అతడితో ప్రేమలో పడ్డాననుకొంటాను, కాని బయటికి మాత్రం మేము అపరిచితులుగా ఉంటేనే మంచిదనుకొన్నాము''. అతడు తన భార్యకు విడాకులిచ్చి, ఆమెను పెళ్ళాడే అవకాశం ఉందని చెప్పాడు ఇ. ఎ. జకర్‌తో.

రెండవ ఆమె హెలెన్. మ్యూనిక్ నగర వాసి. ఈమె అతనిని ముట్టుకోనిచ్చేది. కాని వారి సంబంధం మాత్రం లైంగికం కాదు. సాహితీపరమైంది మాత్రమే. నలభై సంవత్సరాల తరవాత హెలెన్ రాసింది. ''ఆడపిల్లలతో అతడి సంబంధాలలో, మామూలు అర్థంలో, అవిశ్వసనీయత ఏమీ లేదు. అతడి ఆలోచనావసరాల నుంచి ఆ సంబంధాలు జనించాయి. అటువంటి ఆడపిల్లలంతా, తన నాటకాలలో ఉపయోగించు కోవడానికి అవసరమైన మూల రూపాలు (Archetypes), మాంసంగా రూపొందించబడిన భావాలు (ideas - made - flesh). అంతేకాని వారంతా వారిని వారిగా ప్రేమించడం కోసం దరిచేర్చిన నిజమైన స్త్రీలు కారు. అందుకని ఇబ్సన్ ఎప్పుడూ గూడా ఎవరితోనూ నిజాయితీగా ప్రేమలో పడ్డాడనడానికి వీలు లేదు. వారినంతా తన నాటకాలలో పాత్రల క్రింద మాత్రమే వాడు కొన్నాడు.

ఉదాహరణకు ఎమిలీని "The Master Builder" లో Hilde Wangel పాత్రలోకి పరివర్తించాడు. తరవాత అతడి ఉత్తరాలు బహిర్గతమైనప్పుడు ఎమిలీని హిల్డె పాత్రగా గుర్తించారు. ఆమె నందరు 'క్రూర స్త్రీ'గా ముద్ర వేశారు.

`A Dolls' House' లో నోరా పాత్రగా పరివర్తితమైన కీలర్ విషయం నార్వేజియన్ స్త్రీలా, మరీ దారుణం. ఆమెను అతడు కొద్దిసార్లే కలిశాడు. ఆమె భర్త చెప్పుచేతల్లో ఉండే మనిషి. అతడికి సహాయ

పడడానికి, అతడు చెప్పినట్లు దొంగతనాలు చేసేది. ఇబ్సన్ ఆమె అణచబడ్డ స్త్రీకి ప్రతీకగా - మాంసంగా పరివర్తితమైన భావంగా - గ్రహించాడు. దీనితో ఆమె కుంగిపోయి, ''తాను ఆ పాత్ర కాదని'' బహిరంగంగా ప్రకటించవలసిందని కోరింది. అలా ఆమె కోరినట్లు ప్రకటించి నందువల్ల అతడికి వచ్చే నష్టం ఏమీ లేదు. అయినా అతడు ఆపని చేయ లేదు. అది అతడి హీన సంస్కారాన్నే సూచిస్తుంది.

1900లో అతడికి మూర్ఛ వచ్చింది. ఒకసారి కోపం, ఒకసారి వ్యాకులత - ఈ నమూనాతో అతడి రోగం సాగింది. తిరస్కారం, కోపాలతో ఉన్న అతడి భార్య అతనిని చూస్తూనే ఉంది. అతడి వ్యాకులత అంతా జీవిత భీమాను గురించి. అతడి శారీరక బలహీనత అతడికి చికాకు కలిగించేది. అతడికి గడ్డం చేయడానికి ప్రతిదినం మంగలి వచ్చేవాడు. అతడితో ఎప్పుడూ మాటాడ లేదు. ఒకసారి మాత్రం ఆకస్మికంగా ''వికృత దయ్యం!'' అని అన్నాడు. ఇబ్సన్ 23 మే 1906న మరణించాడు. చచ్చిపోయే ముందు, '' ఓ నాప్రియమైన భార్యామణీ. నీవు నన్ను ఎంత దయతో చూశావు!'' అని అన్నాడని ఆమె అంది. ఇలా అనడం అతడి శీలంలోనే లేదు. డా. బుల్ డైరీలో ఇలా ఉంది: '' ఆ సాయంత్రం అంతా కోమాలో ఉన్నాడు. నోట మాట లేదు.''

*(91 నవంబర్ మిసిమి)*

సృజనాత్మక కవి

# పెర్సీ బిష్ షెలీ

షెల్లీ ఒకసారి ఒక పంతులమ్మకు ఒక ఉత్తరం రాశాడు. అందులో ఇలా ఉంది: ''నేను కులీనుడను కాను, ఆ మాటకొస్తే పాలకుడిని అంతకంటె కాను. ప్రకృతికి, హేతువుకు బద్ధుడనై అంటే గుణవంతుడనై జీవితాన్ని కొనసాగించాలని కోరతాను''. ఈ సమాజం కుళ్ళిపోయిందని, ప్రతి ఒక్కరు ప్రకృతి ఒడిలో పరవశించాలనీ చెప్పిన రూసో కంటె మరో మెట్టు పైనే ఇతడు ఉన్నాడనిపిస్తుంది. ఇతడి దృష్టిలో మేధావులు, కవులు ప్రత్యేక స్థానాన్ని ఆక్రమిస్తారు. అసలు కవులైతే పేరు పెట్టని శాసనకర్తలు.

**10,000**ల పదాలతో **1821**లో అతడు రాసిన "A Defense of Poetry" లో సాహిత్యం యొక్క సామాజిక ప్రయోజనాన్ని గురించి చెప్పాడు. పద్యం అంటే కేవలం అందమైన పదాల అమరిక కాదు, లేదా వినోదమూ కాదు. ఏ ఇతర సాహితీ ప్రక్రియ కంటె పద్య కవనం భవితవ్యానికి ఎక్కువగా బాటలు వేసేది, జ్ఞాన సంబంధి. సామాజిక ప్రగతి అనేది నైతిక సద్బుద్ధి (ethical sensibility) తో నిర్దేశితం కావాలి. మతం ఈ పని చేయ లేక పోయింది. విజ్ఞానశాస్త్రం ఈ పనిని అసలు చేయ లేదు. హేతువాదం ఒంటరిగా ఈ పనిని నిర్వర్తించ లేదు. ఒక్క కవనం మాత్రమే నైతిక శూన్యతను పూడ్చి ప్రగతికి సృజనాత్మక శక్తిని అందించ గలదు. పద్యం మాత్రమే మనస్సును పెంచి, సాగదీసి, రకరకాల ఆలోచనా సంయోగాలకు గ్రాహకపాత్రగా చేయగలదు. అది మాత్రమే ప్రపంచం గుప్త అందాల, సోయగాలపై ఉన్న ఆచ్ఛాదనాన్ని తొలగించ గలదు. ''నీతి రహస్యం – ప్రేమ మన స్వభావాన్ని వదలి బయటకు నడవడం. తనలోని ఆలోచన, క్రియల్లో ఉండే అందంతో కాక పరులలో ఉన్న ఆ అందంతో తాదాత్మ్యం చెందాలి. అది ''అహం కేంద్రీయతను'' బద్దలు చేస్తుంది. అహాన్ని తగ్గిస్తుంది. సామూహిక భావాన్ని అధికం చేస్తుంది''. ''మనిషి మంచివాడు కావాలంటే, తాను ఇతరుడై చూడాలి; ఇతరుల బాధా సుఖాలు తనవి కావాలి. కవనం కారణం మీద పనిచేసి ఫలితాన్ని సరిదిద్దుతుంది.'' ''నాగరికతా నైతిక ప్రగతిని కవనం సాధిస్తుంది. వాస్తవానికి కవనం, దాని

సహచరి అయిన ఊహ, దాని సహజ పరిసరమైన స్వేచ్ఛలు నాగరికతకు, నీతికి ఆధారాలు. సమాజ పూర్తి పునర్నిర్మాణానికి కవితా కల్పన కావాలి''. - దీని అర్థం సమాజాన్ని కవులు ఏలాలని కాదు: మొదటిసారిగా అతడు పందొమ్మిదవ శతాబ్దికి ముఖ్యలక్షణం అయ్యే భౌతికవాదానికి విమర్శగా ఈ వాదనను లేవదీశాడు. భౌతికవాదం ఈ ప్రపంచంలో డబ్బుగా అవతరించిన స్వార్థ సూత్రం - ఈ రెండూ దేవుడూ దయ్యమూను.

షెలీ కవిత్వంలో ఏమి చెప్పాడో దానినే ఆచరణలో పెట్టాడు. అతడి కవిత్వాన్ని వివిధ రీతులలో అర్థం చేసుకోవచ్చు. కాని అట్టడుగున మాత్రం అతడి కవిత్వం, అతడనుకొన్నట్లే నైతికమూ, రాజకీయమూ. ఆంగ్ల కవులందరిలోకి బాగా రాజకీయ వాసనలున్నవాడు షెలీ. అతడి రచనలన్నీ ఏదో సామాజిక చర్యను చేపట్టాలని సందేశాలిచ్చేవే. ఉదాహరణకు అతడి సుదీర్ఘమైన ''ఇస్లాం విప్లవం'' (The Rvolt of Islam) (దాదాపు 500 పంక్తులు) అణచివేతకు వ్యతిరేకంగా స్వేచ్ఛను గురించి చెప్పింది. మానవాళి స్వేచ్ఛా సమతలు అతడి దృష్టిలో బౌద్ధిక సౌందర్యం. దీనిని మనస్సులో ఉంచుకొని రాసిన A Hymn to Intellectual Beauty ఈ ప్రపంచంలోని దుఃఖం (evil) మీద బౌద్ధిక సౌందర్యం విజయాన్ని కీర్తించింది. ఈ భూమిమీద ఆదర్శ రాజ్యానికి చేసే పయనాన్ని ప్రతీకీకరించిన పురాణ పురుషుని విజయవంతమైన విప్లవాన్ని "Prometheus Unbound" చెబుతుంది. "Ode to the West Wind" లో తన రాజనీతి సందేశాన్ని వ్యాపింపజేయమని, ''నా మృత ఆలోచనలను విశ్వం మీదకు పంపండి'', 'ఆవిధంగా నూతన జన్మ త్వరగా వస్తుంది', 'నా మాటలను మానవాళి మీద వెదజల్లండి' అని చెప్పాడు. `To Skylark' లో గూడ, తన మాటలను సందేశాన్ని ప్రపంచానికి వినిపించడంలోని ఆటంకాలను కష్టాలను గురించి రాశాడు. అతడి జీవిత కాలంలో అతనికి లభించిన కొద్దిపాటి ప్రాచుర్యం అతడిని నిరుత్సాహ పరిచింది. అతడు కవిత్వాన్ని ఎప్పుడూ తన స్వంత సంతృప్తికోసం రాసుకో లేదు. ఇలా రాసిన కవులు చాల అరుదు.

మనిషిగా షెలీ ఏమిటి? మొన్న మొన్నటి వరకు అతడి రెండవ భార్య మేరీ ప్రచారం చేసిన అతడి వర్ణననే అందరూ అంగీకరించారు. ''చాలా

పరిశుద్ధుడు. అవనాయకుడు. ఈలోకం పట్టనివాడు. మోసంగాని, దుర్మార్గంగాని తెలియనివాడు. సున్నిత మనస్కుడు''. ''నాకు తెలిసినంతలో షెలీ చాల మంచివాడు. స్వార్థం ఎరుగని వాడు. తన స్తోమతను మించి త్యాగం చేసిన వాడు. ఇతరుల కోసం పరితపించిన వాడు'', అని బైరన్ అన్నాడు. అయితే బైరన్ చేసిన ఈ వ్యాఖ్యలన్నీ షెలీ విషాదపూరిత అంతిమ దశలో ఉన్నప్పుడు చేశాడని మనం జ్ఞాపకం ఉంచుకోవాలి. అంతేకాదు షెలీ బైరన్‌తో చెప్పిన విషయాల మీద ఆధారపడి బైరన్ ఈ వ్యాఖ్యలను చేశాడు.

కాని వాస్తవం ఇంతకంటె భిన్నంగా వుంది. ఈ అభిప్రాయానికి రావడానికి మూలం ఆయన ఉత్తరాలే. రూసో లాగా ఇతడూ మానవాళిని ప్రేమించాడు. కాని వ్యక్తులను ప్రేమించ లేదు. అతడి ప్రేమ ఒక అమూర్తజ్వాల. మూర్తమానవులు దగ్గరకు వచ్చినప్పుడు వారు మసైపోయే వారు.

**1792** ఆగస్టు **4**వ తేదీన ససెక్స్‌లో కులీన వంశంలో జన్మించాడు షెలీ. ఇతడికి నలుగురు చెల్లెళ్ళు. తల్లి, తండ్రి. చెల్లెళ్ళకు అతడొక మహారాజు. మొదటి నుంచీ అతడికి ప్రకృతి అంటే ఇష్టం. రసాయనిక పదార్థాలు, బెలూన్లతో ప్రయోగాలు చేసేవాడు. పన్నెండవ యేట ఈటన్‌కు పంపించారు. అక్కడ గ్రీకు, లాటిన్, ప్రాచీన సాహిత్యాల అభ్యాసనం చేశాడు. అద్భుతమైన బాలుడుగా ప్రకాశించాడు.

**1776** ఆడమ్ విష్‌హాప్ట్ (Adam Weishaupt) ఇల్యూమినాటి (Illuminati) రహస్య సంఘాన్ని స్థాపించాడు. ఇందులో సభ్యులు ''జ్ఞానదీప్తి'కి ప్రతీకలని భావిస్తారు. దీని లక్ష్యం ఏమంటే, ''ఈ భూమిమీద అహింసాయుతంగా రాకొమరితలు, రాకుమారులు అంతరించి, మానవజాతి అంతా ఒకే కుటుంబంగా తయారై, హేతువాదులయ్యే వరకు ఈ ప్రపంచానికి వెలుగునివ్వడం''. దీనిని షెలీ పూర్తిగా విశ్వసించాడు. దీనితోపాటు దీని వ్యతిరేకులు చెప్పిందాన్ని గూడ కలగాపులగంగా స్వీకరించాడు.

మొట్టమొదట అతడు రాజకీయంగా చేసిన పని, జ్ఞానోదయం అయిన,

నిష్పక్షపాతులైన వారితో ఒక రహస్య సంఘాన్ని స్థాపించాలని లై హంటుకు సూచించడం. అతడు బడి చదువులో ఉండగానే ' ఈటన్ నాస్తికుడు'గా పేరు మోసాడు. తండ్రి, తాతలు అతడు రాసిన పద్యాలు గ్రంథ రూపం పొందడానికి సహాయ పడ్డారు. వీళ్ళు ఈ పని ఎందుకు చేశారంటే, షెలీ మత వ్యతిరేక భావనలకు పైకి వ్యక్తీకరించ కుండా ఉండాలనే షరతు మీద. దీనికి షెలీ ఒప్పుకొన్నాడు. కాని తరవాత దీనిని పాలించ లేదు. మార్చి 1811లో ఆక్స్‌ఫర్డ్ మొదటి సంవత్సరంలో ఉండగా, తన మత వ్యతిరేక భావనలు పైకి చెప్పాడు. ఇందులో అతడి సొంతం ఏమీ లేదు. జాన్‌లాక్, డేవిడ్ హ్యూమ్‌లు చెప్పినవే. ''భావాలు జ్ఞానేంద్రియాల నుంచి వస్తాయి కనుక, దేవుడు జ్ఞానేంద్రియాల ముద్రల నుంచి లభించడు కనుక, విశ్వాసం ఐచ్ఛికం కాదు కనుక, అవిశ్వాసం నేరం కాదు''. దీనికి అతడు ''నాస్తికత ఆవశ్యకత'' అని పేరు పెట్టాడు. దీనిని బిషప్‌లందరికి, అన్ని కళాశాలలకు రెచ్చగొట్టే ఉద్దేశంతో పంపించాడు. ఫలితంగా అతన్ని ఆక్స్‌ఫర్డ్ నుంచి పంపించి వేశారు. అతనిని కనీసం పెద్దవాడయ్యే వరకైనా ఆ భావాలను పైకి చెప్పవద్దని తండ్రి భంగపడ్డాడు, విలపించాడు, అరిచాడు, కోప్పడ్డాడు. షెలీ అప్పుడు పెద్ద విలన్‌లా, దయ్యంలా, పకపక నవ్వుతూ వెల్లికిలా నేలమీద పడిపోయాడు. ''కుటుంబ ప్రశాంతి కంటే, తనకు తన భావాలే ముఖ్యం'' అన్నాడు షెలీ. తలిదండ్రులకు తెలియకుండానే తన సోదరి ఎలిజబెత్ సహాధ్యాయిని అయిన పదహారేళ్ళ హారియట్ వెస్ట్ బ్రూక్‌ను వివాహం చేసుకొని ( ఆగస్టు 1811) ఒక బాంబు పేల్చాడు.

దీనితో అతడికి కుటుంబంతో సంబంధాలు చెడినాయి. స్నేహితుడికి రాసిన ఒక ఉత్తరంలో, తన కుటుంబం అంతా స్వార్థపరుల కూపమని, వారికి తినడం, త్రాగడం, నిద్రపోవడం కంటే వేరే ఏమీ పని లేదని రాశాడు. ఒక్కోసారి తండ్రిని మంచి చేసుకోవడానికి మంచిగా ఉత్తరాలు రాసేవాడు. కొన్నిసార్లు తిడుతూ రాసేవాడు. ఒకసారి తండ్రిమీద కోపంతో, ''నాకు దొరికే మొదటి అవకాశాన్ని నిన్ను చూడడానికి ఉపయోగిస్తాను. నాకు డబ్బు ఉంటే నిన్ను అప్పడే లండన్ హోటల్లో కలిసి నీ చెవిలో బిషి, బిషి, బిషి, హేయ్ బిషి, బిషి అని జోరీగలాగ నీకు చెవుడు వచ్చేవరకు గీపెట్టేవాణ్ణి''.

అక్టోబరు 22న అతడు తల్లికి రాసిన ఉత్తరం మరీ ఘోరంగా ఉంది.

గ్రహామ్‌తో 'వ్యవహారం' నడుపుతున్నావు. అది కప్పి పెట్టుకోవడానికే నా చెల్లి ఎలిజబెత్ పెళ్ళి అతనితో ఏర్పాటు చేస్తున్నావు'' అని రాశాడు. ఇదే ఉత్తరాన్ని అందరికి బహిరంగ పరచ వలసిందని చెల్లి ఎలిజబెత్‌కు రాశాడు. కాని ఈ ఉత్తరంలోని ఆరోపణలు నిజమనడానికి ఆధారాలేమీ లేవు.

తన సోదరీమణులైన హెలెన్, మేరీలను తలిదండ్రుల వద్ద లభించే పశు జీవితం నుంచి విముక్తం చేయాలనుకొన్నాడు. షెలీ గోడ్విన్‌సర్కిల్లో సభ్యుడయ్యాడు. అతడి ''విముక్త'' కూతురుతో స్నేహం చేశాడు. ఈమె తల్లి మహిళా స్వేచ్ఛా ఉద్యమ నాయకురాలు. ఆ సర్కిల్‌లో లభించే మగవాళ్ళను ఉమ్మడిగా పంచుకొనే (కనీసం సైద్ధాంతికంగా) యువస్త్రీల మధ్య తన వయోజన జీవితాన్ని గడిపాడు. 'అగమ్య గమనం' అంటే బైరన్ లాగ పెద్ద పట్టింపు లేదు షెలీకి. బైరన్ తన అర్ధసోదరి (Half Sister) ఆగస్టాలే (Angusta Leigh) తో ప్రేమ నడిపాడు. "The Revolt of Islam" లో షెలీ ప్రవేశపెట్టిన నాయకులు సోదరీ సోదరులు అయితే పబ్లిషరు షెలీపై ఒత్తిడి తెచ్చి మార్పించాడు.

అతడి భార్య హారియట్ మధ్య తరగతికి చెందిన అందమైన పిల్ల; వ్యాపారి కూతురు. షెలీతో తల మునకల ప్రేమలోపడి అతడితో పలాయనం చేసింది. అక్కడ నుంచి ఆమెకు కష్టాలు ఆరంభమయ్యాయి. అతడి జీవితంలో స్థిరత్వం లోపించడం, అప్పుల బాధలు, చట్టవ్యతిరేకమైన అతడి పనులు, అపాయకరమైన రసాయనిక ప్రయోగాలతో ఇరుగు పొరుగును చెడు చేసుకోవడం - అన్ని కలిసి ఆమెకు మనశ్శాంతి లేకుండా చేశాయి. అయినా ఆమె అతడి పనులలో హృదయ పూర్వకంగానే పాల్గొంది. అతడు రాసిన సుదీర్ఘమైన పద్యం "Queen Mab" ఆమెకు అంకితమిచ్చి నప్పుడు ఆమె ఎంతో సంతోషించింది. ఒక కొడుకు చార్లెస్‌ను, ఒక కూతురు ఎలిజాను అతనికి కన్నది.

ఏ భార్య ఏ భర్తను ఎల్లకాలం ఆకర్షించ లేదు. షెలీ ప్రేమ లోతైంది, గాఢమైందీ, మోహపూరితమైందీను. అయితే ఉన్నలోపం అల్లా అది ఎప్పుడూ ఒకే వస్తువుమీదే నిలవదు. జూలై 1814లో తాను గోడ్విన్ కూతురు మేరీతో ప్రేమలో పడ్డానని భార్యకు చెప్పాడు. ఆమెతో ఐరోపా

ఖండం పర్యటనకు వెళ్ళి పోయాడు. ఆ తరవాత అతడు తన భార్యకు రాసిన ఉత్తరాలన్నీ తండ్రికి రాసిన ఉత్తరాల ఫక్కీలోనే ఉన్నాయి. కాసేపు బుజ్జగిస్తూ, కాసేపు తిడుతూ నడిచాయి ఆ ఉత్తరాలు.

**1814** నవంబరు **30**న పుట్టిన అతడి పుత్రుణ్ణి అతడు ఎప్పుడైనా చూశాడా? అనేది సందేహం. అయితే అతడు రూసో మాదిరి పిల్లలను ఆటంకంగా పరిగణించ లేదు. పై పెచ్చు పిల్లలకోసం న్యాయ స్థానాన్ని ఆశ్రయించాడు. అతడు ఓడి పోయాడు. పిల్లల్ని పెంచమని హారియట్ తన సోదరిని కోరింది.

నవంబరు **9**న ఆమె అంతర్ధానమైంది. డిసెంబరు **10** న ఆమె శవమై హైడ్ పార్క్‌లో కనిపించింది. దీనికి షెలీ ప్రతిస్పందించిన తీరు ఘోరంగా ఉంది. అతడు మేరీకి రాసిన ఉత్తరంలో ఇలా ఉంది: ''పాపం ఆ దిక్కుమాలిన ఆడది.... ఆమెను తల్లిదండ్రులు వెళ్ళగొట్టారు. వేశ్యా వాటికలో అడుగుపెట్టింది. స్మిత్ అనే వాడితో వ్యవహారం నడిపింది. వాడు వదిలి వేసే సరికి ఆత్మహత్య చేసుకొంది. పాములాంటి ఆమె సోదరి, ఈమెను చంపడం ద్వారా ఆ ముసలివాడి ఆస్తిని పొందింది.... అందరూ నాకు చేయ వలసిందంతా చేశారు. ఆమె యెడ నేను ఎంతటి ఋజువర్తనను, ఉదారతను ప్రదర్శించానో అందరికీ తెలుసు'.

షెలీ మరో ఆత్మహత్యకు గూడ కారకుడయ్యాడు. అయినా అతడు చలించ లేదు. గోడ్విన్ భార్య మొదటి సంబంధానికి పుట్టిన ఫానీ ఇమ్‌లీ ఒకనాడు **1814** సెప్టెంబరు **10-14** మధ్య సాయంత్రం అతడిని కలిసింది. (ఈమె అతడిని ప్రేమించిందని గోడ్విన్ అతని భార్య భావించారు.) అప్పుడామెను విమోహితను చేశాడు. 9 అక్టోబరు నాడు అతడు, మేరీ క్లారేలు ముగ్గురూ ఫానీ నుంచి ఒక ఉత్తరం అందుకొన్నారు. ఆమె ఎంతోగానో కుంగిపోయి రాసిన ఉత్తరం అది. ఆమె కోసం, ఆ ఉత్తరం చూసిన తక్షణం, షెలీ ఆమెను కలవాలని వెళ్ళాడు. కాని ఆమె అక్కడ లేదు. అంతకు ముందే ఆమె స్వాన్‌సీకి వెళ్ళింది. ఆ తరవాత రోజు నిద్రమాత్రలు అతిగా సేవించి జీవితం చాలించింది. ఆమెను గురించి షెలీ ఎప్పుడూ తన ఉత్తరాలలో పేర్కొనలేదు.

అలాగే షెలీ భావాల బలిపీఠం ముందు ఎంతో మంది హతులయ్యారు. ఎలిజబెత్ మీచ్‌నర్ అనే బడిపంతులమ్మకు అదే గతి పట్టింది. ఈమె సమూలపరివర్తన వాది. తన భావాల కరపత్రాల పంపిణీకి బాగా పనికి వస్తుందని ఆమెతో షెలీ ఉత్తర ప్రత్యుత్తరాలు నడిపి, ఒకసారి ఆమెకు చెక్కపెట్టెనిండా తన విప్లవ సాహిత్యాన్ని నింపి, పోస్టేజిని కొంతవరకే కట్టి పంపాడు. మిగతాది ఆమెకు చేరిన తరవాత ఆమె కడుతుందనే ఉద్దేశంతో అలా చేశాడు. ఈకారణంగా అది అధికారుల దృష్టిలో పడి, ఆమె ఉద్యోగం ఊడింది. అప్పుడు షెలీ ఆమెను తన సంఘంలో చేరమని పిలిచాడు. ఆమెను ఎంతగానో మెచ్చుకొన్నాడు. అయితే హారియట్‌కూ ఆమె సోదరికీ మొదట్లో ఆమె అంటే ఇష్టం ఉన్నా, తరవాత వారికి అసహ్యం వేసింది. ఒకనాడు సముద్రతీరాన వాహ్యాళిలో అతడు ఆమెను విమోహితను చేశాడు. తరవాత అతడికీ ఆమె అంటే జుగుప్స కలిగింది. ఆమెను తిరిగి పంపి వేశాడు. ఆ తరవాత ఆమెను బ్రౌన్ దయ్యం అన్నాడు. ఆమె దగ్గర తీసుకొన్న 100 పౌనులు అప్పు తీర్చ లేదు. ఆ విధంగా ఆమె షెలీ జ్వాలకు సమిధ అయింది.

అలాగే డాన్ హీలే అనే పదిహేను సంవత్సరాల బాలుణ్ణి గూడ కరపత్రాలు పంచడానికి, గోడల మీద పోస్టర్లు అంటించడానికి కుదుర్చు కొన్నాడు. అతడిని పట్టుకొని అధికారులు 200 పౌనులు జరిమానా వేశారు. ఆ జరిమానాను షెలీ చెల్లిస్తాడని అందరూ ఆశించారు. కాని అది జరగ లేదు. తరవాత జైలు నుంచి తిరిగి వచ్చిన అతనిని ఆరు నెలలు ఉంచుకొని, అతనికీ జీతం పూర్తిగా ఇవ్వకుండానే పంపివేశాడు. ఆ విధంగా ఈ సమిధ అంధకారంలోకి వెళ్ళి పోయింది.

ఇవన్నీ జరిగి నప్పుడు అతడు చాలా చిన్నవాడు అని ఎవరైనా వాదించవచ్చు. నిజమే అతని వయస్సు 1812లో 20 ఏళ్ళు మాత్రమే. హారియట్‌ను వదిలివేసింది 22వ యేట. ఆ మాటకువస్తే ఆంగ్ల సాహిత్యాన్ని మార్చిన కవులందరూ పిన్నవయస్కులే. కీట్స్ చనిపోయే నాటికి వయస్సు 25. షెలీ తన 29వ యేట మరణించాడు. బైరన్ వయస్సు 36. ఒక అర్థంలో వీరంతా పిల్లలే అయినా, ప్రపంచంలో అప్పుడున్న

విలువలను మార్చి, తమ విలువలను ప్రతిపాదించిన మేధావులు. ఈ విషయంలో వారిని చిన్నవారని భావించలేము.

తరవాత అతని ఆర్థిక వ్యవహారాలు అంతే. అందిన చోటెల్ల అప్పు చేశాడు. మళ్ళీ తీర్చేపని లేదు. ఎప్పుడూ హడావుడిగా బయలుదేరడం. చుట్టుప్రక్కల వాళ్ళు అప్పులు అలాగే మిగిలి పోవడం. ఆ విధంగా అంతా శత్రువులుగా మారడం జరిగింది. ఆడవాళ్ళ దగ్గర - చాకలి, పనిమనిషి, ఇల్లు గల ఆవిడవద్ద - అప్పు చెయ్యడానికి వెనకాడ లేదు. ఇటాలియన్ స్నేహితురాలు దగ్గర 220 క్రౌన్లు అప్పు చేశాడు. ప్రతి వ్యాపారస్తునికి బాకీయే.

ఆయన పద్యాలను అచ్చువేసిన వారికి, అమ్మి పెట్టిన వారికి అందరికీ బాకీయే. స్లాటర్ అనే ఆక్స్‌ఫర్డ్ పుస్తక విక్రేత వద్ద 20 పౌనులు అప్పు చేశాడు. షెలీ యూదు వడ్డీ వ్యాపారుల చేతుల్లో పడగూడదనే అతడు సహాయం చేశాడు. 1831 లో స్లాటర్ సోదరుడు షెలీ తండ్రి తిమోతికి ఒక ఉత్తరం రాశాడు. ''మీ పుత్రుడు వడ్డీ వ్యాపారుల అధిక వడ్డీల బారిన పడకుండా తప్పించాలనే సదుద్దేశంతో మేము 1300 పౌనులు పోగొట్టుకొన్నాము''.

ఏది ఏమైనా అతడు మహాకవి. ప్రపంచాన్ని పరివర్తనం కావించేది కవితావేశం, లేదా బౌద్ధిక సౌందర్యం. ఈ లక్షణం కవులకు ఎక్కువగా ఉంటుంది. అందుకే అతడు కవులను అనధికార సహజ శాసనకర్తలుగా అభివర్ణించాడు. కవుల్లోకి మహాకవి అతడు. ఒకరేమిటి అన్ని వర్గాల వారి - దళితులు, ఫ్యాక్టరీ కూలీలు, దొంగలు, దొరలు అందరి - ఊహాత్మక సహానుభూతి (imaginative Sympathy) కి అతడు పాత్రుడయ్యాడు. తనకు వరంగా లభించిన కవితాశక్తితో అతడు రాజకీయ ప్రగతికి కృషిచేశాడు. సమాజం - సమూలంగా వ్యవస్థిత మత నాశంతో సహా - పూర్తిగా పరివర్తితం కావాలని ఆశించాడు.

షెలీ, విలియమ్స్, లివిరానో నుంచి లెరిసికి బోట్‌లో 8 జూలై 1822 అనుకూల వాతావరణ పరిస్థితులలో వస్తున్నారు. సాయంత్రం 6-30గంటలకు పెనుతుఫాను. మరో బోటు కెప్టెన్ వీరిని తన బోటు మీదికి రావలసిందిగా

కేక వేశాడు. కాని షెలీ, ''రాము'' అని తిరిగి ఆ పెనుగాలిలోనే అరిచాడు, అలాగే ఆ డాన్‌జాన్ అనే బోటు మునిగి పోయింది.

మేరీ చిన్నారి పెర్సీ (జమీందారుకు వారసుడు, చార్లెస్ చనిపోయాడు)తో ఇంగ్లాండు వచ్చింది. షెలీ, జ్ఞాపకార్థం ఒక చిహ్నాన్ని నిర్మించాలని తలపోసింది. అయినా ఆవిడ హృదయ ఫలకం మీద పడిన గాయపు మచ్చలు కెలక వేస్తూనే ఉన్నాయి. పెర్సీ చదవడం, రాయడం నేర్చు కొంటున్నప్పుడు చూసిన ఒక స్నేహితుడు, ''తప్పకుండా ఇతడు అసాధారణ వ్యక్తి అవుతాడు'', అన్నాడు. వెంటనే మేరీషెలీ అంది. ''పాపం శమించుగాక. అతడు మామూలు మనిషిగా పెరగాలని ఆశిస్తాను''.

*(91 ఫిబ్రవరి మిసిమి)*